

గత జనవరిలో బ్రెజిల్ ప్రభుత్వం రూ. 11,500 ల వెలకు కొన్న ఒంగోలు జాతి ఎద్దు వయస్సు 5 సంవత్సరాలు. యజమాని శ్రీరావులపల్లి మల్లిఖార్జునరావు (చిత్రంలో వున్నారు) కాటూరు. వీరవల్లి పంచాయతీ సమితి, కృష్ణా జిల్లా. 1957–58 లో వీరవల్లి బ్లాకు నిధులతో పశుపోషణ శాఖవారి ప్రీమియం పథకం క్రింద దీనిని సగం ధరకు సప్లై చేశారు. 1958 మార్చిలో కొత్తఢిల్లీలో జరిగిన అఖిలభారత పశు ప్రదర్శనంలో ఒంగోలు జాతి పశువుల్లో దీనికి ప్రథమ బహుమానం లభించింది. 1959 ఫిబ్రవరిలో బెంగుళూరులో జరిగిన అఖిలభారత పశుప్రదర్శనంలో కూడా యిది పాల్గొన్నది. అనేక స్థానిక పశు ప్రదర్శనాలలో కూడా పాల్గొని బహుమతులు గెలుచుకుంది.

# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి 4 | ఏప్రిల్, 1960 | సంచిక 6

చైత్రం, శకము—1882

## విషయసూచిక



ముందు అట్ట:- రంజాన్ ఈద్ రోజు హైదరాబాద్ ఈద్‌గాలో ప్రతి యేటా ప్రార్థనలు జరుగుతవి. ఆ సందర్భాన మిత్రులు ఒకరినొకరు అభినందించుకుంటున్న దృశ్యం. (29-3-60)

వెనుక అట్ట:- భద్రాచల రామాలయం ముందు భక్తిరస ప్రవాహంలా పారుతున్న గోదావరి తల్లి. శ్రీ రామ నవమికి (6-4-60) లక్షలాది ప్రజలు భద్రాచలం తీర్థయాత్రకు వస్తారు.

చందా వివరాలు :

సంవత్సరానికి ... 2 రూపాయల 16 నయాపైసలు.

విడిప్రతి వెల . . 18 నయాపైసలు,

Edited and Published by the Director of Information and Public Relations, Hyderabad
Printed at: Vir Milap Press, Mukaramjahi Road, Hyderabad.

# చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం

## నినాదాల పోటీ

---

చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం సందర్భంగా 'నినాదాల' పోటీ నిర్వహించ బడుతున్నది. రెండు లేక నాలుగు పంక్తులలో 'నినాదం' గేయ రూపంలో వుండాలి. పొదుపు ఉద్యమానికి బహుళ ప్రచారం కలుగ జేసేదిగా వుండాలి. ఈ పోటీకి సంబంధించిన వివరాలు :

(1) నినాదం ఆంగ్లంలోగానీ, తెనుగు లేక ఉరుదులోగానీ వుండాలి.

(2) ది. 15-4-1960 తేదీనగానీ, తత్పూర్వంగానీ, పోటీ రచనలు సమాచార, పౌరసంబంధాల శాఖ డైరెక్టరుకు అందునట్లు పంపాలి.

(3) ప్రతి పోటీదారు పైన చెప్పిన మూడు భాషలలోనూ ఒక్కొక్క నినాదం పంప వచ్చు. ఒకే వ్యక్తి నుండి ఒకటి కంటే ఎక్కువ నినాదాలు పోటీకి ఆమోదించటానికి, అవి వివిధ భాషలకు అంటే ఆంగ్లము, తెనుగు, ఉర్దూ భాషలకు చెందినవి అయివుండాలి.

(4) ప్రతి భాషలోనూ ఉత్తమమైనవిగా నిర్ణయించబడిన రెండు రచనలకు ప్రధమ, ద్వితీయ బహుమతులు యిస్తారు. ప్రధమ బహుమతి విలువ రూ. 50లు; రెండవ బహుమతి రూ. 25లు. ఇవి కాక ప్రతి భాషలోనూ మూడింటికి మించకుండా రు. 15ల విలువగల కన్సొలేషన్ బహుమతులు కూడా యిస్తారు.

(5) బహుమతులన్నీ 12 ఏండ్ల నేషనల్ సేవింగ్ యాన్యువల్ సర్టిఫికెట్ల రూపంలో వుంటాయి. బహుమతులు పొందిన 'నినాదాల' మీద నేషనల్ సేవింగ్స్ డైరెక్టరుకు కాపీరైట్ వుంటుంది.

(7) నేషనల్ సేవింగ్స్ డైరెక్టరు అధ్యక్షతన గల అడ్‌హాక్ కమిటీ వారి నిర్ణయమే బహుమతుల విషయంలో తుది నిర్ణయము. ఫలితాలు 1960 జూన్ ఆంధ్ర ప్రదేశ్ పత్రికలో ప్రకటించ బడుతవి.

(8) ఫలితాల ప్రకటన అనంతరం, ఈ విషయం గురించి ఉత్తర ప్రత్యుత్తరాలు జరగవు. పోస్టు ఖర్చులు పంపనిదే, బహుమతులు రాని రచనలు తిరిగి పంప బడవు.

# తొలి పండువు

వేదుల సత్యనారాయణశాస్త్రి

ఏ చూతము చిగుర్చెనో చూతమని తోట తోటకుఁ గోయిల మేటి తిరిగె.
ఏ తీవ పూచినదో తీరికగ, జూడఁ బోద పొదకును దేటి కొదమ వోయె
ఏ విరి వికసించెనో వెదకాడఁగాఁ దీఁగ తీఁగకుఁ దేనెటీగ చనియె
ఏ పండు దొరదొనో పరీక్షింపఁగాఁ జెట్టు చెట్టుకు రామ చిలుక యేగె

భామినీకైశ్యమల్లి పరిమళమ్ము
కొల్లఁగొను సందెగాలి యిల్లిల్లు మూరె
నవనవోన్మేషమై వసంతమ్ము తోడ
వచ్చెఁ దొలి పండువైన శార్వరి యుగాది.

అరువది యేడులయ్యె భవ దాగమనంబయి నాఁటి దాస్యపున్
బరువు దొరంగి స్వేచ్ఛగల భారత జాతి సమస్త మిప్పుడ
చ్చెరు వరువార స్వాగతము చెప్పుచునున్నది బాల భాను సుం
దర కిరణారుణద్యుతి వికాస సముస్మిషితో న్ముఖమ్ముగన్.

ఎదలోని రాగ సంపద వోని నునువి కెంజిగురు జొంపము గద్దె సవదరించి
కడకంటి వెలివారు కరుణామృతము వోని సుకుమరందమున పాద్యము నొసంగి
చెక్కుటి చిరునవ్వు సిరిలోని విరిమల్లె పూఁదోసిళ్ళతోఁ బూజ సలిపి
అలయికలో గాలి మొలక తావికకుహూరుతములతోడ స్వాగతము పలికి

జీవితము వోలెఁ దీపియుఁ జేఁదుగలుగు
వేఁపపూ పచ్చడింత నైవేద్యమొసఁగి
యరువ దేండ్లకు వచ్చిన యతిధి కాంధ్ర
రాష్ట్రమిచ్చు నానంద నీరాజనమ్ము.
తెనుఁగు వాకిళ్ల పచ్చని తోరణాలు
తెనుఁగు తోటల గుబుళ్లాను మాలిపూలు
పల్లె పల్లెను పెండ్లి పందిళ్లచాలు
అంతకంతకు శ్రీ వసంతోత్సవాలు.

పూల తోటలనిండ బుక్కా గులాలు
చలువ తెమ్మెర యూరుపుల సుగంధాలు
తేటి పాటల తేనె తీయందనాలు
కలికి కోయిలల పాటల కచేరీలు
ఇంటింట తెలుగు సాహిత్య దీపాలు
రచ్చరచ్చను శాంతి రాయబారాలు
వాడ వాడల కళా భాగవతాలు
ఏటికేడాది మాకిచ్చే వరాలు.

కూడుగుడ్డల కెట్టి కొరతలేకుండ
పాడి పంటలకు లోపమ్ము రాకుండ
మనసులో మాటలో మమతలు నిండ
జాతిలో మతములో సఖ్యమ్ము పండ
ఏటి కేడాది మాకెపద పూదండ.



ఇల్లు చూసి యిల్లాలిని చూడమన్నారు.

— తెలుగు సామెత.

# పరిపాలనా పద్ధతి సంస్కరణ సంఘం

## నియామకానికి నిర్ణయం జరిగినట్లు బడ్జెట్ చర్చలకు జవాబు చెబుతూ ఆర్థిక మంత్రి ప్రకటన

అవినీతి నిరోధానికి కట్టుదిట్టమయిన చర్య తీసుకోవాలని ప్రభుత్వం యొక్క దృఢాభిప్రాయమయి ఉన్నది. ఒక సీనియర్ ఆఫీసర్ అధికారిగా అవినీతికి అతీతులయిన సిబ్బందితో అవినీతి నిరోధానికి ప్రత్యేకం ఒక డైరెక్టరేటును యేర్పాటు చేయాలనే ఆలోచనకూడా ప్రభుత్వానికున్నది అని 1960 మార్చి 1న రాష్ట్ర శాసనసభలో బడ్జెటు చర్చలకు సమాధానం చెబుతూ ఆర్థిక మంత్రి శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి ఉద్ఘాటించారు.

ఈ సందర్భంలో బొంబాయిలో అమలులోనున్న పద్ధతి పరిశీలించబడగలదన్నారు. ప్రభుత్వ శాఖలలో అవినీతిని తగ్గించే విషయంలో ప్రభుత్వంతో సహకరించమని సభ్యులకు ఆయన విజ్ఞప్తి చేశారు

కార్య విధానాన్ని సరళం చేయడం, అధికారాల దత్తత, పనిలో జరిగే ఆలస్యాలను తగ్గించటం విషయంలో సిఫార్సులు చేసేందుకు పరిపాలనా పద్ధతి సంస్కరణ సంఘాన్నొకదానిని యేర్పాటు చేయాలని ప్రభుత్వం నిర్ణయించినదని కూడా ఆయన ప్రకటించారు.

ఫిబ్రవరి 20 న శాసనసభలో ప్రవేశపెట్టిన 1960–61 బడ్జెటు అంచనాలపై జరిగిన 5 రోజుల చర్చలకు జవాబు చెబుతూ మద్యనిషేధం అమలుబాధ్యతను పోలీసుశాఖ నుంచి తప్పించాలని ప్రభుత్వం నిర్ణయించినటు ఆర్థిక మంత్రి వెల్లడించారు.

సీరా తీయటానికి వేలం వేసే చెట్లనుంచి వచ్చే ఆదాయాన్ని పంచాయతీ సమితులకు యివ్వాలన్నసూచన ఒకటి పరిశీలనలో ఉన్నదని మంత్రిగారు చెప్పారు. అది క్లిష్ట సమస్య. దాని విషయంలో ప్రభుత్వం యిదమిత్థమనే అభిప్రాయానికి రాలేదు.

రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు విద్యుచ్ఛక్తి విస్తరణకై రెండుకోట్ల రూపాయలను అప్పుచేయాలని ఆలోచిస్తున్నట్లు మంత్రిగారు వెల్లడించారు.

రాష్ట్రానికి ఒక లా కమిషన్‌ని నియమించాలన్న సూచనను ప్రస్తావించి అటువంటి కమిషన్ అవసరం అవునో కాదో ప్రభుత్వం పరిశీలించగలదనీ, యీ విషయంలో నిర్ణయం దాదాపు రెండు నెలల్లో జరుగగలదనీ చెప్పారు. ఆంధ్ర రాష్ట్రం యేర్పడిన పిమ్మట ఏ శాసనమయినా అల్ట్రా వైర్స్‌గా ప్రకటింపబడినదనడం సరికాదన్నారు.

### రెవిన్యూ బోరు

రెవిన్యూబోర్డు రద్దు విషయంలో, పొదుపు సంఘం అధ్యక్షుడుగా రెవిన్యూబోర్డు రదును తాము సిఫార్సు చేశామన్నారు, కాని, ప్రస్తుత సంస్థ కంటె తప్పక యెక్కువ ఉపయోగకరమయితే తప్ప కొత్త సంస్థను దేనినీ ఏర్పాటు చేయకూడదన్నారు. ఆయన యిటీవల మద్రాసు ఆర్థిక మంత్రి, ప్రధాన కార్యదర్శులతో చర్చలు జరిపారు. ఈ విషయంలో ఆయన తమ అభిప్రాయాలను వ్యక్తీకరించారు.

పసుపుపై అమ్మకం పన్ను తగ్గించబడాలన్న కోరికను ప్రస్తావించి యీ విషయం పరిశీలించబడుతున్నదనీ, నిర్ణయం ఒక నెల రోజులలో తీసుకొనబడగలదనీ అన్నారు.

మద్యనిషేధాన్ని ప్రస్తుతం తెలంగాణాకు విస్తరించడం సాధ్యం కాదన్నారు. ఈ విషయం తెలంగాణా సభ్యులు జాగ్రత్తగా పరిశీలించవలసినదన్నారు.

రాష్ట్రీ తృతీయ ప్రణాళిక పెట్టుబడి రూ. 600 కోట్లు ఉండాలన్న సభ్యుల కోరికను పురస్కరించుకొని యీ విషయంలో ప్రభుత్వం తన శక్తిపంచన లేకుండా కృషి చేయగలదన్నారు. ప్రణాళిక పరిమాణం రూ. 350 ఉండగలదని యిటీవల ప్రణాళికల మంత్రి అన్నప్పుడు ఆయన కేంద్ర విభాగం మినహా రాష్ట్రీ విభాగం పెట్టుబడినే లెక్కలోనికి తీసుకొని ఉండవచ్చునన్నారు. ద్వితీయ ప్రణాళిక పెట్టుబడి రూ. 175 కోట్లు కాగా కేంద్ర విభాగంలో రాష్ట్రానికి రూ. 57 కోట్లు మాత్రమే లభించాయన్నారు. రాష్ట్రానికి యింతకంటె యెక్కువ రావలసి వుంది. ఈ విషయం జాతీయాభివృద్ధి మండలి దృష్టిలోనికి గట్టిగా తీసుకురాబడినది.

ఆంధ్రప్రదేశ్‌కి కేంద్ర విభాగం వాటాజనాభా నిష్పత్తిలో రావాలని మంత్రిగారు అన్నారు. మొత్తం దేశాని కుద్దేశించిన తృతీయ ప్రణాళిక పరిమాణం రూ. 9,950 కోట్లు ఉండగలవనీ, యిందులో రూ. 4,000 కోట్లు ప్రైవేటు విభాగంలో వుండగలవనీ అన్నారు. మనకు రూ. 550 కోట్ల ప్రణాళికను కోరే హక్కుకలదన్నారు. ప్రైవేటు విభాగంలో కూడా పరిశ్రమల స్థాపనకు అవకాశం ఉండగలదు. కావుననే ప్రభుత్వం పారిశ్రామిక అభివృద్ధి సంస్థను నెలకొల్పాలని నిర్ణయించినది. రాష్ట్రంలో సాధ్యమయినన్ని యెక్కువ పరిశ్రమల స్థాపనకు ప్రభుత్వం శాయశక్తులా కృషి చేస్తుంది.

రష్యా సహాయంతో ఏర్పడే మందుల ఫ్యాక్టరీ మన రాష్ట్రంలో నెలకొల్పబడగలదని మంత్రిగారు ఆశించారు. న్యూస్‌ప్రింట్ ఫ్యాక్టరీ కూడా నెలకొల్పబడే సూచనలు ఉన్నవి.

ఆర్థికమంత్రి, మొదట, బడ్జెటుపట్ల హర్షం ప్రకటించి నిర్మాణాత్మకమయిన విమర్శ చేసిన సభ్యులకు, ప్రజలకు వార్తా పత్రికలకు కృతజ్ఞత తెలిపారు. బడ్జెటు పవిత్రతను కాపాడే విషయంలో సభ్యులకు వలెనే ప్రభుత్వమున్నూ శ్రద్ధాళువై ఉన్నదన్నారు. బడ్జెటు మంజూరీకు కట్టుబడి ఉండాలని ప్రభుత్వం వాంఛించినా అభివృద్ధి ఖర్చుకు అదనపు సొమ్ము అవసరమయినదన్నారు. అదనపు ఖర్చులు తగ్గించాలని ఆదేశాలు యివ్వబడినవనీ, అటువంటి సందర్భాలు సభవారికి తెలియజేయబడగలవనీ అన్నారు. అంచనాలకు, ఖర్చులకు మధ్య వ్యత్యాసం ఉండటం తథ్యం. ప్రణాళికలో సాధించిన ఫలితాలు సంతృప్తికరంగా ఉన్నవనటానికి సందేహం లేదన్నారు. పథకాలలో 100 కి 99 బడ్జెటు ఆమోదించబడిన మూడు నెలల లోపున మంజూరయినవన్నారు. సంవత్సరం పొడుగునా ఒకే విధంగా ఖర్చుపెట్టడం సాధ్యంకాదు అయినా అందుకు కృషి చేయబడుతుంది.

ఎంత కృషి సల్పినా కొన్ని సంవత్సరాల వరకు నిరుద్యోగం ఒక తీవ్ర సమస్యగానే ఉండగలదన్నారు. ప్రణాళిక ఆఖరునాటికి అయిదు లక్షల మందికి ఉద్యోగాలు చూపబడగలవని ద్వితీయ ప్రణాళికలో సూచించబడినది. ఈ లక్ష్య సాధనకై ఎల్ల విధాలా కృషి చేయబడుతున్నది. ఈ విషయంలో జనాభా పెరుగుదల కూడా లెక్కలోనికి తీసుకొనవలసి ఉంటుంది.

మంత్రి గారు ప్రస్తుత ఆర్థిక సంవత్సరాన్ని మార్చటం సాధ్యం కాదన్నారు. ప్రస్తుత పద్ధతిని కొనసాగించటమే సౌకర్యంగా ఉంటుందని, రాష్ట్రాల సూచనలను పరిశీలించిన మీదట కేంద్ర ప్రభుత్వ నిర్ణయాని కొచ్చిన దన్నారు.

ఆంధ్ర ప్రదేశ్‌కి ప్రత్యేక ఆహార మండలం కావాలనడం "జాతి ప్రయోజనాలకు విరుద్ధ" మని ఒక సభ్యుడు అన్నాడంటూ మంత్రిగారు ఆ ఆలోచన సరికాదన్నారు. మిగులు రాష్ట్రంలో ప్రజలు ఆహారం విషయంలో యిబ్బంది పడకుండా చూడాలనేదే రాష్ట్రీ ప్రభుత్వం ఆదుర్దా. ఈ దృష్టితోనే ప్రత్యేకాహార మండలం కోరబడింది. ప్రభుత్వం పరిమిత సేకరణ విధానాన్ని అవలంబిస్తున్నది.

ఆకలి లేమి ఉన్నంత కాలం కమ్యూనిస్టు ఉద్యమాన్ని తుడిచి పెట్టలేమని ఒక సభ్యుడన్న మాటను పురస్కరించుకొని అలాఅనటానికి తగిన పరిస్థితి ఏర్పడలేదని మంత్రిగారన్నారు. ముఖ్య మంత్రి అన్నారని ఆరోపించిన ఒకానొక మాట ఆధారంగా సభ్యుడు యిలా అనడం జరిగింది. బలప్రయోగం లేక మిలిటరీ, పోలీసుల సహాయంతో పరిపాలన సాగించాలనే ఆలోచన కాంగ్రెసు ప్రభుత్వాలకు లేదన్నారు. కాంగ్రెసు ఒకవేళ అటువంటి వైఖరిని అవలం

బించినట్లయితే కేరళ ఫలితం మరొక విధంగా ఉండి ఉండే దన్నమాటలకు కమ్యూనిస్టు సభ్యులు అభ్యంతరం తెలిపారు.

మద్య నిషేధం అమలు బాధ్యతను పోలీసు శాఖ నుంచి తప్పించాలన్న నిర్ణయాన్ని విపులీకరిస్తూ మద్యనిషేధం అమలు బాధ్యతను అప్పగించిన నాటినుంచి పోలీసులు శాంతి భద్రతల రక్షణ విషయంలో అంతకు ముందువలె చక్కగా పని చేయలేక పోతున్నారనీ, వారి నైతిక విలువలు దెబ్బతింటున్నవని ప్రజలు భావిస్తున్నారన్నారు. సభ్యుల అభిప్రాయాలను మన్నించటం తమ ధర్మమని ప్రభుత్వం భావించిన దన్నారు. కాబట్టి యీ నిర్ణయం తీసుకున్నామన్నారు.

వేతనాల సంఘం నివేదిక ప్రాతిపదికపై వేతనాలను పునర్నిర్ణయించడం బహు కష్టమనీ, యింత వరకు 65,000 ఉద్యోగుల వేతనాలు నిర్ణయించ బడినవనీ అన్నారు. మిగిలిన 90,000 మంది ఉద్యోగుల వేతనాలు 1960 జూన్ నాటికి పునర్నిర్ణయింప బడగల వన్నారు. ఇందు నిమిత్తం యీ పని చూసే సెక్షన్‌లో అదనపు సిబ్బంది నియమించ బడుతుంది

## పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్

పారిశ్రామిక అభివృద్ధి సంస్థకు ప్రభుత్వం మిక్కిలి ప్రాముఖ్యం యిస్తుందని మంత్రిగారు అన్నారు. పరిశ్రమల స్థాపనకు ప్రైవేటు వ్యక్తులకు ప్రోత్సాహమివ్వటమే ఆశయమన్నారు. ప్రభుత్వం స్వంతంగా పరిశ్రమలను ప్రారంభించవచ్చు లేక అత్యధిక లేక అత్యల్ప వాటాలతో వాటామూల ధనం లోపాలు కూడవచ్చు. ఈ కార్పొరేషన్ భారీ, మధ్యరకం పరిశ్రమలతోనే వ్యవహరిస్తుంది. విడిగా చిన్న పరిశ్రమల కార్పొరేషన్ ఒకటి ఏర్పాటు చేయబడ గలదా అని అడుగగా మంత్రిగారు అది వేరే విషయం అన్నారు.

షెడ్యూల్డు కులాలు, జాతులు, ఇతర వెనుకబడిన కులాలకు కేటాయించిన సొమ్ము హెచ్చించ బడినదన్నారు. చిన్ననీటి పారుదలకు కేటాయించిన సొమ్ము రూ. 145 లక్షల (1957-58) నుంచి రూ. 407.05 లక్షలకు (1960-61) హెచ్చించ బడినదన్నారు. మొత్తం మీద ఖర్చు బాగా జరిగింది. ఖర్చు హెచ్చుదల పోలీసు శాఖలో 18 శాతం కాగా వైద్య, విద్యా శాఖలలో 50 శాతం, ప్రజారోగ్యశాఖలో 130 శాతం అయి ఉన్నది. త్రవ్వ ఆరంభమయ్యేవరకు నిమ్మ, కొబ్బరి చెట్లపై పన్ను విధింప కూడదనే సూచన పరిశీలించ బడగలదన్నారు. కనుపూరు కాలవ పథకాన్ని తృతీయ ప్రణాళికలో చేర్చడానికి కృషి చేయబడగల దన్నారు.

తమ బడ్జెటు ప్రసంగంలో ప్రకటించినట్లుగా వేరు సెనగ, ప్రత్తిలపై వచ్చే మూడుసంవత్సరాలు ప్రత్యేక పన్ను వసూలు చేయబడదన్నారు. మూడు సంవత్సరాల ఆఖరున పరిస్థితిని పరిశీలించి నిలుపుదలను కొనసాగించడమా లేక వసూలు చేయడమా అన్న విషయం నిర్ణయించ బడగల దన్నారు. మళ్లీ ప్రత్యేక పన్ను వసూలుకి కొత్త శాసనం అవసరం లేదన్నారు.

స్వతంత్ర సభ్యుల విమర్శల ప్రసక్తి తెచ్చి సోషలిజము, స్వాతంత్ర్యము కలిసి మనలేననే అభిప్రాయం తప్పు అన్నారు. స్వాతంత్ర్యం అంటే మనకు యిష్టం వచ్చిన పనులు చేయటానికి లైసెన్సు కాదన్నారు. ఆర్థిక వ్యత్యాసాలను తొలగించి సోషలిస్టు పద్ధతి సమాజ స్థాపనకు కృషి జరగాలన్నారు. ఈ సందర్భంలో రాష్ట్రంలోని స్వతంత్ర పార్టీ "బాల సావచిన్నెల"తో సతమత మవుతున్న దన్నారు.

గుంటూరు లేక తత్సమీపంలో గల నాగార్జునకొండలో ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పబడగలదని మంత్రిగారు ఆశించారు.

సభ్యులు అడిగిన అనేక ప్రశ్నలకు జవాబు చెబుతూ, త్వరలోనే బంజరు భూముల పంపిణీకి కృషి చేయగలమనీ, యీ విషయంలో కమిటీల ఏర్పాటు అవసరమా అన్న విషయం పరిశీలించ బడగలదనీ అన్నారు. అవసరమయినప్పుడు పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు సంబంధించిన నిబంధనలను సవరించ వచ్చన్నారు. ఎగువ సీలేరు ప్రాజెక్టు పని జరుగుతున్నదన్నారు. ఈ ప్రాజెక్టు మొదట అంచెలో ఒక అడ్డ కట్ట నిర్మాణం తల పెట్ట బడినదన్నారు. ప్రభుత్వం ఆర్థికంగా వెనుక బడిన వారికి తోడ్పడ దలచిన దనీ, వృత్తి విద్యా, సాంకేతిక విద్యా సంస్థలలో మేధావు లయిన విద్యార్థులకు అప్పులు యిచ్చేందుకై కొంత

సొమ్ము కేటాయించ బడినదనీ అన్నారు. ఉస్మానియా విశ్వ విద్యాలయం బ్లాక్ గ్రాంటు హెచ్చించాలని చేయబడిన విజ్ఞప్తి పరిశీలించ బడగలదన్నారు.

పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల విషయంలో సాంఘిక సంక్షేమ కార్యకలాపాలకు కేటాయించిన సొమ్ము అందు నిమిత్తమే ఖర్చు చేయాలని ఆదేశాలు యివ్వ బడినవి. హైదరాబాదులో నిరుద్యోగ నివారణకుద్దేశించిన పథకం అమలు జరుప బడుతుంది. ప్రత్యేక వ్యవసాయాభివృద్ధి బోర్డు అవసరం లేదు.

## నాగార్జున సాగర్

నాగార్జున సాగర్ ప్రాజెక్టు కేంద్ర విభాగంలో ఉండాలని గట్టిగా విజ్ఞప్తులు చేయబడినవనీ. కాని కేంద్ర ప్రభుత్వం యింత వరకు తమ కోరికను మన్నించలేదనీ అన్నారు. ఈ ప్రాజెక్టుకే, యితర పెద్ద ప్రాజెక్టులకు పెద్ద మొత్తాలు కేటాయించ వలసి వచ్చినందున రాష్ట్ర ప్రభుత్వానికి చిక్కుగా ఉన్నది. తృతీయ ప్రణాళికలో భారీ ప్రాజెక్టులకు దాదాపు నూరు కోట్ల రూపాయలు కేటాయించవలసి ఉంటుంది. (నాగార్జున సాగర్ 60 కోట్లు. వంశధార 12 కోట్లు. తుంగభద్ర ఎగువ కాలువ 12 కోట్లు. పోచంపాడు 15 కోట్లు) భక్రానంగల్, హీరాకుడ్ ప్రాజెక్టులు రాష్ట్ర విభాగంలో ఉన్నాయని కేంద్ర ప్రభుత్వం చెప్పిందనీ కాని అవి రాష్ట్ర విభాగంలో చేర్చబడ్డానికి ముందు కేంద్రం వాటిపై కొన్ని కోట్లు ఖర్చు పెట్టిందని అన్నారు.

గనుల త్రవ్వకంలో ప్రభుత్వ వ్యాపారం విషయం పరిశీలించ దగిన దన్నారు. పొగాకు పన్నులో ఆంధ్ర ప్రదేశ్ వాటాను హెచ్చించాలని రాష్ట్ర ప్రభుత్వం ద్వితీయ ఆర్థిక వ్యవహారాల కమీషన్‌కి యిదివరకే విజ్ఞప్తి చేసిన దన్నారు. తృతీయ ప్రణాళికలో కొత్త వైద్యకళాశాలల స్థాపన సాధ్యపడక పోవచ్చునన్నారు. యునానీ పద్ధతి వైద్యం బడ్జెటు తగ్గించ బడలేదన్నారు.

## శాసన మండలిలో

హిందూస్థాన్ మెషిన్ టూల్సు ఫ్యాక్టరీకి ఉప కేంద్రంగా రాష్ట్రంలో మెషిన్ టూల్సు తయారీ యూనిట్టును నెల కొల్పే విషయంలో సంప్రదింపులు కూడా ఆరంభ మయిన వని శాసన మండలిలో బడ్జెటుపై నాలుగు రోజులు చర్చకు సమాధానం చెబుతూ ఆర్థిక మంత్రి చెప్పారు.

రాష్ట్రం పారిశ్రామికంగా వెనుక బడిఉన్న విషయాన్ని ప్రభుత్వ గుర్తించినదనీ. యీ విషయాన్ని కేంద్ర ప్రభుత్వానికి తెలియ జేసిన దనీ అన్నారు. విదేశ ద్రవ్యం కొరత వల్ల ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో యెక్కువ పని జరుగ లేదు. అయితే, సిమెంటు ఫ్యాక్టరీ, పంచదార ఫ్యాక్టరీలు వగైరా నెలకొల్ప బడినవి. కాని ఆంధ్ర ప్రదేశ్ వంటి పెద్ద రాష్ట్రం ఆర్థిక సమస్యల పరిష్కారానికి యిది చాలదు. కాబట్టి తృతీయ పంచవర్ష ప్రణాళికలో, పబ్లిక్, ప్రైవేటు లేక రాష్ట్ర విభాగాలు దేనిలో నైనా సరే పరిశ్రమలకు ప్రాధాన్యం యివ్వబడుతున్నది. ఈ ఆశయంతో. ప్రభుత్వం పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్‌ని ఏర్పాటు చేయాలని నిర్ణయించింది అది, వాటామూల ధనంతో పాలు కూడి తద్వారా భారీ. మధ్యరకం, చిన్న పరిశ్రమలను అభివృద్ధి చేస్తుంది.

## రసాయన ఎరువుల ఫ్యాక్టరీ

రసాయన ఎరువుల ఫ్యాక్టరీని నెలకొల్పటానికి రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినదని మంత్రిగారు చెప్పారు. విదేశ ద్రవ్యాన్ని సమకూర్చటానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది. త్వరలోనే ఫ్యాక్టరీకి శంకు స్థాపన చేయబడుతుంది. సాంకేతిక సహాయానికై ఇటాలియన్, జర్మన్ నిపుణులతో సంప్రదింపులు జరుగుతున్నవి.

రాష్ట్రంలో భూమిశిస్తు పద్ధతి సంస్కరణకు ఉద్దేశించిన అనంతరామన్ కమిటీ నివేదికపై ప్రభుత్వం రెండు మూడు నెలల్లో చర్యగైకొంటుందని చెప్పారు.

ఆహార ధరలు పెరిగి పోయిన వన్న విమర్శను ప్రస్తావించి. వ్యవసాయ పరికరాలతో సహా జీవితావసర వస్తువుల ధరలు పెరిగినవనీ, పరిస్థితిని చక్క బరచడానికి ప్రభుత్వం శాయ శక్తులా కృషి చేస్తున్నదనీ అన్నారు. రాష్ట్రం పారిశ్రామికంగా వెనుకబడి ఉన్నప్పటికీ యిటీవల సంవత్సరాలలో జాతీయ సంపద, తలసరి ఆదాయం హెచ్చినవని సోదాహరణంగా వివరించారు.

మన రాష్ట్రం మిగులు రాష్ట్రమయినా బియ్యం దేశం

లోని తరుగు రాష్ట్రాలకు- తరుగు ప్రదేశాలకు తరలు తున్నాయన్నారు. దక్షిణ ఆహార మండలం ఒక యూనిట్టు. ఆంధ్ర ప్రదేశ్‌ని ప్రత్యేక ఆహార మండలంగా చేయాలన్న ప్రతిపాదనకు కేంద్ర ప్రభుత్వం సుముఖంగా లేదు. రాష్ట్ర ప్రభుత్వం కొన్ని బియ్యాన్ని మిల్లర్ల నుంచి సేకరించి ధరలను అదుపులో ఉంచేందుకై కేంద్ర నిల్వల నుంచి కూడా కొన్ని సంపాదిస్తున్నది. రాష్ట్రంలో ఆహార ఉత్పత్తి హెచ్చుదలకు తోడ్పడేందుకై కేంద్ర ప్రభుత్వం రసాయన యెరువుల కోటాను హెచ్చించ గలదని కేంద్ర ఆహార మంత్రి హామీ నిచ్చారు.

వస్తూత్పత్తి హెచ్చుదల విషయంలో, మంత్రి గారు సమ్మెలు తగవన్నారు. వస్తూత్పత్తి, అభివృద్ధి రంగాలలో అందరూ మనస్ఫూర్తిగా ప్రభుత్వంతో సహకరించాలని విజ్ఞప్తి చేశారు. రాష్ట్ర ప్రభుత్వం ప్రాంతీయ విభేదాలను చూపటం లేదన్నారు. ఆంధ్ర రాష్ట్రం యేర్పడిన పిమ్మట సర్కారులు రాయల సీమ జిల్లాల మధ్య విభేదాలు నమసిపోయినవి. అలాగే ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన పిమ్మట తెలంగాణా ప్రజల సహకారం ధర్మమా అని ఆంధ్ర, తెలంగాణాలు ఏక మయినవి. వెనుకబడిన ప్రాంతాలు ఎక్కడ ఉన్నా వాటి అభివృద్ధికి కృషి జరగాలి. మొత్తం రాష్ట్రానికి ప్రయోజన కరమయిన కొన్ని ముఖ్య పథకాలనూ చేపట్టవలసి ఉన్నది.

రామపాద సాగర్ ప్రాజెక్టు అధిక వ్యయ భరితం కావడాన దానిని చేపట్టటం కష్టం కాగలదన్నారు. రాష్ట్రం యిప్పటికే తుంగభద్ర ఎగువ కాలువ, వంశధార, పోచంపాడు ప్రాజెక్టులవంటి పెద్ద ప్రాజెక్టులను చేపట్టినది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు సరేసరి. గోదావరిపై గల ధవళేశ్వరం ఆనకట్ట షట్టర్ల ఎత్తు పెంచటానికి కొంత సొమ్ము కేటాయించ బడింది. చిత్తు తృతీయ పంచవర్ష ప్రణాళికలో గుంటూరు చానల్ పథకం కూడా చేర్చబడింది.



ఈశ్వర బలమున్న పక్షమున పూరి పుడకయు వజ్రాయుధమగును; ఈశ్వర బలము లేనిచో వజ్రాయుధము సహితము పూరి పుడక యగును.

— కందుకూరి వీరేశలింగం.

* * *

ఒకరు తాముపదేశించిన దాని ననుష్ఠించి చూపినగాని కేవల శుష్కోపన్యాసముల వలనను పుస్తక ప్రకటనముల వలనను కార్యముండదు.

— కందుకూరి వీరేశలింగం.

# గ్రామీణ ప్రాంతాలకు నీటి సప్లై

— ఆర్.ఆర్. తిమ్మాజీరావు

నీరు ప్రాణాధారం. సృష్ట్యాది నుండి ప్రాణి కోటికి నీటి అవసరం వుండనే వుంది. మానవుడు నీటి ఉపయోగాన్ని ఎన్నడు గ్రహించాడో, స్పష్టంగా చెప్పడం కష్టం. కత్తీ లేని మంచినీరు కావలసినంత లేనిదే మానవుడి అభివృద్ధి కుంటుపడుతుంది. నీటియొక్క ప్రాముఖ్యము, దానివల్ల ఆరోగ్యానికి కలిగే హాని యిటీవలి కాలంలో మానవులు బాగా గుర్తించారు. ప్రపంచంలోని మరణాలలో సగటున 25 శాతం నీటివల్ల కలిగే అనారోగ్యం కారణంగా జరుగుతున్నాయని ఋజువయింది. భారతదేశం వంటి అభివృద్ధి పొందని దేశాల్లో యీ శాతం యింకా ఎక్కువ. అందువల్ల ప్రతి వ్యక్తికీ, సురక్షితమైన మంచినీరు సప్లై చేయటం అత్యవసరమని గుర్తించబడింది.

పరిశుభ్రమైన మంచినీరు సప్లై చేయాలనే అభిలాష మెచ్చుకోదగినదే; కాని దానిని సాధించటమే ఘనకార్యం. మన రాష్ట్రంలో, ఆంధ్ర ప్రాంతంలోనే 45 పురపాలక సంఘాలు, 227 పెద్ద పంచాయతీలు వున్నాయి. ఇవి 10 వేల జనాభాను మించినవి. పోతే గ్రామాల సంఖ్య 17.428. వీటిలో 33 పురపాలక సంఘాలు, 5 పెద్ద పంచాయితీలు, సుమారు 300 గ్రామాల్లో మాత్రమే ఏదో ఒక రకమైన నీటి సప్లై పద్ధతి అమలు జరుగుతోంది. ఈ పథకాలైనా ఆయా చోట్ల మొత్తం ప్రాంతాలకు పూర్తిగా ఉపయోగపడటం లేదు. తెలంగాణా విషయం కూడా యింతే. ఇక్కడ 16 నగర మునిసిపాల్టీలు, 64 పట్టణ కమిటీలు, 8804 గ్రామాలు వుంటే వీటిలో 13 నగర మునిసిపాల్టీలు, 4 పట్టణ కమిటీలలో మాత్రమే నీటి సప్లై పథకాలు అమలు జరుగుతున్నాయి. ఆంధ్ర ప్రదేశ్ మొత్తంలో గ్రామాల సంఖ్య 26.248. వీటిలో కనీసం నాలుగువందల గ్రామాలకు కూడా రక్షణ నీటి సప్లయి పథకాలు లేవు. మన రాష్ట్రంలోని 2½ కోట్ల గ్రామీణ జనాభాకు పరిశుభ్రమైన మంచినీటి సప్లయి పథకాలు అమలు పరచాలంటే సుమారు [illegible] కోట్లు ఖర్చవుతుంది. రాష్ట్రమంతటా నీటి సప్లయి పథకాలు ఏర్పాటు చేయటం యింత ఖర్చుతో కూడిన పని కావటమే, యిన్నాళ్లూ యింత తక్కువ పని మాత్రమే జరగటానికి ముఖ్య కారణం. నీటి సప్లయి వంటి ప్రజారోగ్య సేవా పథకాలు నిర్వహించే పబ్లిక్ హెల్త్ శాఖ పెద్ద పెద్ద పథకాలమీదనే కేంద్రీకరించి పనిచేయవలసి రావడం కూడా ఒక కారణం. మరొక కారణం ఏమంటే సాంకేతిక పరిజ్ఞానం గల ఉద్యోగుల కొరత. రాష్ట్ర ప్రభుత్వం అవసరమైనంత మంది సాంకేతిక నిపుణులను తయారు చేయటానికి శిక్షణ పథకాలు అమలు పరచటం అత్యంతావశ్యకం. కొద్ది ప్రయత్నరూపకమైన పెట్టుబడితో, ఆరోగ్య ఫలితాల రూపంలో యీ బేరంలో మంచి మంచి లాభాలు సంపాదించవచ్చు. ఎందుకంటే పరిశుభ్రమైన మంచినీటి సౌకర్యం వల్ల అనేక రోగాలను దూరంగా వుంచుకోవచ్చు. ఉదాహరణకు విరేచనాలకు సంబంధించిన అనేక వ్యాధులు మనకు త్రాగే నీటివల్లనే వస్తూవుంటాయి. అటువంటి రోగాలను సులభంగా అరికట్టవచ్చు.

గ్రామీణ నీటి సప్లయి పథకాల లక్ష్యాలు ఏవంటే:

1. పరిశుభ్రమైన, సురక్షితమైన నీరు సప్లయి చేయడం
2. తగినంత నీరు సప్లయి కావడం
3. అవసరమైన వెంటనే నీరు లభించే ఏర్పాట్లు చేయడం.

పరిశుభ్రమైన, సురక్షితమైన మంచి నీరంటే దానిలో రోగవాహక లక్షణాలు లేకుండా వుండాలి. దానిలో విష పదార్థాలు చేరకుండా వుండాలి. ఖనిజ పదార్థాలు మొదలైనవి ఎక్కువగా వుండకూడదు. దూర ప్రదేశము నుండి నీరు తెచ్చుకోవలసిన పరిస్థితి వుంటే ప్రజలు వాడకం తగ్గించుకోవడం సహజం. నీటి సప్లయి పథకాలు అమలులో లేని గ్రామాల్లో గ్రామస్థులు సంవత్సరానికి సుమారుగా 70 మైళ్ల దూరం నీరు తెచ్చుకోడానికి గాను నడుస్తారని అంచనా. అంటే యింటినుండి బావి సుమారు వంద అడుగుల లోపుగా వున్నదనుకుంటేనే యీ అంచనా సరిపోతుంది. అంతేకాక నీరు తెచ్చుకోటానికి రోజుకు సుమారు ఒక గంట కాలం వ్యయమవుతుంటుంది. దీనిని బట్టి నీళ్ళు చాలా తక్కువగా వాడుకోవటం అలవాటవుతుంది. బొటాబొటిగా ఎంత నీరు అవసరమో అంతటితోనే సరిపుచ్చుకోవలసి వస్తుంది. నీరు త్రాగటంలోకూడా నియమంగా తక్కువగా వినియోగించు కుంటుంటే, యిక యింట్లో ఆరోగ్య సూత్రాలు పాటించటానికి ఎంత తక్కువ నీరు లభ్యమవుతుందో సులభంగా ఊహించుకోవచ్చు. అలాకాక సరిపడినంత నీరు, పుష్కలంగా, సులభంగా లభిస్తుంటే, బాగా ఎక్కువగా వాడుకుంటారు. దానివల్ల పరిశుభ్రత పాటించటానికి వీలుంటుంది. కేవలం త్రాగటానికే కాకుండా, యింట్లో వాడకానికీ, శరీరారోగ్యం దృష్ట్యా విరివిగా వినియోగించుకోటానికీ కూడా నీరు పుష్కలంగా లభించే ఏర్పాట్లు చెయ్యకపోతే, నీటి సప్లయి పథకాలు, పూర్తి ప్రయోజనకారులు కాజాలవని ఆరోగ్య శాఖాధికారులు బాగా గుర్తించారు. శాస్త్రీయంగా పరిశుభ్రపరచిన నీటిని పబ్లిక్ జలాశయాల ద్వారా యింట్లకు సరఫరా చేసినా, లేక మామూలు బావులనుండి పరిశుభ్రం చేయని నీటిని తీసుకువచ్చి వాడుకున్నా, జబ్బులు వచ్చే ప్రమాదం సమానంగానే వుంటుందని ఋజువయింది. ఎందుకంటే జలాశయాలలోని నీరు అక్కడ పరిశుభ్రం చేయబడినా, అది గొట్టాల ద్వారా యిండ్లకు చేరేటప్పటికి మధ్యలో మళ్ళీ చెడనే చెడుతుంది. అందువల్ల పరిశుభ్రమైన నీటిని యింటిలో అందించటం ప్రధానంగాని, అసలు నీరు ఎటువంటిది అనే ప్రశ్న అనవసరం.

కాగా గ్రామీణ నీటి సప్లయి పథకాలను అమలుపరచే శాఖలన్నీ కూడా యీ సమస్యను నిజాయితీతో క్షుణ్ణంగా చర్చించి తగు చర్యలు తీసుకోవడంఅవసరం. ప్రజారోగ్యం దృష్ట్యాచూస్తే ప్రతి కుటుంబానికీ సరిపడిన పరిశుభ్రమైన మంచి నీరు,వారి యింటిలో లభ్యమయ్యే ఏర్పాటు చేయవలసి వుంటుంది. ఆ లక్ష్యంతోనే నీటి సప్లయి పథకాలను రూపొందించాలి. కాని సరిగ్గా యిలా చేయాలంటే చాలా వ్యయం అవుతుంది. గ్రామీణ పట్టణాలు, పల్లెలు యీ ఖర్చును తట్టుకోలేవు. మరొక మార్గం ప్రతి గ్రామానికీ ఒక మంచి నీటి బావి నిర్మించడం. దీనివల్ల ప్రజారోగ్య లక్ష్య సాధన పూర్తి కాజాలదు. గ్రామస్థులు మళ్ళీ దూరం నడిచి వెళ్ళి నీరు తెచ్చుకోవలసి వస్తుంది. నడవటానికి బద్ధకించి, అంతకంటే సమీపంలోగల అపరిశుభ్రమైన నీటినే తెచ్చి వాడుకోటానికి అలవాటు పడతారు. కాగా ప్రతి గ్రామంలో ఒక బావి ఏర్పాటు చేసినందువల్ల ప్రజారోగ్య కల్పన విషయికమైన ప్రభుత్వ బాధ్యత తీరినట్లు కాదు. తీరా యింత చేస్తే, గ్రామసీమలోని వ్యాధులు, అనారోగ్యం యథాతథంగానే వుంటే ప్రభుత్వం ఆశాభంగం పొందే పరిస్థితి ఏర్పడుతుంది. కాబట్టి వచ్చిన అసలు చిక్కు ఏమంటే, పరిశుభ్రమైన నీరు తగినంత లభించక పోవడమో, లేక అందుబాటులో లేక పోవడమో లేక యీ రెండూనో జరుగుతూ వుంటుంది. ప్రభుత్వం యీ విషయంలో తీసుకోవలసిన నిర్ణయం అంత సులభమైంది కాదు. ఒకవైపున ఆర్థిక రీత్యా యదార్థపరిస్థితులు, మరొకవైపు ప్రజారోగ్యసూత్రాల దృష్ట్యా అవసరాలు తారసిల్లి, యీ రెంటి మధ్య సమన్వయ పూర్వకమైన రాజీ ప్రతిపాదనలాగా పథకాలు తయారు అవుతూ వుంటాయి. తగినంత మంచి నీరు సప్లయి జరుగక పోతే, ఆరోగ్యం దృష్ట్యా సత్ఫలితాలు సాధించటం సందేహాస్పదమే అవుతుంది.

ప్రతి గ్రామానికీ పరిశుభ్రమైన మంచి నీరు పూర్తిగా సప్లయి చేయడం ఖర్చుతోకూడిన పనే. కాని చాలినంత

పంపిణీ జరుగక, సౌలభ్యమూ లేక, ఆరోగ్య రక్షణ పూర్తిగా లేక కొనసాగే పబ్లిక్ నీటి సప్లయి పథకంకూడా అధిక ఖర్చుతో కూడినదే. గ్రామీణ నీటి సరఫరా పథకాలలో ప్రధాన ప్రయోజనం గ్రామీణ ప్రజల ఆరోగ్య సంరక్షణమే. నీటి పంపిణీ విషయంలో శ్రద్ధ వహించక పోతే, యీ ఆరోగ్య ప్రయోజనం సిద్ధించదు. కాగా గ్రామాలలో బావులను నిర్మించే ప్రయత్నాలు, నీటి పంపిణీలో తొలి చర్యలుగానే భావించుకోవలసి వుంటుంది.

## గ్రామస్థుల సహకారం

గ్రామీణ నీటి సప్లయి పథకాలను అమలుపరచటం ఎక్కువగా గ్రామ ప్రజల సహకారం మీద ఆధారపడి వుంటుంది. నీటి సరఫరా పథకం కావాలని ప్రజలు శ్రద్ధ వహిస్తే, దానికి సంబంధించిన సమస్త విషయాలను జాగ్రత్తగా నిర్వహించుకోటానికి అవకాశముంటుంది. అందువల్ల పథకం ప్రారంభించే ముందు గ్రామ పంచాయతీ ఆమోదం పొందటం అత్యవసరం. అంతేకాక నీటి సప్లయి విషయంలో అనేక సాంకేతిక సమస్యలు. పరిపాలనా వ్యవహారాలు, ఆర్థిక పరిస్థితులు యిమిడివుంటాయి. అందువల్ల రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల నుండి సహాయం అవసరం. కాగా గ్రామీణ నీటి సప్లయి పథకం విజయవంతం కావాలంటే (1) స్థానికంగానూ, కేంద్ర ప్రభుత్వ స్థాయిలలోనూ సహకారం లభింపజేసుకోవడం (2) ప్రజల నుండి ధన, భూమి వస్తు, శ్రమ రూపాలలో విరాళాలు సేకరించటం (3) నీటి సప్లయికి గాను చేయవలసి వచ్చే ఖర్చుతో ప్రజలు కొంత వుదారంగా ప్రవర్తించటం (4) నీటిని విరివిగా ఉపయోగించటం చాలా అవసరం.

గ్రామీణ నీటి సప్లయి పథకాల ఖర్చులో సగం వంతు గ్రాంటుగా మంజూరు చేయటానికి కేంద్ర ప్రభుత్వం సంసిద్ధత ప్రకటించింది. మిగిలిన ఖర్చులో రాష్ట్ర ప్రభుత్వం 25 శాతం, జిల్లా పరిషత్తు $12\frac{1}{2}$ శాతం స్థానిక ప్రజలు $12\frac{1}{2}$ శాతం భరించాలి. ప్రజా సంక్షేమ పథకాలు కావటం చేత, నీటి నిర్వహణలో శ్రద్ధ వహించవలసిన బాధ్యత జిల్లా పరిషత్తులు, పంచాయతీలకు కూడా వున్నందున, వాటిని కూడా యీ రంగంలోకి కొని రావటం జరిగింది.

గ్రామీణ నీటి సప్లయి పథకాల విషయంలో ప్రధానంగా చూడవలసినది లభించిన నీటి సహజ పారిశుద్ధ్యం చెడకుండా రక్షించడం మందులు వగైరాలు వేసి దానిని పరిశుభ్ర పరచడం మరీ తప్పనిసరి అయితే అనుసరించే విధానంగానే పరిగణించాలి. నీటిని శుభ్రపరచటానికి అధికమైన శాస్త్రీయ ప్రక్రియలు పరికరాలు అవసరమయ్యేట్లుగా రూపొందించిన పథకాలను వేటినీ సాధారణంగా ఆమోదించరాదు. గ్రామం యొక్క స్తోమతకు, శక్తి సామర్థ్యాలకు మించిన ఖర్చుగల పథకాలను అమలుపరచ బూనుకుంటే అవి కొనసాగవు. ఆరంభములోనూ, అనుయికాలంలోనూ సాధ్యమైనంత తక్కువ ఖర్చుతో పరిశుభ్రమైన మంచి నీరు తగినంత అందించడమే ఆదర్శంగా పెట్టుకోవాలి. త్రాగటానికి ఉపయోగించే నీరు, సాధ్యమైనంత వరకు ప్రమాదం లేనిదిగా వుండాలి. రుచికరంగానూ వుండాలి. నీటి రుచి మారినట్లు, రంగు వేసినట్లు, వాసన తెలిసేటట్లు లేకుండా వుండటమే నీటి సప్లయి పథకానికి ప్రధానాశయం.

ఫెర్రిక్ ఆక్సయిడ్, ఫ్లోరైడ్ మామూలుగా గ్రామీణ నీటి పథకాలలో మనకు తరచు తగులుతూ వుంటాయి. వీటిని తగ్గించి క్లోరినేషన్ మాత్రం విరివిగా ఉపయోగించుకుంటూ లభ్యమైన నీటిలోని సహజత్వాన్ని చెడనీయకుండా సప్లయి చేయటం అవసరం.

## స్థానిక శిక్షణ

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వద్ద అర్హులైన యింజనీర్లు వుంటారు. నీటిని పరిశుభ్రపరచే పద్ధతులలో వారు నిష్ణాతులై వుండవచ్చు. కాని దైనందిన వ్యవహారాలలో వారి సేవలు గ్రామీణులకు లభించవుకదా. చాలా గ్రామ పంచాయితీలకు, తమ నీటిసప్లయి పథకాలను ఎలా అమలు జరుపుకోవాలో కూడా తెలియదు. అందువల్ల స్థానికంగా కొందరికి సప్లయిపథకాలను ఎలా నిర్వహించుకోవాలో తెలియడానికి శిక్షణఅవసరం. ఈ అవకాశాన్ని రాష్ట్ర ప్రజారోగ్యశాఖవారు కల్పించాలి. రాను రాను యీ నిర్వహణ సహాను బాధ్యతను పూర్తిగా పంచాయతీ సమితి వహించే అవకాశం లేక పోలేదు. అట్టి సందర్భంలో ప్రజారోగ్యశాఖ. ఇంజినీరింగ్ విభాగం వారు యీ పథకాలు అమలు జరిగే తీరును శ్రద్ధగా పరిశీలిస్తు వుండాలి. యిది ఒక విధంగా మధ్యకాలపు ఏర్పాటు. క్రమంగా స్థానికంగా సాంకేతిక

పరిజ్ఞానం, అనుభవం పెరగటంవల్ల పథకాన్ని పూర్తిగా పంచాయితీ సమితియే నిర్వహించే అవకాశం చివరకు లభిస్తుంది. అప్పుడు ఏ విధమైన ఒడుదుడుకులు లేకుండా పథకం అసలు జరగడమేకాక, అట్టి పథకం తమకు అత్యంత ప్రయోజనకారి అని ప్రజలు గుర్తిస్తారు. అందు వల్ల పంచాయతీ సమితి, తనంతటతాను విజయవంతంగా యిట్టి పథకాలను నిర్వహించ కలిగే శక్తి సంపాదించే లోగా, రాష్ట్ర ప్రభుత్వం యీ పథకాల నిర్వహణకు అవసరమైన అన్ని విధాల సహాయంచేయవలసి వుంటుంది.

చిన్నదైనా పెద్దదైనా, గ్రామీణనీటి సప్లయిపథకం నిర్వహించటానికి కొంత డబ్బు ఖర్చు కాక తప్పదు గనుక, గ్రామం ఎంత బీదది అయినాసరే, వినియోగదార్లనుండి కొంత పీజు వసూలు చేయక తప్పదు. అంతేకాక, దానిని నిర్వహించుకోటానికి, అవసరమైన ఖర్చంతా తిరిగి వినియోగదార్లవద్ద నుండి రాబట్టే విధానంచే పట్టితేనే మంచిది. గ్రామీణ ప్రాంతాలలో కనీసపు మొత్తపు బిల్లులు చెల్లించే వినియోగదార్ల సంఖ్య అధికంగా వుంటుంది. పబ్లిక్ జలాశయాలనుండి గ్రామస్థుల్లో చాలామందికి కొంతకాలంవరకు నీరు సప్లయిజరుగవలసి వుంటుంది, ప్రజారోగ్య సమస్యలు వీరి విషయంలో ఎక్కువగా వుంటాయి. అందువల్ల వీరికి నీరు బాగా సప్లయి చేయవలసి వుంటుంది. గ్రామస్థులనుండి నీటి సరఫరా చార్జీల వసూలుకు ఏదైనా ఒక పద్ధతి రూపొందిచుకోవాలి. ప్రైవేటుగా యిండ్లలో పంపులున్న వారికితప్ప, మిగిలిన వారందరినీ నెలకు యింత మొత్తం అని పన్ను వేయటం అన్నిటికన్న సులభమైన మార్గంగా కనిపిస్తుంది. పబ్లిక్ ఫౌంటెన్ల నిర్మాణానికి పెద్ద ఖర్చు కాదు. వాటిని గ్రామంలో అన్ని ప్రాంతాల్లో ఏర్పాటు చేస్తే, అక్కడనుండి యిండ్లకు నీటిని తీసుకుపోవడం చాలా సులభం. రాత్రింబగళ్ళు ఎప్పుడైనా నీరు లభించే ఏర్పాట్లు అవసరం. నీళ్ళు వాడుకోటానికి పరిమితి ఏమీ వుండదు గనుక, ఎంత బీదవారైనా దేహ పారిశుద్ధ్యం కోసం విరివిగా నీళ్ళు ఉపయోగించుకునే అవకాశం వుంటుంది. వారిని అందుకు ప్రోత్సహించవచ్చు. పెద్ద కుటుంబమైనా, చిన్నదైనా చెల్లించేచార్జీలు ఒకటే గదా. దీనివల్ల మరొక లాభం ఏమంటే, యీ పథకం మీద రాబడి ఎంతో ఖచ్చితంగా అంచనా వేసుకోవచ్చు. సంవత్సరం పొడుగునా రాబడిలో హెచ్చుతగ్గులంటూ వుండవు. గత 6 సంవత్సరాల అనుభవాన్ని పురస్కరించుకొని చూస్తే పైన చెప్పిన సూత్రాలన్నీ ఆమోదించుకొని అమలు పరిస్తేనే గానీ, ఏ గ్రామ పంచాయితీ అయినా నీటి సప్లయి పథకాలను విజయవంతగా నిర్వహించుకోజాలదు.



తనకు ధర్మమయిన పనిలో శక్తివంచన లేక కృషి చేయుట యొక్కటియే మనుష్యుని పని; దాని ఫలాఫలముల నియ్య వలసిన వాఁడీశ్వరుఁడు గాన తద్విచారము మనుష్యునిది కాదు.

— కందుకూరి వీరేశలింగం.

# కృష్ణ కల్యాణము

— మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

తనివోవన్ బ్రణయాభిమాన ఖని సత్యాదేవి కౌతూహలం
బునకుం గృష్ణుని గుప్పెటన్ మొలచి సొంపుల్ తేటగా నారఁ బూ
చిన నెత్తావుల పారిజాతమటు పొల్చెన్ రాచవీడెల్ల లో
చన పర్వోదయ మంగళోత్సవ ఫలోత్సాహ త్వరానందియై.

వినుతం బయ్యభిషేక వార్త విని యుర్వీనేతఁ గీర్తింప వ
చ్చిన విద్వత్కవి పాళి మంజు కవితా శ్రీవాహినుల్ రాజ భూ
షణ కోలాహల వీధి నద్దుకొని యుచ్చైస్సంగ శృంగార భం
గి నినాదింప నెలర్చె నయ్యెడల రక్తిన్ రాచవీడెల్లెడన్.

అలవేడ్కం గనులారఁ జూచెడి తలంపై కన్నులన్ మూయు లో
పల మిన్నుల్ పడు చోటునుండి పులకింపన్ హవ్యవాహ ప్రభా
వల సత్ఫాలతలుల్ బుధప్రవరు లొప్పన్ రాఁగ నా రాచ వీ
డలరారెం గవితాస్పదం బనఁగ నార్యాశ్చర్య ధౌరేయమై.

మును వజ్రాహతి పాత భీతిమెయి సొంపుం బాసి సోత్కంపతన్
వనధిన్ డాఁగిన పక్ష పచ్ఛి ఖరి మైనాకుండు వజ్రాసనం
బున శ్రీరాయలు కాలుపెట్టు నను సమ్మోదంబుతోఁ గాన్క తె
చ్చిన రత్నచ్ఛవి మత్కిరీట మన దోఁచెన్ రాచవీడయ్యెడన్.

పుడమి బరువింక రాయలు మోయు ననుచుఁ
దీరుబడి చూచుకొని యష్టదిగ్గజములు
చుట్టె శ్రీకారముల్ రసజ్ఞుల శ్రవస్సు
లలర భవ్య మహా కావ్యములకు నాఁడు.

పొలపము నెత్తు ముత్తియపు మ్రుగ్గుల జగ్గులతో ననంటి బో
దెల రమణించు ద్వారముల నిగ్గులతో నెఱిపూఁత జీడి పిం
దె లలరు మావి కొమ్మలఁ గుదించి వెలార్చిన తోరణాళితో
విలసితమై వసంత కృతి వీధికిఁ దత్పురి తీర్చెఁ దీరికన్.

పౌరిపౌరి వగ్గులై వయసు ముగ్గిన ముత్తెపు మ్రుగ్గు బుట్ట లౌ
శిరములతోడఁ బున్నెముల చేరికలై తగు రాచ యైదువల్
తిరుమలదేవి ఫాలమున దిద్దిన కుంకుమ సోగరేకలోఁ
దెరమఱుఁగింత లేక గమనించిరి రాయల పట్ట బంధమున్.

అరయంగా నెటఁ జూచినం దనకుఁ దానై యున్న యట్లుండి యం
దఱి డెందంబుల కాతిధేయ పరమానందంబు నిండార్చు తి
మ్మరుసయ్యం గనుఁగొంచుఁ దద్రుచిర నేత్రాంతంబులన్ వింత దొం
తరలై తోఁచిన కృష్ణమూర్తులకు జోతల్ తీర్చి రభ్యాగతుల్.

ఒకచో. వచ్చిన రాచ వారి సుచితోద్యోగంబునం దీర్చు లౌ
కిక మర్యాదలకున్. మఱొక్కయెడ భక్తిన్ సక్తిఁ బాటించి వై
దిక మార్గంబునకున్ గనుల్ పనిచి మంత్రి శ్రేష్ఠుఁ డాతండు కౌ
తుకియై నిల్చెను భ్రూ యుగాంతరము నందున్ గృష్ణ కళ్యాణమున్.

శ్రీ గణాధిపతి నర్చింపఁ దెచ్చిన యట్టి
పసపులోఁ జాయ నేర్పఱచి చూచి
యింద్ర శాంతికి వెలయించు మహావేది
కల కట్టడంబుల కొలత లెన్ని
నరపాలు కొఱకు స్నాన మొనర్పఁ దెచ్చిన
సకల మృత్స్న విశేషంబు లరసి
యకలంక గతిఁ బట్ట ముకుట నిర్మాణ ప్ర
మాణాను గుణ్యముల్ మదిఁ దలంచి

గజ వదన పూజతో ను పక్రాంతమై గ
జాధి రోహాంతమైన పట్టాభిషేక
కర్మ కాండము "ఋషేష్టి" గాఁగ నడపెఁ
దిమ్మరుసు మంత్రి భావనా దీప్త వీధి.

చేరి రాంధ్రావనికి సర్వ భారతీయు;
లాంధ్రు లెల్లరుఁ గర్ణాట మందుఁ జేరి;
రఖిల కర్ణాట జనులు తిమ్మరుసుఁ జేరి
రతఁడు శ్రీకృష్ణదేవరాయలను జేరె.

రాశీభూత పురాణ భారత సుధర్మ క్షేత్ర సంచార లీ
లా కుంభజ్జయ పాణి రాయలకుఁ గల్యాణాభిషేకంబు ప
ర్వాళల్ పండఁగ రేపనంగఁ దొలినాఁడా దిక్షితీశాన ది
వ్యాశీః కల్పకసూన సౌరభము నాంద్యాహ్వానమై సొంపిలెన్.

పొలుపుల్ పొంగిన మంగళ స్వనముతోఁ బుష్పోదయంబైన రా
య లోఁగిన్ దిర్మలదేవి నిర్మల కపోలా దర్శముం గాంచె; నం
ఘ్రులకున్ మ్రొక్కన దచ్ఛిఖామణి హారంగుల్ చూచె; నద్దేవి దీ
పిలగాఁ బల్కిన పల్కులందుఁ గనియెన్ వీణాస్వనత్తంత్రులన్.

'ఆంధ్ర పురాణము': శ్రీకృష్ణదేవరాయ పర్వము నుండి—



ఓరిమి గల పసరానికి తేట నీరు.

* * *

చింత చచ్చినా పులుపు చావదు.

* * *

ఇల్లు ఇరకాటం ఆలి మరకాటం.

* * *

ఈనగాచి నక్కల పాలు.

— తెలుగు సామెతలు.

# బడ్జెట్ పై పత్రికల వ్యాఖ్యలు

**1960-61** ఆంధ్ర ప్రదేశ్ బడ్జెటు బహుముఖమయిన అభివృద్ధికి సూచికగా ఉన్నదని మొత్తం మీద వార్తా పత్రికలన్నీ హర్షించినవి. పెక్కు ప్రాజెక్టుల అమలు విషయంలో మన రాష్ట్రం మిగిలిన రాష్ట్రాలకు ఆదర్శప్రాయంగా ఉన్నదనే అభిప్రాయం వ్యక్తీకరించబడింది.

## "సత్వరాభివృద్ధి"

1960-61 రాష్ట్ర బడ్జెటుపై వ్యాఖ్యానిస్తూ "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" (22-2-60) యిలా అన్నది. "ప్రస్తుత ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల ఏకీకరణ ఎంత చక్కగా కొనసాగుతున్నదో, ఆ అభివృద్ధి ప్రభుత్వ ఆర్థిక స్తోమత, స్థిరత్వాలలో ఎలా ప్రతిఫలిస్తున్నదో శ్రీ బ్రహ్మానందరెడ్డి బడ్జెటు నిరూపిస్తున్నది.

"1956 లో కేవలం రూ 47.25 కోట్ల సాలుసరి ఆదాయంతో సుమారు 4 కోట్ల రూపాయల లోటుతో ఆరంభమయిన రాష్ట్రం 1960-61 బడ్జెటులో రూ. 82.18 కోట్ల ఆదాయాన్ని చూపకలిగింది. ఇప్పుడు ప్రత్యేక కార్పొరేషన్‌లు అయిన విద్యుచ్ఛక్తి, రవాణా శాఖల ఆదాయాలు కలపలేదు కాని లేకపోతే యిది రూ. 90 కోట్లు అయి ఉండును. ప్రస్తుత బడ్జెటులో ప్రభుత్వాదాయం, రొఖ్ఖం మిగుళ్ళలో యిందు కనుగుణమయిన అభివృద్ధి లేకపోతే, అందుకు ప్రమాదకరమయిన ఆర్థిక వ్యత్యాసాలు మాత్రం కారణం కాదు, ప్రణాళిక క్రింది వివిధ ప్రాజెక్టులను ఉత్సాహంతో అంగీకరించటమే కాక రాజకీయ, ఆర్థికాభివృద్ధుల ప్రస్తుత ఘట్టంలో ప్రజాస్వామ్య ప్రభుత్వ ఆశయాలను కూడా అంగీకరించడమే యిందుకు కారణం.

"అయితే, ప్రభుత్వ వ్యాపారం విషయంలో మరికొంత అభివృద్ధి వుండవలసింది. రవాణా సంస్థ నికరాదాయం 77 లక్షల రూపాయల నుంచి 111 లక్షలకు పెరిగే అవకాశం ఉండగా విద్యుచ్ఛక్తి బోర్డు నికరాదాయంలో 1.77 కోట్ల లోటు ఉంది. మళ్ళీ పారిశ్రామిక ఆర్థిక సహాయ సంస్థకు $2\frac{1}{2}$ లక్షలు సహాయం చేయవలసి వుంటుంది."

## "నూతన మార్గాల సాధన"

"డెయిలీ న్యూస్" (23-2-60) యిలా అన్నది: "జంట నగరాలలో నిరుద్యోగ నివారణకు చిన్న పరిశ్రమల స్థాపన నిమిత్తం సొమ్ము కేటాయించటంలో ఆంధ్ర ప్రదేశ్ బడ్జెట్ నూతన మార్గాలను కనుగొన్నది. అలాగే వినోదపు పన్నులలో మునిసిపాలిటీల వాటా హెచ్చించబడింది. సాంకేతిక వృత్తి విద్యా కళాశాలల్లో ఆర్థిక సహాయం అవసరమయే మేధావి విద్యార్థులకు విద్యా విషయిక అప్పుల మంజూరీకై రెండు లక్షల రూపాయలు కేటాయించబడినవి. పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్ ఏర్పాటు వంటి ప్రయోజనకరమైన యితర చర్యలు కూడ గైకొనబడినవి. ఈ సంస్థ పెట్టుబడిదారులకు విశ్వాసం పూరించి ప్రైవేటు విభాగంలో పరిశ్రమల అభివృద్ధికి దోహదం చేయగలదు.

"దేశానికి ధాన్యాగారమయిన ఆంధ్ర ప్రదేశ్‌లో సైతం లోటు ప్రదేశాలు ఉన్నవి. నిజానికిది అఖిలభారత సమస్య. కాని తగినంత సరుకును నిల్వచేసి తద్వారా ధరల పెరుగుదలను అరికట్టాలి; సరసమయిన ధరలకు ప్రజలకు సరుకును అందించే ఏర్పాట్లు జరగాలి; అక్రమ నిల్వదారుల ఆటలు కట్టించబడాలి."

## "ఆదర్శప్రాయం"

"హిందూ" పత్రిక (23-2-60) యిలా అన్నది :

"ప్రణాళికా ప్రాజెక్టుల పెట్టుబడికై ప్రస్తుత ఆదాయంలో యెక్కువ పొదుపు చేయవలసినదనే విమర్శకు అవకాశం ఉన్నప్పటికీ, ప్రణాళికా, ప్రణాళికేతర పథకాలపై ఖర్చు బాగా హెచ్చినది. అప్పుడు మొత్తం లోటును పూర్తిగా నివారించుకో లేక పోయినా కొంత తగ్గించుకో వచ్చును.... రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు లాభసాటిగా పని చేసినట్లయితే రాష్ట్ర ఆర్థిక పరిస్థితి మెరుగు కావడం తథ్యం............ రోడ్డు రవాణా కార్పొరేషన్ బాగానే పని చేసినది. కాని యిక్కడ కూడా సామర్థ్యాన్ని యింకా హెచ్చించి పెట్టుబడిలో ప్రతి పైస యెక్కువ లాభం ఆర్జించేలా చూడవచ్చు....

"1960-61 బడ్జెటు విషయంలో శ్రీ బ్రహ్మానందరెడ్డి అదనపు పన్నులను విధించ లేదు. పంచాయతీలకు హెచ్చు మొత్తాలను సమకూర్చి కూడా రైతులకు, చేనేత పని వారికి లాభకరమయిన కొన్ని సౌకర్యాలను కల్పించిన రాష్ట్ర ఆర్థిక మంత్రులలో నిజానికి యీయన ప్రప్రథములు.

"కొత్తగూడెంలో రసాయన ఎరువుల ఫ్యాక్టరీ స్థాపన విషయంలో నేమి, యితర ప్రాజెక్టుల అమలు విషయంలో నేమి యితరులకు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఆదర్శప్రాయమయినది."

## "శతమానం భవతి"

"డెక్కన్ క్రానికల్" (22-2-60) యిలా వ్రాసింది : "పంచవర్ష ప్రణాళికలు వచ్చిన నాటి నుంచి సాలుసరి రాష్ట్ర బడ్జెట్టుల ఆకర్షణ పోయింది. ఎందువల్లనంటే పంచవర్ష ప్రణాళికలు అభివృద్ధి ఆయా అంశాలకు కోట్లాది లెక్కవేయగా బడ్జెటులు లక్షలలో లెక్కవేస్తాయి. అయితే బడ్జెట్టుకి పరిమితమయిన దాని సీమలలో ఒక ఆకర్షణ ఉంది. మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి వచ్చే రెండు మూడు సంవత్సరాలలో ఆదాయం క్రింద శతమానాన్ని సాధించ సంకల్పించారు. ఇది గమనార్హం. ప్రస్తుత మంత్రి వర్గం పదవీ విరమణ చేసే సరికి ఆదాయం అన్ని వనరులను వుపయోగానికి తెచ్చిన సంతృప్తి దానికి మిగలగలదు."

## "సౌష్ఠవమయినది"

"మెయిల్" పత్రిక (23-2-60) యిలా వ్రాసింది:

"రాష్ట్ర శాసన సభలో ప్రతిపాదించిన కొత్త బడ్జెట్టు చిక్కులు ఎంత నేర్పుతో తప్పించుకోబడినవో నిరూపిస్తున్నది. స్వల్పమయిన పన్ను మినహాయింపులు సైతం చేయడంవల్ల భావి విస్తరణలోగల విశ్వాసం ఋజువవుతున్నది. భాషా ప్రయుక్త రాష్ట్రం ఏర్పాటును, కలిసి ఉండి ఆర్థిక విషయాలలో పరస్పర పరిపూరకాలయిన ప్రదేశాల ఏకీకరణను కూడా యిది సమర్థిస్తున్నదని చెప్పవచ్చు.

"మొత్తం మీద బడ్జెట్టు సౌష్ఠవంగా ఉండి, అన్ని దిశలలోను క్రమాభివృద్ధికి అవకాశం కల్పిస్తున్నది."

## "సామాన్యం"

"ఆంధ్ర జనత" (24-2-60) యిలా అన్నది: "బడ్జెటు ప్రతిపాదనలు అంత మరీ హర్షదాయకంగానూ లేవు. అలాగని అంత నిరుత్సాహ జనకంగానూ లేవు. నిరుద్యోగ నివారణార్థం కొత్త పరిశ్రమల స్థాపనకు కేవలం పదిలక్షల రూపాయలు మాత్రమే కేటాయించారు. ఈ మొత్తం అతి స్వల్పం."

## "భూసంస్కరణల ప్రసక్తి లేదు."

"విశాలాంధ్ర" (22.2.60) యిలా వ్రాసింది: "బడ్జెటులో భూసంస్కరణల ప్రసక్తి లేదు. బడ్జెటు సమయంలో కొత్త పన్నులను గురించి ప్రస్తావించక తరువాత అదనపు పన్నులు ప్రవేశ పెట్టటం రాష్ట్ర ప్రభుత్వానికి అలవాటయింది."

## "ప్రశంసనీయం"

"ఆంధ్ర పత్రిక" (23.2.60) యిలా వ్రాసింది: "సాంకేతిక విద్యాభ్యాసం చేస్తున్న విద్యార్థులకు ఋణ సదుపాయం కలిగించడానికి రెండు లక్షల రూపాయలను కేటాయించటం మెచ్చుకొనదగిన విషయం. ధన సహాయమన్నది అర్హులయిన బీద విద్యార్థులకు అందేట్టు చూడటం ముఖ్యం.

"పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్ క్రింద అప్పులు జాగ్రత్తగా యివ్వబడాలి. పాత అప్పుల వినియోగాన్నీ బాకీ వసూళ్లను ఆర్థిక మంత్రి యీ సందర్భంలో విశదీకరించ వలసింది.

"వరదనిరోధ రవాణా, పథకాలు, పరిశ్రమలు, విద్యుచ్ఛక్తులకు తృతీయ ప్రణాళికలో హెచ్చు మొత్తాలు కేటాయించ బడాలి."

## వెనుకబడిన తెలంగాణా పట్ల ప్రత్యేక శ్రద్ధ అవసరం

"గోల్కొండ పత్రిక" (23, 24-2-60) యిలా వ్రాసింది: "ఇప్పుడు బడ్జెటులో పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణానికి 60 లక్షలు కేటాయించబడినవి కనుక త్వరలోనే పని ప్రారంభం కాగలదని ఆశించబడుతున్నది.

"ఇదివరకే ఉన్న పారిశ్రామిక ఆర్థిక సహాయ సంస్థ, ఇప్పుడు సంకల్పించిన పారిశ్రామిక అభివృద్ధి సంస్థలో విలీనం కావాలా లేక విడివిడిగా పనిచేయాలా అన్న విషయాన్ని ప్రభుత్వం పరిశీలించవలసి ఉంది. వెనుకబడిన తెలంగాణా, ధరల అదుపు, రైతులకు యితోధిక సౌకర్యాలకు వసతి, నిరుద్యోగ సమస్యల విషయంలో ప్రత్యేకశ్రద్ధ గైకొనబడాలి."

## "క్రమాభివృద్ధి"

"ఆంధ్ర ప్రభ" యిలా అభిప్రాయపడింది: "బడ్జెటు అంకెలు రాష్ట్ర క్రమాభివృద్ధిని నిరూపిస్తున్నవి. ఆర్థికమంత్రి నేటి బడ్జెటులో కొత్త పన్ను లేవీ సంకల్పించక పోవటమే కాక వ్యాపసాయిక, పారిశ్రామికరంగాలకు కొంత సహాయం చేసే సంకల్పంతో కొన్ని తగ్గింపులు కూడా చేశారు. ఇది చాల అవసరమయిన సహాయం. ఇందువల్ల బడ్జెటు మిగులు 2[illegible] లక్షలు 26 లక్షల తరుగుగా మారుతుంది. అయినా, యీ తగ్గింపులు చేయడానికి ఆయన వెనుకాడక పోవడం ప్రశంసార్హం."

## "అచితూచి రూపొందించబడింది"

"పైసా అక్బార్" పత్రిక (24-2-60) తన సంపాదకీయంలో "బడ్జెటును అచితూచి తయారు చేసిన" రాష్ట్ర ఆర్థిక మంత్రికి జోహారు లర్పించింది. "వేతనాల సంఘం సిఫార్సుల అమలుకు అధిక వ్యయం అవసరమయినప్పటికీ కొత్త పన్నులు విధించకుండా ప్రజోపయోగకరమయిన పనులకు తగినంత సొమ్ము కేటాయించినందుకు శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ప్రజల కృతజ్ఞతకు పాత్రులు." అన్న మాటలతో ఆరంభమయి:—

"ఏమయినా, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సమర్పించిన యీ బడ్జెటు సర్వ సంపూర్ణము, సర్వ సమగ్రము అయి ప్రజల మన్ననలను అందుకొంటున్నది. ఆంధ్ర ప్రదేశ్ వాణిజ్య, పరిశ్రమల మండలి అధ్యక్షుడు శ్రీ కాదర్ తయాబ్జీ మాటలలో, యిది ప్రాక్టికల్ బడ్జెటు: ఇందులో రాష్ట్రంలో దాదాపు అన్ని అవసరాలకు బహు సమర్థతతో నేర్పుతో వసతి కల్పించబడింది." అన్న మాటలతో ముగించబడింది.

తృతీయ పంచవర్ష ప్రణాళిక సందర్భంలో బడ్జెటు కేటాయింపులను గురించి ప్రస్తావించి "ముషీరే దెక్కన్" (23-2-60) యిలా అన్నది: "తృతీయ పంచవర్ష ప్రణాళికకు బడ్జెటులో కేటాయించిన సొమ్మును వివేకంతో ఖర్చు పెట్టటం అతి ముఖ్యం. రూపాయలో ఆరు అణాలు మాత్రమే సరిగా ఖర్చుపెట్టబడగా మిగిలిన పది అణాలు చిత్తశుద్ధి రహితమయిన చర్యల ద్వారా దుర్వినియోగం అవుతున్నదని గతానుభవం వల్ల తెలుస్తున్నది. 'అభివృద్ధి, ప్రణాళికలు' పేరున యీ చెడుగు దేశమంతటా వ్యాపించి నట్టు కనబడుతున్నా, ఆంధ్రప్రదేశ్ పరిపాలనా వ్యవహర్తలు బడ్జెటులోని సొమ్ము మిక్కిలి పొదుపుగా ఖర్చు అయేలా చూడాలి."

## "విద్యా విషయిక గ్రాంటులు హర్షణీయం"

శ్రీ ఇస్మైల్ జబీ "నిర్జీవమయిన బడ్జెటు" అన్న శీర్షిక క్రింద వ్రాసిన ఒక సంపాదకీయంలో (22-2-60 తేదీగల "హమారా ఇక్దమ్"లో) యిలా అన్నారు:

"ప్రజలు బీదార్లై ఉన్న సమయంలో నేషనల్ థియేటర్, స్టేడియం, కార్యాలయాలు, మంత్రులకు ప్రత్యేక గృహాల నిర్మాణానికి వసతి కల్పించటం తగదు. అయితే, సాంకేతిక విద్యకు 72 లక్షల రూపాయలను కేటాయించటమే కాక సాంకేతిక, వృత్తి విద్యా కళాశాలల్లో చదివే యోగ్యులయిన విద్యార్థులకు విద్యా విషయక అప్పులు యివ్వడానికి రెండు లక్షలను కేటాయించడం హర్షణీయం."

రచయిత యీ వ్యాసాన్ని యిలా ముగించారు: "మొత్తంమీద బడ్జెటు ప్రతిపాదనలు కేవలం నిర్జీవంగా ఉన్నవి, వాటికి ప్రాణ ప్రతిష్ఠ చేయడం అవసరం."

"నైజాం గెజెట్" (22-2-60) సంపాదకీయంలో యిలా వ్రాసింది: "1960-61 బడ్జెటు ప్రతిపాదనలో పెక్కు సల్లక్షణాలు ఉన్నప్పటికీ అసాధారణ మయిన విషయా లేమీ లేవు. మామూలుగా ప్రజలు దానిని సంపన్న మయిన బడ్జెటు అనరు. అటువంటి బడ్జెటును సమర్పిం చాలన్న నిశ్చయం ఆర్థికమంత్రికి ఉండటం, ముఖ్యంగా యీ ప్రతిపాదనను తుది ఆమోదానికి ముందు చర్చించ బడవలసి ఉన్నది కనుక, ముదావహం. కాబట్టి శాసన సభ చర్చల సందర్భంలో జరిగే సవరణలవల్ల యిది 'సంపన్నమయిన బడ్జెటు' గా మారే అవకాశం వుంది. ఈ ఆశయ సిద్ధికి అవసరమయిన సవరణల నన్నిటిని ఆర్థికమంత్రి అంగీకరిస్తారని ఆశించాలి."

## "ఆర్థిక వ్యవస్థ క్రమాభివృద్ధికి ప్రతిబింబం"

"అంగారే" (22-2-60) ఇలా అభిప్రాయ పడింది:—

"కొత్త సంవత్సరం బడ్జెటు ప్రతి పాదనలు సరైన తూకంలో ఉంచి, రాష్ట్రంలో 'ఆర్థికవ్యవస్థ క్రమాభివృద్ధి'ని ప్రతి బింబిస్తున్నవి. ముఖ్యంగా రాష్ట్రం సత్వాతో ముఖాభి వృద్ధికి బహు జాగ్రత్తతో, సమర్థతో పథకకల్పించినందున దీనిని సామాన్యమయిన బడ్జెట్ అని అనలేము. ఆర్థిక వ్యవస్థ ప్రణాళికాబద్ధమయిన యీ రోజులలో మన రాష్ట్ర బడ్జెటు కొత్త అంశాలను తన పరిధిలోనికి తీసుకొని స్థానం సంపాదించుకొన్నది."

## "వేగం తగ్గించ బడలేదు"

"సియాసత్" (23-2-60) ఇలా అన్నది; "ప్రతి రాష్ట్రం తన ఆంతరంగిక సమస్యలను బడ్జెటు ప్రతిపాద నల ద్వారా పరిష్కరించుకోవాలి. కాని ఆంధ్ర ప్రదేశ్ బడ్జెటు యీ ఆశయ సిద్ధికి కృషి చేస్తున్నట్టు కనబడదు.... కొత్త బడ్జెటులో ఆయ వ్యయాలు రెండూ హెచ్చాయి. కాని కొత్త పన్నులు లేకుండా అదాయంలో 4 కోట్లను హెచ్చిం చడానికి చేసిన ప్రయత్నం గమనార్హమయినది. ఇప్పుడు ఆశించినట్టుగా అదాయం హెచ్చకపోతే 22* లక్షల లోటు దాదాపు $4\frac{1}{2}$ కోట్లు లోటుగా మారుతుంది ఇది రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు కడుభారం కాగలదు."

ఈ పత్రిక యింకా యిలా అన్నది; "ఈ కొత్త బడ్జె టులో గల ఒక ముఖ్య లక్షణమేమంటే అభివృద్ధి పనుల వేగం తగ్గించటానికి ప్రయత్నం జరుగలేదు. ద్వితీయ ప్రణాళిక లక్ష్యాల సాధన ద్వారా తృతీయ ప్రణాళిక మరింత ఆత్మ విశ్వాసంతో అమలు జరుపుకొన గల మన్న ఆర్థిక మంత్రి అభిప్రాయంలో అంతా ఏకీభవిస్తా రనటం తథ్యం."

ఎక్కడైనా బావకాని వంగతోట దగ్గిర బావకాదు.

* * *

పిల్లికి చెలగాటం ఎలుకకి ప్రాణ సంకటం.

— తెలుగు సామెతలు.

* ఏర్పడగలదను కొన్న లోటు 26 లక్షలు.

# భక్త్యంజలి

— మెండా చిన సీతారామయ్య

( శ్రీరామనవమి సందర్భమున )

శ్రీమహిజా కళత్ర ! యతసీసుమసన్నిభగాత్ర ! కిల్బిష
స్తోమలతాలవిత్ర ! నవతోయరుహాయత చారునేత్ర ! చాం
ద్రీమృదుకీర్తి శోభితచరిత్ర ! నిశాటతమోసవిత్ర ! శ్రీ
రామ ! భవత్కృపారసపరంపర మాపయి నింపు నిచ్చలున్

శకుల గ్రామణివై జలగ్రహమవై సమ్యగ్వరాహంబవై
యకలంకోజ్జ్వల భక్తసంస్తుత నృహర్యక్షంబవై పిన్నవై
సకలక్ష్మాపతి కంఠలుంఠకుడవై సర్వంసహాచక్రమున్
సకృపన్ గాచిన రామ ! నిన్ గొలిచెదన్ సాయుజ్య సంప్రాప్తికై

శతమన్యు ప్రతిమానవైభవము నీసన్మాత్రమున్ గోరబో
నతిసౌందర్య విలాసలాలసుఁడ దేవాబ్జాక్షులంగోరన
చ్చతురాస్యాదిసుర ప్రపూజ్యమగుయుష్మత్పాదరేణుప్రభా
తతినే కోరుదునేను సంతతము సీతాచిత్తపాటచ్చరా !

మామకమానసార్తులను మాపగనిక్కపుస్వామివంచు నిన్
రాము ! నుతింతు నానుతుల రంజిలి వేగ పరిగ్రహించు నీ
కోమల బాహుమధ్యమున గోత్రవిభేదన ముఖ్యనిర్జరో
ద్దామ కిరీటరత్న లలితద్యుతి సాటుపాద పీఠిపై

సుందర మందహాస రుచిశోభితవక్త్రము తోడ ప్రేమచే
చిందులు త్రొక్కు నేత్రసరసీరుహయుగ్మము తోడ నీవు నా
యందు వసించి భీకర భవాంబుధి దాటగ జేయుమో దశ
స్యందన నందనాగ్రజ ! మహత్తర తారక నామ ! రాఘవా !

# భార్యను లొంగదీసే విధానాలు

— మునిమాణిక్యం నరసింహారావు

పంతులు — కాంతం

కాం:- ఏమండీ అల్లాగ దిగాలపడి కూర్చున్నారేం ?

పం:- దిగులు కాదు. వాడి సంగతే ఆలోచిస్తున్నాను.

కాం:- ఎవరి సంగతి ?

పం:- అదేమన సుందరం సంగతి.

కాం:- ఏమిటండీ వాడి సంగతి ?

పం:- ఆఁ ఏమైతేనేం? వళ్లు మండి పోతుంది. ఎన్ని సార్లని చెప్పేది ? మాట వినే రకం అయితే అనుకోవచ్చు. ఎబ్బే ! ఈ రకం మనుష్యులను బాగు చేయడం కష్టం !

కాం:- వట్టి వెఱ్ఱిబాగుల వాడండీ సుందరం. పాపం మంచి వాడు. వాణ్ణి గురించి ఎందుకండీ మీకు విచారం ?

పం:- ఎందుకంటే ! వాడి మూలంగా నేను పది మందిలో తల ఎత్తుకొని తిరగ లేకుండా ఉన్నాను.

కాం:- అంత చెడ్డ పని చేస్తున్నాడుటండీ? ఏమిటది ? ఏం జేస్తున్నాడంటారు ?

పం:- ఇంకేం జెయ్యాలే? ఆ పెళ్లాం ఎంత చెపితే అంత. నోరెత్తడు. ఆమె గీచిన గీటు దాటడు.

కాం:- అయితే మీకొచ్చిన ఇబ్బంది ఏమిటో నాకు అర్థం కావడం లేదు.

పం:- అర్థం కాదు నీకు, నాకర్మం! అంతా నవ్వుతున్నారు. ప్రతి వాడు ఏమండీ శిష్యుణ్ణి బాగా తయారు చేశారే ! అని అంటుంటే తల కొట్టేసినట్లుంది. కొందరు — "ఆఁ ! అందులో విపరీతం ఏముందిలే. గురువుగారిలాగే శిష్యుడూ తయారైనాడు'' అని కూడా అంటున్నారు.

కాం:- అఁహ మీదంతా మరీ చోద్యం అండీ ! పెళ్లాం మాట వినడం తప్పు అయింది టండీ ! అందులో సుందరం భార్య చొత్తిగా చిన్న సన్నాసి. దానికి కాస్త ఇంటి పనుల్లో సాయపడుతూ ఉంటాడు సుందరం. ఈ మాత్రానికే అంతా ఆడిపోసుకో వాలె ఏమిటండీ ?

పం:- సాయ పడటమూ కాదు చట్టు బండలూ కాదు. ఆ పిల్ల చేతుల్లో ఈ సన్నాసి కీలు బొమ్మ అయిపోయినాడు. పూర్తిగా లొంగి పోయినాడు.

కాం:- (నవ్వి) ఆఁ అంతా లొంగుతారు. లొంగనిదెవరు!

పం:- అనుకో. అయినా మొదటి రోజులలో నైనా కాస్త బెట్టుగా ఉండకపోతే, ముందు ముందు ఆ పిల్ల వాడి నెత్తి నెక్కి కూర్చోదూ ఈ పిల్ల !

కాం:- కూర్చున్న వాళ్లంతా ?

పం:- ఎవరు కూర్చున్నారు ! నీ వొక్క దానివి కనపడుతున్నావు అటువంటి దానివి !

కాం:- అమ్మో. అయ్యో. నేను మీ నెత్తి నెక్కి కూర్చున్నాననే మీరనడం ! బాగుంది ! అయినా నా మాట ఎందుకండీ ! మీ శిష్యుణ్ణి మీ ఇష్టం వచ్చినట్లు దిద్దుకొండి నాకెందుకు ఈ గొడవ? అదిగో సుందరం వస్తున్నాడు.

(సుందరం ప్రవేశం)

రావయ్యా సుందరం. అనుకొంటూ ఉండగానే వచ్చావు. నూరేళ్ల ఆయుస్సు రారా నాయనా.

(2) కాంతం, పంతులు, సుందరం

సుం:- నా సంగతి ఏమొచ్చింది పిన్నీ ?

కాం:- ఆ సంగతి బాబాయినే అడుగు నాయినా ?

పం:- కూర్చోవోయ్ సుందరం: ఎట్లా ఉంది వ్యవహారం?

సుం:- ఏం వ్యవహారం బాబాయ్ ?

పం:- అదేనయ్యా. నేను నీకు చెప్పాను చూశావ్ ఆ విషయం ? ఏం ? అల్లాగ చూస్తావు ? నీ భార్య విషయమయ్యా !

సుం:- అహా ఆ సంగతా బాబాయ్?

పం:- అఁ అదే. లొంగదీసు కొస్తున్నావా ?

సుం:- సగం లొంగింది బాబాయ్.

పం:- సగం లొంగడం ఏమిటోయ్ ?

సుం:- అంటే ఎంత భార్యనైనా ఒక్క సారి లొంగదీయడం కష్టం కాదు బాబాయ్?

పం:- అయితే ఇప్పుడెంత వరకు వచ్చిందంటావ్ ? నీ మాట వింటున్నదా ఆ పిల్ల ?

సుం:- సగం !

పం:- (నవ్వి) సగం వినడం ఏమిట్రా. నా తలకాయ?

సుం;- ఏమిటంటే. బాబాయ్. నేనూ. "సత్యవతీ, వంట యింట్లోకి పోయి కాస్త కాఫీ చేసుకొని తీసుకురా" అంటానా. అంటే. ఆ మాట సగం వింటుంది.

పం:- అంటే ?

సుం:- అంటే. నా ఆజ్ఞలో మొదటి భాగం వినయంగా నిర్వహిస్తుంది బాబాయ్.

పం:- అంటే వంట యింట్లోకి పోవడం వరకు వింటుంది అంతేనా ?

సుం:- అంతే బాబాయ్, వంట యింట్లోకి పొమ్మన్నాగా పోతుంది. కాని కాఫీ సంగతి మాత్రం వినదు.

పం:- ఏడ్చినట్లుంది. అదా సగం వినడం అంటే !

సుం;- "ఏదైనా ఒక విషయం జరగాలంటే అంతా నా నెత్తి మీదే వేయకూడదు. సగం మీరూ, సగం నేనూ, చెయ్యాలి" అని అంటుంది. ఒకరికొకరు సాయం చేసుకోవడం అంటే అదే నట !

కాం:- అంటే ఇందాక నీవు ఇచ్చిన ఆజ్ఞలో వంటయింట్లోకి వెళ్ళడం వరకు ఆవిడ వంతూనూ కాఫీ చేయడం నీ వంతూనూ: అంతేనా: ఈ ఏర్పాటు చాలా బాగుందిరా సుందరం!

సుం:- ఈ ఏర్పాటు సత్యవతే చేసింది పిన్నీ.

కాం:- బాగుందిరా సుందరం. ఇంకా ఇటువంటి ఏర్పాట్లు ఏమైనా చేసిందా?

సుం:- చేసింది పిన్నీ, ఏమిటంటే రోజును రెండు భాగాలు చేసి, ఒక పూట ఆమె మాట సాగేటట్లు, రెండో పూట నా మాట సాగేటట్లు ఏర్పాటు చేసింది సత్యవతి.

కాం:- అంటే ప్రొద్దుటి పూట నీ మాట సాగేలాగున, సాయంత్రం...............

సుం;- అల్లాకాదు పిన్నీ! ప్రొద్దుటి పూట ఆవిడ ఇష్ట ప్రకారం ఆవిడ ఆజ్ఞలిస్తుంది. సాయంత్రం పూట ఆవిడ ఇష్ట ప్రకారం నేను ఆజ్ఞాపిస్తాను.

కాం:- బాగుందిరా అబ్బాయి! చాలా బాగుంది ఈ ఏర్పాటు.

పం:- అరే సుందరం! నీవు వట్టి తెలివితక్కువ దద్దమ్మవురా.

సుం:- రైట్ బాబాయి. సరియైన మాట అన్నావు.

పం:- ఏం? ఎందుకట్లా అన్నావు?

సుం:- ఎందుకంటే, బాబాయ్, సరిగ్గా సత్యవతీ కూడా ఈ మాటే అన్నది. ఇంత చదువుకొన్న వాడవు నీవు అన్న మాట ఆమె అనగలగడం ఎంత గొప్ప! ఆమె తెలివి తేటలు నీతో సమానంగా ఉన్నవన్న మాట!

పం:- ఓరి వాజమ్మా! నీవు ఇల్లాగ ఆవిడకు లొంగిపోయినావా, ఎందుకూ పనికిరాకుండా పోతావు. నీ గౌరవం, పేరూ, ప్రతిష్ఠా, మర్యాద. మన్ననా అన్నీ దగ్ధపటలం అయిపోతవి. అంతా నీ సంగతి చెప్పుకొంటారు.

సుం:- ఇప్పటికే చెప్పుకొంటున్నారు బాబాయ్!

పం:- చూశావా మరి. అంతా నవ్వుతారు. హెన్‌పెక్డ్ హజ్బెండు అని అంతా నవ్వుతారు. పది మందిలో తలెత్తుకొని తిరగలేవు.

సుం:- పోనీ తల వంచుకొనే తిరుగుతాను బాబాయ్.

పం:- ఓరి వాజమ్మా! తల వంచుకొని తిరిగేవాకా నీకేం కర్మంరా? జమీందారు బిడ్డ లాగ తిరగ వలసిన వాడవు!

సుం:- ఏంజేయ మంటావ్ బాబాయ్?

పం:- మళ్లీ అదే మాటా ? ఎన్నిసార్లు చెప్పానురా భార్య ఎదుట కాస్త దర్జా చూపమని !

కాం:- అవును నీకు ఆ మాట చాలా సార్లు చెప్పారు మీ బాబాయ్

సుం:- చెప్పిన మాట నిజమే కాని దర్జా చూపటం అంటే ఏమిటో నాకు బొత్తిగా తెలియదు పిన్నీ.

కాం:- పాపం చూశారా. ఎట్టి అమాయకుడండీ సుందరం! వెధవది జాలేస్తుంది. నలుగురి నోళ్లలోపడి నవ్వుల పాలు కాకుండా దర్జా చూపడమం అంటే ఏమిటో తెలిసేలాగున చెప్పరాదుటండీ వాడికి !

పం:- ఒరేయ్. చూడూ. నేను చెప్పినట్లు చేస్తావా ?

సుం:- చేస్తాను బాబాయ్. నీవు ఏమిచేయమన్నా చేస్తాను. బావిలో దూక మంటే, దూకుతాను. నిప్పులోకి ఉరకమంటే ఉరుకుతాను. ఆకాశంలోకి ఎగరమంటే ఎగురుతాను. సముద్రంలోకి........

పం:- ఏడిశావు. అటువంటివి ఏమీ చేయ నక్కరలేదు చూడూ. ఏదైనా పని కావాలనుకో. ఆ పని చెయ్యమని ఆమెకు చెప్పు. దర్జాగా చెప్పు. నసగబోకు.

సుం:- చెపుతూనే ఉన్నానుగా !

పం:- అట్లా కాదురా పిచ్చి సన్యాసీ. నీవు చెపుతున్నావు సరే నీవు చెప్పినట్లు ఆ అమ్మాయి చేస్తున్నదా ?

సుం:- సగం చేస్తున్నదని చెప్పానుగా బాబాయ్.

పం:- సగం గిగం నై. పని అంతా ఆ పిల్ల చెయ్యాలిసిందే.

కాం:- అట్లాగే చెయ్యి నాయినా. మీ బాబాయి చెప్పినట్లు చెయ్యి.

పం:- మాట వరుసకు చెపుతాను. నీకు మంచి నీళ్లు కావాలనుకో. నీవే వంట ఇంట్లోకి పోయి చెంబు వెతుక్కొని నీళ్లు ముంచుకొని తెచ్చుకొని త్రాగకూడదు.

సుం:- అవును. తెచ్చుకోకూడదు. బాబాయ్.

పం:- మరి ఏమనాలో తెలుసా ?

సుం:- కాసిని మంచి నీళ్లు తీసుకురా సత్యవతీ—అని అడగాలె.

పం:- అడగటం కాదురా. ఆజ్ఞాపించు.

సుం:- అట్లాగే బాబాయి. కాని.... తీసుకురాకపోతే?

పం:- ఎందుకు తీసుకోని రాదురా? ఆ అడగటంలో ఉంది. దర్జాగా ఆజ్ఞాపించాలే. ఏదీ అను చూద్దాం !

సుం:- మంచి నీళ్లు కావాలే. తీసుకొనిరా సత్యవతీ.

పం:- నీముఖం. నీ తలకాయ. పిచ్చి సన్యాసి! అల్లాగేనా అడగటం! ఏడుస్తూ, భయంతో అంటావేంరా ? ఆ పిల్ల నిన్ను పీక్కు తింటుందనుకొన్నావా ? ఎవరి కోసం తెస్తుంది !—"ఏయ్. మంచినీళ్లు తెచ్చిపెట్టు" అనాలె. దర్జాగా.

సుం:- అప్పటికీ తేకపోతే ?

పం:- ఏడు! ఏంజెప్పేది !

కాం:- అదేంటండీ అల్లా కోప్పడుతారు? తెలియకపోతే చెప్పరాదూ !

పం:- తీసుకరాకపోతే, అన్న సందేహం ఎందుకూ ? తీసుకొస్తుంది. అంతగా పెంకితనం చేసి తీసుకు రాకపోతే "ఏయ్ ఏమిటది.! నీకు గదూ చెపడం ! మంచి నీళ్లు తీసుకురా"—అని దర్జాగా అను. ఇప్పుడు తెలిసిందా ?

సుం:- తెలిసింది బాబాయ్.

పం:- అప్పటికీ తేకపోతే ఏం జేస్తావో చెప్పు నీ తెలివి తేటలు చూద్దాం.

సుం:- ఏం జేస్తాను. నీకు ఫోను చేస్తాను ఏమి చెయ్యాలిసింది చెప్పమని.

పం:- ఛాఛా. ఎన్ని చెప్పినా ఇంతేనా ! అప్పటికీ తేకపోతే కోప్పడు. తమాషాగా తిట్టు.

కాం:- తమాషాగా తిట్టడం ఏమిటండీ?

పం:- తమాషాగా తిట్టడం అంటే ఏమిటి బాబాయ్ ?

పం:- అంటే అవి తిట్లు అని ఆమెకు తెలియకుండా ఉండే పద్ధతిలో తిట్టాలె. తిడుతున్నావు అని తెలిస్తే వ్యవహారం చెడుతుంది తెలుసా!

సుం:- అదెట్లా బాబాయ్ మన తెలుగు తిట్లూ అన్నీ ఆ పిల్లకు తెలుసు, తెలియడమే కాదు. కంఠతా వచ్చు.

పం:- ఇంగ్లీషులో అయితే?

సుం:- ఇంగ్లీషు తిట్లలో ఫూల్, రాస్కెల్ ఇల్లాంటివన్నీ వచ్చు.

పం:- అయితే ఒక పని చెయ్యి. ఆమెకు తెలియని ఇంగ్లీషు పదాలు కోపంతో అను. చెప్పిన పని చేయవేం

ట్రయాంగిలా అవ. నీవు పట్టి స్త్రీరులాగు ఉన్నావు. ఇట్లా అను. దాంతో ఆ పిల్ల హడలిపోతుంది.

కాం:- ఈ మాత్రానికే?

పం:- ఇంకా చిన్న పిల్లేగా! నీవు అయితే హడలిపోవనుకో.

సుం:- ఈ పద్ధతి బాగుంది బాబాయ్.

కాం: నన్ను చిన్నతనంలో అట్లాగే హడల కొట్టారు నాయినా మీ బాబాయ్.

సుం:- ఇహ తెలిసింది బాబాయ్ — రెండు రోజులలో దాన్ని లొంగతీస్తాను చూడు బాబాయ్—వెళ్లనా?

పం:- ఒరేయ్ - ఏమీ భయపడకు. ఏ విషయంలోనూ లొంగకు. బ్రతిమిలాడినా సరే వినకు. ఆ పిల్ల మహా చెడ్డ గడుసుది. నిన్ను అల్లించి చెల్లించి బుట్టలో వేసుకోగలదు. జాగ్రత్త.

సుం:- ఇహ అవన్నీ సాగవులే బాబాయ్. ఇహ చూచుకో.

పం:- ఒరేయ్ సూత్రమురా భార్యను లొంగతీయటానికి. ఏమిటీ అంటే, ఆ పిల్ల మాట సాగకూడదు.

సుం:- చస్తే దానిమాట సాగనియ్యనుగా-వెదుతా బాబాయ్.

(3) మరునాడు:- సుందరం, సత్యవతీ

సుం:- సత్యవతీ-సత్యవతీ! ఇల్లారా

స:- ఎందుకండీ?

సుం:- ఎందుకండీ అని నీవు అడగ్గూడదు. ఎందుకైంది నేను చెప్పనూకూడదు. రమ్మన్నాను రావాలె. రా అంటేరావాలి. పో అంటే పోవాలె తెలిసిందా?

స:- అబ్బో చాలాదాకా వచ్చిందే వ్యవహారం. అయినా ఇప్పుడు చెయ్యి ఊరుకోలేదండి. ఒక్క క్షణం ఉండండి వస్తాను.

సుం:- ఆఁయ్ పెంకితనం కూడానా. కం ఆన్ రా,, ఇక నీ ఇష్టా గిష్టాలు సాగవు. రాకపోతే ఊరుకోను.

స:- ఊరుకోక ఏం జేస్తారు?

సుం:- ఏం జేస్తానా! వంట ఇంట్లోకి వచ్చి నీ బుగ్గలు సాగదీసి నెట్టుకొంటూ తీసుకొస్తాను. ఏమనుకొన్నావో!

స:- నెట్టావద్దు పెట్టావద్దు లెంకి వచ్చాను. ఎందుకో చెప్పండి?

సుం:- చెప్పను.

స:- చెప్పరూ? అదేం వికారం, రమ్మనంటిరిగా!

సుం:- రమ్మన్నాను వస్తావో రావోనని! రాకపోతే తెలిసేది. వచ్చావు. బ్రతికిపోయినావ్.

స:- అల్లాగేం?

సుం:- అల్లాగే. ఇకమీదట నేను చెప్పినట్లు నీవు వినాలె. నా యెడల నీవు అత్యంత విధేయతతో ప్రవర్తించాలె. కూర్చోమంటే కూర్చోవాలె నుంచోమంటే నించోవాలె. ఇక్కడనుంచి నేనూ ఈ ఇంటికి అధికారిని.

స:- కాదని ఎవరన్నారండీ—

సుం:- నేను చెప్పినట్లు వింటావా?

స:- ఆ

సుం:- అయితే కూర్చో.

స:- కూర్చున్నాను చెప్పండి

సుం:- అయితే నుంచో!

స:- ఎందుకూ ఈ కసరత్తు.

సుం:- ఎందుకంటే నీకు వినయ విధేయతలు నేర్పడానికి! సరే అయిందా? ఇప్పుడు నాకు తమలపాకులు చిలకలు చుట్టి ఇయ్యి. ఊఁ వెంటనే!

స:- బల్లమీద ఉన్నవి వేసుకొందురూ? నేను కొత్త నడుము వాలుస్తాను.

సుం:- వీల్లేదు.

స:- అమ్మాయి లేస్తుందండీ

సుం:- లేవనీ, పిడుగులు పడనీ. నీవు తమలపాకులకు సున్నం రాసి చిలకలు చుట్టి ఇవ్వాలిసిందే ఇప్పుడు!

స:- తల నొప్పిగా ఉందండీ

సుం:- ఉన్నాసరే. నేను చెప్పినట్లు నీవు చేయాలిసిందే.

స:- మంచివారు కదూ!

సుం:. ఆ ఆటలన్నీ సాగవు.

స:- మీరు ఎంతో ప్రేమగలవారంటూ....

సుం:- ఓహో ఈ లాలింపులు నా దగ్గర సాగవు. నేను చెప్పినట్లు చెయ్యాలిసిందే!

స:- ఎంత కఠినపు గుండె అండీ మీది?

సుం: అయితే అయింది. నేను చెప్పినట్లు వినాలె. అదేమిటి, పిద్దంటూవున్నా వినక గదిలోకిపోయి తలుపు వేసుకొంటున్నావేం! - Triangle Triangle అని! నీవు పత్తిఅయిసోసెలెస్ ట్రయాంగిలువు. తీయ్ తలుపు తీయ్.

స:- పిల్ల లేస్తుంది. కేకలు వేయకండి.

సుం:- కేకలు వేస్తాను. ఊరుకోను. Rectangle. Circle. పార్లలగ్రం. లేచిరా-యూ Bellam decorum Sanctum. పైథాగరస్ థీరం నీ చేత పల్లించక పోతే చూచుకో పెద్ద కేకలు వేస్తాను. Ignoramus, Magnus ignoramus – లేచిరా. నేను చెప్పినట్లు చేయకపోతే నేను ఊరుకోను. జాగ్రత్త నిద్ర పోదామనుకున్నావేం! నీ మాట సాగనియ్యను. నిన్ను నిద్రపోనీయను పద్యాలు పాడేస్తాను-జాగ్రత్త!

స:- పద్యాలు పాడి మీరు సాధించేదేమిటండీ?

సుం:- ఏమీ లేదంటావా?

స:- లేదనే అంటాను.

సుం:- ఉన్నది

స:- ఏమున్నది?

సుం:- ఏమున్నదా, అందులో నీ మాట సాగనీయకుండా చేయడమూ ఉన్నది నాకు జయం లభించడమూ ఉంది.

స:- నా మాట ఎల్లాగ సాగకుండా పోతుంది? నేను గది లోకి పోయి తలుపు వేసుకొని పడుకొంటే మీరు ఏం జేస్తారు అంట?

సుం:- నీవు గదిలోకి పోయి తలుపు వేసుకొని పడుకొని నిద్ర పోదామనుకొంటున్నావు. అదే కదూ నీ ఆలోచన. అదే కదూ నీ యిష్టం. ఆ యిష్టాన్ని సాగనీయను.

స:- ఎట్లా?

సుం:- నిద్రపోనీయను అరుస్తాను. పద్యాలు చదువుతాను. పాటలు పాడుతాను. నిద్ర పోనీయను, నిద్ర పోదామనుకొన్నావేం? (పెద్దగా) నిన్ను నిద్ర పోనీయను నీ యిష్టం సాగనీయను.

స:- సరే మరీ ఇల్లా అయిపోయినారేమండీ? అమ్మాయి లేవనే లేచింది (పిల్ల ఏడ్పు) చూశారా అమ్మాయి లేచిందమీ కేకలకు? గుక్కపట్టి ఏడుస్తున్నది కూడా. మా అమ్మ. ఏడ్వబోకమ్మా తల్లికదూ చచ్చి పోయినానే తల్లి ఊరుకోవుటే! సరే ఏడు! ఏం జేస్తాను ఏడు! నీ యిష్టం వచ్చినంత సేపు ఏడు. నేను వెళ్ళిపోతాను.

సుం:- ఓహో అమ్మాయిని ఏడ్వమంటావా? అది ఏడ్వటానికి వీల్లేదు. దాన్ని ఏడ్వనీయను-నీ యిష్టం సాగనీయను. దాన్ని ఏడవ నీయను. నేను ఎత్తుకొని ఆడిస్తాను. నీ మాట సాగుతుందనుకొన్నావుటే సత్యవతీ? అల్లా ఎప్పటికీ సాగనీయను.

మరో రోజు

సుం:- అయిందా అమ్మాయి పని! నాతో పోట్లాడితే నీ మాట సాగుతున్నదేమో చూశావా? ఇప్పటికైనా తెలుసుకో నిన్ను లొంగదీసి తీరుతాను. తెలిసిందా? నీవు పెళ్లానివి? నేను భర్తను, తెలిసిందా?

స:- (నవ్వి) నిజమేనండి. నేనూ లొంగిపోతున్నాను. లొంగక ఏమి చేసేది!

సుం:- ఇప్పుడు ఈ చెంబులూ అవీ దార్లో పెట్టావెందుకూ? నేను ఏం జెప్పాను? ఇటువంటి వస్తువులు హాల్లో పెద్దు వంట యింట్లో తగలెయ్యమని చెప్పలేమా?

స:- మరిచిపోయినాను. పనితొందరలో.........

సుం:- నాకు తెలుసునే. నాకు తెలుసు నీ ఎత్తు. ఆ చెంబులు కాళ్లకు తగిలి పడాలనికాదూ నీ పను కొన్నది. నేను పడడం నీకు యిష్టం. కాని నీ యిష్టం సాగనివ్వను. ఈ చెంబులన్నీ తీసికెళ్లి నేనే వంటింట్లో పడేస్తాను. అప్పుడు నీ యిష్టం సాగినట్లు అవుతుందా సాగనట్లు అవుతుందా! చెప్పు! అట్లా దార్లోకిరా. (తనలో) ఇల్లాగే దీని మాట కొంచెమైనా సాగనివ్వకూడదు.

## (4) పంతులు, కాంతం, సుందరం

కాం:- అదిగో సుందరం వస్తున్నాడు. సంతోషంగా ఉన్నాడు. ఏదో జరిగింది. రా నాయినా.

పం:- రావయ్యా సుందరం. రా. నేను చెప్పినట్లు చేస్తున్నావా?

సుం:- అక్షరాలా?

పం:- ఆవిడ మాట సాగకుండా చేస్తున్నావా.

సుం:- ఆవిడ మాట ఒక్క పిసరైనా సాగడం లేదు.

పం:- ఎల్లా సాధించావోయ్. ఆ పిల్ల ఒక తీరాన లొంగేది కాదే!

సుం:- ఏమీలేదు బాబాయ్. దానికో కొత్త ఏర్పాటు ఆలోచించాను. లొంగ తీయాలనుకొన్నాను లొంగ తీశాను.

పం:- లొంగిపోయిందా?

సుం:- చచ్చినట్లు! చప్పగా జావ అయిపోయింది!

పం:- ఏదీ ఎట్లా లొంగతీశావో ఒక్క విషయం చెప్పు.

సుం:- ఏముంది బాబాయి ఒక రోజున స్నానానికి నీళ్లు సిద్ధం చేయమన్నాను.

కాం:- చేసిందా?

సుం:- చేస్తుందీ-దాని సంగతి నీకు తెలియదూ! చేయలేదు.

పం:- అప్పుడు?

సుం:- అప్పుడు ఈమె స్నానానికి నీళ్లు తయారు చేయక పోవడంలోగల ఉద్దేశమేమిటీ అని ఆలోచించాను. భగవంతుడు ఇచ్చిన తెలివి కాస్త ఉంది కాబట్టి కారణం వెంటనే స్ఫురించింది. నేను స్నానం చెయ్యకుండా మురికిగా ఉంటే చూచి నవ్వుదామనేగా దాని ఉద్దేశం! నేనే వెళ్లి నీళ్లు తోడుకొని స్నానం చేశాను దాంతో దాని రోగం కుదిరింది.

పం:- రోగం కుదరడం ఏముంది?

సుం:- కుదరకేముంది బాబాయ్ నేను స్నానం చేయకుండా ఉంటే నవ్వుదామనుకొందిగా! అది సాగకుండా చేశాను ఇంకేముంది! నోరుమూసుకొని ఊరుకొంది.

కాం:- భలే, భలే? ఆ పిల్ల మాట సాగలేదుగా నిజానికి! నిజమేనండి. సుందరం వేసిన ప్లాను బాగానే ఉంది!

సుం:- అదే బాబాయి సూత్రం. ఈ సూత్రం కనపెట్టిన తరవాత దాని కోరిక ఒక్కటీ నెరవేరడం లేదు. దాని మాట సాగడం లేదు.

పం:- ఇంకొక విషయం చెప్పు.

సుం:- నిన్న కాఫీ చేయవే సత్యవతీ అన్నాను. అది ఒక ఎత్తుఎత్తి. "ఏమండీ, ఇప్పుడు నేను లేవలేను. దగ్గరిలో ఉన్న కాఫీ హోటలుకు వెళ్లి, ఆ కాస్త కాఫీ తాగిపద్దురు అన్నది." అంటే, నేను ఊరుకొన్నానా ? దాని మాట సాగనీయకుండా చేశాను.

పం:- ఏట్లా చేశావోయ్ ?

సుం:- ఆ విషయంలో దాని మాట ఒక్క పిసరైనా సాగకుండా చేశాను బాబాయ్. ఏం చేశానను కొన్నావు బాబాయ్ దగ్గర హోటలుకు వెళ్లమని గదూ అది అన్నది. దాని రోగం కుదిరేటట్లు దూరపు హోటలు కెళ్లాను !

పం:- అక్కడ కాఫీ త్రాగావన్నమాట ?

సుం:- ఎందుకు త్రాగుతాను బాబాయ్—తాగితే అది అన్నట్లు నేను చేసిన వాణ్ణి కానూ : అందుకని కాఫీ త్రాగ కుండా వచ్చేశాను. దానితో—దాని మాటలు ఒక్క ముక్క అయినా, జరగకుండా పోయింది — ఈ విధంగా సత్యవతి మాట ఏ విషయము లోనూ సాగకుండా పోతున్నది.

కాం:- బాగుందిరా నాయనా బాగుందిరా సుందరం !

సుం:- అన్నీ ఇంతే బాబాయి. చీర కొనుక్కుంటాను పది రూపాయలు ఇయ్యమంటుందా చస్తే ఇయ్యను. ఇస్తే దాని మాట సాగినట్లేగా. అందుకని ఇయ్యను. పది రూపాయిలు గదూ సత్యవు అడిగింది : నేను ఏం జేస్తానంటే, పది ఇయ్యక పదిహేనో, ఇరవైయో దాని ముఖాన పడేస్తాను. ఇస్తే చచ్చినట్లు ఆ రూపాయలు పెట్టి చీరకొనుక్కుంటుంది.

కాం:- అంతేలే నాయినా పది అడిగింది. నీవు అది అడిగింది ఇవ్వలేదుగా. అదే కావలసింది మనకు.

పం:- అవును లేరా సుందరం దాని ఇష్ట ప్రకారం జరగలేదు—ఎక్కువో తక్కువో ఇయ్యడం అది వేరే సంగతి మొత్తం మీద బాగాలొంగ తీశావురా ! నీ కెట్లుతెలిసిందిరా. ఈ కిటుకు, అంటే లొంగ తీసే కిటుకూ ?

సుం:- నీ కథలన్నీ క్షుణ్ణంగా చదివాను. చదివితే, భార్యను లొంగ తీసే ఈ ఉపాయం నాకు తోచింది బాబాయ్.

పం:- న్యూటన్, ఆర్కిమెడిస్ మొదలైన వాళ్లు కొత్త సూత్రాలు కనిపెట్టి నట్టు నివూ భార్యను లొంగతీయడానికి ఒక సూత్రం కనిపెట్టావన్నమాట భేష్, భేష్.



# విద్యుత్ప్రసరన్మార్గాలలో మరమ్మతులు

విద్యుచ్ఛక్తి సప్లయి ఆపకుండానే విద్యున్మార్గాలకు మరమ్మతులు నిర్వహించే హాట్‌లైన్ మరమ్మతుల పద్ధతికి 1960 మార్చి 12వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ పబ్లిక్ వర్క్సు శాఖామాత్యులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు గారు హైదరాబాద్ నగరంలో ప్రారంభోత్సవం చేశారు. "విద్యుచ్ఛక్తిని ఆపివేసి, మరమ్మతు చేసే పద్ధతిలో ఒక ప్రమాదం వుంది. ఏమంటే, ఎవరైనా తెలియక స్విచ్ వేశారంటే, మరమ్మతు చేసే పనివాండ్లకు షాక్ తగలటం జరుగుతుంది. యిప్పటి కొత్త పద్ధతిలో ఆ ప్రమాదం లేదు" అని యీ సందర్భంలో ప్రసంగిస్తూ అమెరికన్ యిన్స్టక్టర్ శ్రీ స్పార్క్సు అన్నారు.

విద్యుచ్ఛక్తి ప్రసారమవుతున్న తీగెలకోసం ఆపరేటింగ్ రాడ్సు ప్రవేశపెట్టిన నాటి నుండి యింజనీర్ల ఆలోచనా పథంలో ఒక ముఖ్య విషయం మెదుల్తూనే ఉంది. అదేమంటే. యిన్సులేటర్లకు బదులుగా. విద్యుత్ప్రసారం వున్న తీగెలమీద పని చేయటానికి హాట్‌లైన్ పరికరాలను కనిపెట్టాలనే ఆకాంక్ష. ఈ హాట్‌లైన్ పరికరాలు యిటీవలనే కనుగొనబడిన వని చెప్పకుంటున్నప్పటికీ, 1939 ప్రాంతాలకే వీటికి రూపురేఖలు దిద్దటం జరిగింది. కాని అప్పట్లో అవి అంతగా వృద్ధిపొంద లేదు. వాటిని చక్కగా తీర్చిదిద్దే కార్యక్రమం పూర్తి కాలేదు.

## వీటివల్ల ఉపయోగాలు

విద్యుచ్ఛక్తి వినియోగం ఎక్కువ అవుతున్న కొలది విద్యుచ్ఛక్తి అవసరమైన కార్యక్రమాలు ఎక్కువవుతాయి. సప్లయి చేయవలసిన వారి బాధ్యత కూడా తదనుగుణంగా ఎక్కువవుతుంది. మధ్యలో సప్లయి ఆగిపోతే అది వినియోగదారుడికీ, సప్లయి చేసే వారికీ కూడా నష్టం, ఖర్చుతో కూడిన పని అవుతుంది. విద్యుచ్ఛక్తికి డిమాండు ఎక్కువై తదనుగుణంగా సప్లయి కూడా ఎక్కువ చేయవలసిన పరిస్థితి వున్నందున లోగడ విద్యున్మార్గాలు జంట సర్క్యూట్లలో నిర్మింపబడుతుండేవి. దీనికి చాలా పెట్టుబడి ఖర్చు అవుతుండేది. హాట్‌లైన్ పరికరాల వినియోగం వల్ల యిక మీద జంట సర్క్యూట్ల నిర్మాణంతో పని లేదు. తీగలలో నుండి విద్యుత్ప్రసారం జరుగుతూ వున్నా కూడా వాటికి మరమ్మతులు చేసుకునే సౌలభ్యం ఏర్పడింది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో యీ హాట్‌లైన్ పరికరాల పద్ధతి బహుళంగా అమలులో వుంది. పశ్చిమకోస్తాలో 220 కె. వి. వరకు విద్యున్మార్గాలకు 1940 నుండి యీ పద్ధతిలోనే మరమ్మతులు జరుగుతున్నాయి 1948లో హాట్‌లైన్ పరికరాల నిపుణులు ఒ. జి. ఆండర్సన్ అండ్ యం. ఆర్. పార్కిన్ (ఎ. బి. ఛాన్స్ కంపెనీ) హూవర్ డాం. లాస్ ఏంజల్స్ మధ్య 287 కె. వి. విద్యున్మార్గాల మీద యిన్సులేటర్లను మార్చటానికి అనువైన హాట్‌లైన్ పరికరాలను ప్రత్యేకంగా రూపొందించారు. ప్రస్తుతం 345కె వి. మార్గాల మీద కూడా పని చేయటానికి ఉపయోగపడే హాట్‌లైన్ పరికరాలు తయారవుతున్నాయి.

## హాట్‌లైన్ పరికరాలు

హాట్‌లైన్ పరికరాలలో వివిధ భాగాలు వుంటాయి.

(1) స్థంభాల నుండి కండక్టర్లను ఎత్తటానికి గాను, అవసరమైన వైర్ టాంగులు, యిన్సులేటెడ్ ఆగ్జిలరీ ఆరమ్సు.

(2) విద్యుత్ప్రసారం వున్న తీగెల నుండి స్ట్రెయిన్ సెట్లు తొలగించటానికిగాను డెడ్ ఎండ్ పరికరాల సెట్లు.

(3) సస్పెన్షన్ యిన్సులేటర్లను తొలగించటానికై సస్పెన్షన్ లింక్ కడ్డీలు.

(4) విద్యుత్ప్రసారం జరుగుతున్న తీగలకు స్థంభాలు వేయటానికై సేఫ్టీ పోల్ గార్డ్.

(5) విద్యుత్ప్రసారమున్న తీగల స్ట్రైయిన్ సెట్లు తొలగించటానికి రెండు స్థంభాల స్ట్రైయిన్ క్యారియర్.

'సిట్కా-స్ప్రూస్' అనే చెక్కతో చేయబడి, ప్లాస్టింగ్ కోటింగ్ అమర్చబడి హాట్‌లైన్ పరికరాలు తయారు చేస్తారు. 'హాట్‌స్టిక్స్' కు అడుగు 1కి 75,000 వోల్టుల విద్యుత్ప్రసారంతో 5 నిమిషాల పాటు పరీక్ష జరుపబడుతుంది. హాట్‌లైన్ మరమ్మతు పరికరాల నాణ్యతకు సంబంధించిన విశేషాలు:

(ఎ) 'హాట్‌స్టిక్స్' కు మేలురకం యిన్సులేటింగ్ లక్షణం వుండాలి.

(బి) సులభంగా ఉపయోగించే వీలుండాలి.

(సి) వివిధ తరహాలకు చెందిన పనిముట్లకు పనికి రావాలి,

ఈ పరికరాలలోని లోహ భాగం తేలికగా వుంటూ, గట్టిగా వుండాలని వేడిచేయబడిన అల్యూమినం మిశ్రమంతో వీటిని తయారుచేస్తారు. అందువల్ల యీ పరికరాలను సులువుగా చేతులతో ఉపయోగించుకోవచ్చు.

## జాగ్రత్తలు

హాట్‌లైన్ మరమ్మతు పరికరాల విషయంలో తీసుకోవలసిన ముఖ్యమైన జాగ్రత ఏమంటే వాటిని పొడిగా వుంచాలి. తడి తగలనీయకూడదు. వాటిని నేలమీద పడవేసి వుంచకూడదు. సాధారణంగా వీటిని ప్రత్యేకంగా తయారు చేయబడిన ట్రైలర్‌లో వుంచుతారు. ఒక హీటర్ ద్వారా యీ ట్రైలర్ ఎప్పుడూ వేడిగా వుంచబడుతుంది. ఈ విధంగా జాగ్రత్తగా వుంచుకుంటే, పరికరాలు చాలాకాలం మనటమే కాకుండా, ఉపయోగించినప్పుడు ఫలితాలు వెంటనే కలుగుతాయనే దృఢ విశ్వాసంకూడా పని వాండ్లలో ఏర్పడుతుంది.

## హాట్‌లైన్ మరమ్మతు నిపుణుల తయారీ

శిక్షణ పాఠశాల ప్రధానోద్దేశం, హాట్‌లైన్ మరమ్మతుల పనిలో అభిలాష వుందన్న వ్యక్తులను ఎన్నుకొని వారికి తగిన శిక్షణ యివ్వడమే. వీరి సంక్షేమ భద్రతల విషయంలో పాటించవలసిన ముఖ్య విషయాలు:

(ఎ) మంచి పనితనం వుండాలి.

(బి) పని వాండ్లలో సామరస్యం, సమన్వయభావం వుండాలి.

(సి) ప్రశాంతంగా పని చేసుకుపోయే స్వభావం వుండాలి,

విదేశాలలో ప్రభుత్వం లేక ప్రైవేటు ఏజన్సీలు నిర్వహించే కంపెనీలు పాఠశాలల్లో పని వాండ్లకు విస్తృతమైన శిక్షణ లభించే ఏర్పాట్లు చేస్తున్నాయి. పాఠశాలల్లో లైన్ మెన్లకు అన్నిరకాల విద్యున్మార్గాలకు సంబంధించిన హాట్‌లైన్ మరమ్మతుల విశేషాలు బోధించబడుతున్నవి. భారతదేశంలో యిందుకోసం రెండే పాఠశాలలు—ఒకటి పంజాబు రాష్ట్రంలోని గంగ్వాల్‌లోనూ, రెండవది బెంగుళూరులోనూ వున్నాయి.

అమెరికా సాంకేతిక సహకార కార్యక్రమం క్రింద భారతదేశానికి ఒక హాట్‌లైన్ పరికరాల సెట్టు లభించింది. ఢిల్లీలోని కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమిషన్ వారి ద్వారా మనకు లభించిందే.

——:*:——

పడమటింటమ్మ పట్టిడెట్టుకొంటే ఉత్తరపింటమ్మ ఉరెట్టుకుంది.

*    *    *

లంక మేత గోదావరీత

— తెలుగు సామెతలు.

# ఆ దినాలలో - ఒక సాయంవేళ - తుంగభద్రాతీరాన

— బొడ్డపాటి కుటుంబరాయశర్మ.

ప్రది తారణ శరత్తు. నవరాత్రోత్సవ దినాలు. నాఁడు విజయదశమి. శుక్రవారము.* విరిసెన పూల తెలుఁ నైనది వెలసంజ. చీకటులు ముసురుచున్నవి. అప్పుడు వీరచందన మలందిన రాయల కరీంద్రఘటల యందమును పుణికిపుచ్చుకొన్నవి పడమటి దిక్కు. క్రమక్రమముగ వెన్నెలలు కూడ పదుపులు కట్టి తలమున్కలై పొంగులెత్తి కరళ్ళు కరళ్ళుగ ప్రవహించుచు తుంగభద్రా జలములలో తళత్తళలొల్కుచున్నవి. ఆ తళతళ సాహితీ సమరాంగణ చక్రవర్తి కత్తి వాదరవలె భారతీయ ధర్మ విజ్ఞాన శౌర్య ప్రతాపములవ శ్రీరామరక్షగా భాసించుచున్నదా వేళ. పంపా విరూపాక్ష శివుని శిరశ్చంద్ర కాంతులు దశమి నాటి యా చంద్రకాంతికి స్వాగతము పల్కుచున్నట్లుగా నాయాలయ విమానము నందును ధ్వజస్తంభము నందును గల బంగరు చిరుగంటలు గలగల మన్నవి. శ్రీ స్వామి వారికి పారువేట మహోత్సవము ముగిసెనేమో! దేవదాసి కుంభ హారతి యెత్తి లాస్య భంగిమలు చూపుచున్నట్లున్నది. దూరదూరమున వెన్నెలలో నాహారతి కాంతి, వెన్నెల యచ్చరలు తమ ముఖముల కలఁదు కొన్న కాశ్మీరద్రవము లాగైనది.

ముప్పదియైదు గజముల వెడల్పున్న విజయనగర రాజవీధిలో ప్రతి సాయంకాలమును జరుగు సంత నుండి ఇసుక వేసినను రాలని ప్రజలు రాత్రికి సాగు నూరేగింపులు చూడ సిద్ధమగుటకై వేగముగ గృహోన్ముఖులగుచున్నారు.

గజశాలలు, కమల భవనము, దండనాయకుల మందిరములు దాటి "భువన విజయ" సభా భవనము దెసగా నప్పుడే యిర్వురు యువకులు వచ్చుచుండిరి. విశ్రాంతి వేళలఁ దాల్చు నాదోవతి బంగారు చుంగులను, ఆ అంగీని బట్టి పోల్చుకొనఁగా నందొకరు మాచయ్యగారి మల్లనకవి కాక తప్పదు. ఆ తీఁవిని బట్టి రెండవ వారు గోప ప్రధాని యని వేఱుగ చెప్పనక్కరలేదు.

"కర్ణాటక్షితిపాల మౌక్తిక సభా
గారాంతరా కల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్
సాహిత్య" ప్రసంగములు నినదించి,

తీగెలు పారుటచే పులకిత మధుర వాయు మార్గములు గల ఆ సభా భవనము బాగున్నదా? లేక ఆ కవిరాజును మఱపించునట కుపశ్రుతి గాగల మన కవితా పితామహుని "పూఁత మెఱుంగులున్ బసరు పూపబెడంగులు" చూపుచున్న యీ భువన విజయము బాగున్నదా? అని నాఁడు మల్లన కవి.

గోపన గోప్యముగ మెత్తని చూపు చూచెను. కాని యా మందస్మిత రోచులు అధరముపై వ్యాపింపక తీరలేదు, ఆపినను ఆగక. "భవనములకును, దానిలో విన్యసింపఁబడిన శిల్పమునకును కవిత్వముతో సంబంధము కల్పించుచున్నారా?" అన్నట్లున్నవి, యాతని చూపును చిఱునవ్వును గూడ. గోపన మెల్లని చూపెంత మెత్తనిదైనను మల్లన హృదయములలో గాటముగ నాటుకొన్నది.

మలుపులు తిరిగి, తెల్ల ద్రాక్ష తోటలు, నగర ద్వారములు, కోనేరులు, దాఁటి వారింకను నడచుచున్నారు. అంతలో రత్నాల యంగడి తగిలినది. దాని మీఁదుగా నగరోపవన సీమల నుండి తెల్ల ద్రాక్షల తోటలు దాటి తుంగభద్ర యొడ్డునకు జేరి యా తెల్లని యిసుక తిన్నెలపై యా యిర్వురు నాసీనులైరి.

* తారణ సంవత్సరాశ్వయుజ దశమీ శుక్రవారము=7-10-1524.

''ఔనండీ! యీ మన విఠలస్వామివారి యాలయాంతర్భాగమునఁ గల యనల్ప శిల్ప సంపద ననుదినము చూచుచుంటిమి కదా! ఏమనిపించుచున్నది? ''తావుల్ క్రేవల నల్లి-బిల్లి గొను కాంతారమ్ము నందు''-అను పద్య మా శిల్పి హృత్కుహరములో నుండి కొనలు సాగి తీఁగెలు ప్రాకి ధ్వని ప్రపంచమంతటను విరియ సంచరింపగా, శిలలు తమంతట తాము ముసురెత్తుకొని వచ్చినట్లు వచ్చి యా గర్భాలయ రూపమునఁ బొందుపడినవేమో యనిపింపదా? యని ముగించినాడు మల్లనకవి.

''అసలే యిది పర్వదినము. అందులో నికనడుగవలెనా? అదిగో! తొగరుపోచ వంటి గార్లపాటి వారి గడుసు పత్ర వాడును నిటే వచ్చుచున్నాడు. ఇఁక, మీ భావనా ఖేలనలను నేను నీమలు నిర్ణయింపలేను.'' అనెను గోవన మంత్రి.

''ఎవరు? ఓహో! తెనాలి రామకృష్ణుఁడా?'' అని మల్లన గారను చుండగనే విఠలరాయ దేవాలయములోని జాతి తేరు నుండి లేచి, యేమియుఁ దోఁచక వచ్చి వేయుచున్న వాని వలె, నటునిటు చూచుచు, ''శ్రీ రంగేశ్వర నాభిపంకజ రజశ్శ్రీ కంటెఁ, జోశేంద్రతన్వీ రాజత్కుచ పాళి కుంజ రుల కంటెన్''—అని కూనరాగములు తీసికొనుచు వచ్చి హఠాత్తుగ వినయము కలితాంజలియై, యా యిద్వరి దీవనలు బడసి వారి దగ్గఱనే రామకృష్ణుడు కూడా కూర్చుచుండెను.

మఱల మల్లన యందు కొన్నాఁడు. అయితే గోప మంత్రిగారూ! శిల్పము వలన గూడ నానందం కల్గునని మీరంగీకరింపరా?'' అనుచు.

''మహానుభావా! కాదనను గాని, యిన్ని కళల వలనను సాధ్యమగు నానందమునొక్కటియే యనవలెనా? భిన్నమన వలెనా? అనునదియే ప్రశ్న''-అనెను గోవ ప్రధాని.

''రసానుభూతిలో గూడ భిన్నత్వమంగీకరించినచో నిఁక నా యనుభవము లౌకికానుభూతియే యగును గాని, యలౌకికానుభూతి యెట్లగును?'' అని మల్లన ప్రశ్నించినాఁడు.

రామకృష్ణుఁడిట్టే విషయమును గ్రహించి తానును గల్పించుకొనెను. ''తమరు చిత్తగించినచో విన్నవించెదను. రసానుభూతికిని కళలకు నేమాత్రము గాని సాధ్యసాధన భావము లేదు. వ్యంగ్య వ్యంజక భావమే కలదు. అందనను, వాని వాని రస వ్యంజకతా బలమును బట్టి వాని వాని యుత్తమ మధ్యమాధమత్వములు నిర్ణీతములగుచున్నవి. చూడండీ! మన హజారు కోదండ రామస్వామివారి కోవెల యున్నది. దాని ముఖ మంటపములోని యుక్కు వంటి శిలాస్తంభములు నేరేడు పండ్లవలె నిగనిగలాడుచున్నవి. ఆ శిల్పి బ్రహ్మ యొక్క ఉలిపల్కరింపులకు తలమున్కలై ఉక్కు వంటి యా ఱాలు మైనపు ముద్ద వలె నెట్లు స్నిగ్ధత జూపినదో భావించితిరా? అంత తీర్పుగ చెక్కుటలో నా శిల్పికి గురుత్వము నేర్పినది మన నంది తిమ్మనార్యుని మధుర సరస్వతీ స్నిగ్ధత కాదనఁగలమా?''

ఈ లోఁగా, తుంగభద్ర సంపానదమగుట, విరూపాక్ష స్వామి పంపాపతి యగుట, యీ పంపాజలములా పంపాపతి దేవళములోనికిఁ జొరవచేసి కొనుట మున్నగు సంగతుల నన్నిటిని గూర్చి భావి యుగముల వారి యుద్దేశము లెట్లుండునో యన్న విషయములను ఊహించుకొనుచు నపర శివుని వలె తిమ్మనగారును, బృహస్పతి వలె పెద్దనగారును మూర్తీభవించిన భక్తి భావమో యన్నట్లు ధూర్జటి కవీంద్రుడును నచ్చటికే వచ్చిరి.

తామింత వఱకు కూర్చున్న శ్రీకృష్ణ దేవాలయమునుండి బయలుదేరి. రాజవీధిలోని మహా నందిని సందర్శించుకొని, చక్ర తీర్థము మీదుగా పెక్కు మంది సాహితీ బంధువులు గూడ తిరిగి తిరిగి పంపా తీరమునకే చేరుకొనిరి. అందులో బొడ్డుచెర్ల చిన తిమ్మన కవి చింతలపూడి యెల్లయ కవి, భానుదత్తుడు. ఈశ్వరదీక్షితుఁడు కర్ణాట భారత కర్త తిమ్మణార్య కవి, కుమార సరస్వతీ తత్త్వప్రకాది తమిళకవులు, లక్ష్మీనారాయణ కృష్ణ పండిత ప్రభృతి సంగీత విద్వాంసులు నుండిరి.

ఇంతలో తులాభార స్తంభ తోరణము మీద పట్టపుటేన్గు నుండి యవతరించి కృష్ణరాయ దేవేంద్రులే యచ్చట దర్శనమిచ్చిరి. ఎల్లరులేచి నమస్కరింపగా హస్త సంజ్ఞాదరముతో వారిని రాయలు కూర్చుండ నియమించెను.

''విజయనగర ప్రజా సందోహ నందన వనమును దాఁటి చైత్రోత్సవముల తర్వాత నిన్నాళ్ళకు మఱల నదీతీర వాహ్యాళికై స్వామి వారు మలయ కూటము నుండి విజయము చేయుట యేమో యిది!'' అనిరి పెద్దన గారు.

అట్లు కాదు; 'నభస్స్పృక్శిఖరాళీ దీప కళికా శృంగంబు'- శ్రీరంగము నుండియే—యని ముకుళీకృత హస్తులైనారు తిమ్మనగారు.

రాయల ముఖమునఁ జిరునవ్వు చిందినవి. క్షణ మూర కుండెను. "నాగులాపురము నుంచి బయలుదేరి యుత్తర ముగ నున్న నగర ప్రాకారము నొకసారి చూచుకొని తులా భార స్తంభ తోరణము నొద్ద నుండి మిమ్ము గుర్తించి విశ్రాంతికై యిటు వచ్చితిని. నారాక మీ కావ్య చింతలకు భంగము రానీయదుకదా?" అనుచునే యెల్లరితో బాటు తాను నా తిన్నెపై రాయలాసీనుఁడు కాఁగా, నెవరికి వారు వినయముతో నించించుక కుంచించుకొని కూర్చుండిరి.

'ఏదో కావ్య గోష్ఠి జరుగుచున్నది గదా! సాగనిండు, మేమును నెందు' మనిరి పెద్దన్నగారు పిన్నలవైపు మొగమై.

'ఏమియు లేదు; స్థాపత్య శిల్పములో కవితా శిల్పమును నిరూపించు చున్నాడు మన రామకృష్ణుడు' అనెను మల్లన కవి, తాను తప్పుకొనుచు.

'బాగున్నది; ఎట్లు?' అని కవితా పితామహుఁ డుత్సాహముతో చూసెను. దానితో రామకృష్ణు డిట్లు ప్రారంభించినాడు. బాసిక పట్టు వేసి కూర్చుండి:— "మన మహోన్నత మతంగ పర్వతి మెక్కి- దాని నుండి సాయం సమయ రమణీయ దృశ్యములను బరిశీలింపనిదే, 'ఏణీబాల విలోల నేత్ర తనుగొంచే వీరు విద్యాధరుల్' అని యనగలడా? యెంత దిగి వచ్చిన మహా కవి గాని."

'నిజమే'! అనినాడు రసమంజరీ కర్త భానుదత్తుఁడందుకొని. మన విరూపాక్షాలయ ద్వార ముఖ మంటప స్తంభాల నల్లబాతి మీఁద నా శిల్పి చూపిన నాణ్యపు నకిషీ పనిని గూర్చి పదింబదిగా భావించినపుడు నాకు నట్లే యనిపించును. 'కోపన పదహతి కుహనా గోపాలుడు కాంచి' యను పద్యము నందలి జిగిబిగువులను మననము చేసికొనుచు; పాషాణములపై నా నైపుణ్యమును విన్యసించినాఁడేమో, యా శిల్పి యని."

'తప్పే మున్నది? శిల్పం కర్మ కలాదిక' మ్మని గదా! యిందుకు, కొందఱాధ్యాత్మిక శిల్పులుగూడ లోక కళ్యాణార్థము లౌకిక శిల్పులుగా నగపడుదురు! అనె నీశ్వర దీక్షితుడు.

'మన కోపండ రామాలయపు ప్రహరీ రెండు వైపులను పెద్దపెద్ద శిలా శకలములతో పెచ్చుతగ్గులు లేనట్లు తాపఁబడినది. ఆ తాపుట 'అట్లయగు నాధుల్ నేరముల్ సేయ' నని నట్లద్భుతముగ లేదా? అనిరి యింత వఱకూర కొనిన ధూర్జటి గారు' కనుల వెంట ప్రాణములు దూఁకి వచ్చి తిమ్మన గారిని కౌఁగలించుకొనుచుండగా.

'ఐతే, మన విజయనగర శిల్పి 'బాల్ గరగించు విమల గాంధర్వ'మ్ము నస్తిగతము చేసికొనకయే యీ ముఖమంటప స్తంభాలచే. 'తరుణాంగుళీ ధూ............త తంత్రీస్వనా" లచే నమరగానము చేయించుచుండెనందురా? అని చమత్కరించిరి తిమ్మనగారు, "ధూ"............ అను నక్షరమును తంత్రిపై నూపినట్లు ఊపుచు,

ఇంతలో కుమార సరస్వతి యిట్లారంభించెను. "అయ్యా! విద్వాంసులొక సందేహమును తీర్పవలెను. తిమ్మన పెద్దనార్యుల పేర్లిట్లు దేశమంతటను తావులు చిమ్ముచున్నవి గదా! సత్యాదేవి శ్రీకృష్ణుని తన వామపాద తాడనముచే మన్నించుట నెట్లు సమర్థింతుమండీ, యుదాహరణము లున్నంత మాత్రమున?

ఆంధ్ర కవితా పితామహులు, మంత్ర స్వరములో నందుకొనిరి 'అయ్యా! లోకమును కావ్యమును ఒక కంటితో చూడరాదు. లోకములో కలహము దాంపత్య విఘటకము, కావ్యమునందైనచో నా కలహమే సంఘటకము, శృంగారోద్దీపకమును. కావున విషయములో, లోకము వేఱు; కావ్యము వేఱు. అందువలననే, లౌకికమైన యనౌచిత్యమే కించిత్తైన నున్నప్పటికిఁ గూడ నది కావ్యములో రసపుష్టి నిచ్చుచో, దోషము కాఁజాలదు.

ఇట్లు ముగించు నరికి, 'అగుచో వరూధిని యమ్మగారి యేకత్రైవాను రాగము రసాభాసము కూడ కాదందురా?" అనెను, తత్త్వప్రకాశుఁడు ఉండబట్ట లేక.

అప్పుడు చివరకు రాయలు కల్పించుకొనిరి. "రసాభాసము కూడ మహాకవి చేతిలో రసమగును. తిక్కనార్యుని వలె పెద్దనగారు దోషములను గూడ గుణముగ భాసింపఁ జేసి రస ప్రతీతిఁ గల్గించిరి. అది యనుభవైక వేద్యము. ఇంతకు. యోజింపఁగా లోకముననేదిగాని గుణము, దోషము నని కేవలముగ నుండదు ప్రసంగము వచ్చినది కనుక చెప్పక తప్పదు. భుజములకు నమ్రత గుణము స్తనములకు నమ్రత దోషము స్తబ్ధత మనకు దోషము; వానికి గుణము.

అనలోఁ గుణము స్వరూప ఖ్యాతికొఱకై యింకొక గుణము నపేక్షించును. ఎంత గుణవంతునకైనను గుణగ్రహణ పారీణుఁ డొకఁడు లభించినపుడే ప్రశస్తి. అంగనల పొడి తలవెంట్రుకలకు కృష్ణాగురుధూపమంటదు. అట్లే సాహిత్య విద్యా పరిశ్రమము వలని యార్ద్రిత లేనివారికి మహాకవుల కవితా రీతులు గోచరింపవు. ధూర్జటిగారు మహాశివభక్తులు. ఐనను మనయందు వారు చూపు సాత్త్వికతా సానుభూతుల నూహింపఁగలమా?

ఇట్లు రాయలు చేసిన సూచ్యమునకు ధూర్జటికవి వినమ్రుఁడై నమస్కరించుచు, 'ప్రభూ! నా భక్తిమార్గమును మీరే యభినందింపవలెను' అనును. 'ఔనౌ' నని యామోదముద్ర వేయును పెద్దనకవి 'వారి భక్తి ప్రపత్తులు మనకబ్బునా యేనాఁటికైన? 'కాయల్ గాచె, వధూనఖాగ్రములచే కాయంబు, వక్షోజముల్ రాయన్ రాపడె ఱొమ్ము; ఈ కాయంబు నే నొల్ల'-నని యస్మదాదులనఁగలరా?' అని మెప్పుఁ జూపును ప్రభువు.

ధూర్జటి 'ధన్యోస్మి' యనుచుండగనే 'చిన్నమ దేవీ జీవిత నాయక! కవితా ప్రావీణ్యఫణీశ! కృష్ణరాయమహీశా!' యను పద్యమును చక్రవాకరాగమునకు ప్రస్తరించిన వీణాస్వనము పడతుల జడవలె సన్నగిలుచు, మలయకూటము నుండి వినవచ్చును. దీనితో తుంగభద్రా తరంగములు పొంగి పారిజాత పరిమళ మొలయు శీతలమంద వాయువులను రేపినవి.

'ప్రొద్దుపోయినది'-యనుచు. తమకై సంసిద్ధముగ నున్న జలతారు కొండలవంటి సముచితాశ్వముల నందఱు నధిరోహింతురు. రాయల కోసము తేఁబడ్డ పట్టపు టేనుఁగు తన వెనక కాళ్ళపై కూర్చున్నది.

మొగలు సామ్రాజ్యమునకు చెలియలికట్ట విజయనగరమే యనియు. నా విజయనగర సారస్వతము ప్రజా జీవన సౌష్ఠవ నిర్మాణహేతువుగాఁ బరికల్పితమనియు, విభవములో మూరు రాయర గండఁడైన రాయలు సకల కలాభోజుఁడగుట చేత నాఁటి గ్రామ జీవన రక్షణ మహా సంస్థ దేవాలయమే యనియుఁ ద్రిభంగుల ఘోషించుచున్నట్లుగా విఠల విరూపాక్ష కోదండ రామ దేవాలయములలోని మూఁడు గంటలు నొకేమారు ఖంగుమని మ్రోగినవి,



స్వభావము చేత నెంత మంచి వాఁడయినను దుర్జన సాంగత్యములోఁ బడిపోయి దుర్వ్యసనములలోఁ దగులుకొన్న పక్షమునఁ దన వివేకమును గోలుపోయి తాను పూనిన వ్యాపారమే మంచిదనుకొనునంతటి దుస్థితిలోనికి వచ్చి మానహీనుఁడయిన దుష్టుఁడగును.

— కందుకూరి వీరేశలింగం.

# నీరథము

"కులపతి"

స్వామి! నీరథమ్మిట్టి విశ్వాసహీను
గృహాము ముంగిట నేల యాగినదో కాని
ఈ యెడద పూర్వజన్మ సంస్కృతుల జలలు
పొంగినవి తేరుసకు వారు పోసినట్లు

కాంతయును కాంచనము రెండు కండ్లు నాకు
అల కృతఘ్నత జన్మతోనైన గుణము
పరమ లౌకిక మూఢ విశ్వాసి నేల
నను గురుతుపట్టి యరుదెంచినావు స్వామి!

ఏల వచ్చిన నే మాయె? నీల గగన
పథపు దెల్లను కాంతి ప్రభావితమయి
దర్పణ స్వచ్ఛమై వసుంధర వెలింగి
నిన్నుగా తన్నుదా జూచు నీతి యయ్యొ.

ఊహ తెలిసిన యప్పటి నుండి పరమ
శత్రు భావమ్ము ననె పూజ సల్పినానొ!
కవితలో నిన్నుగాంచి మేల్కాంచినానొ,
పంచి నానొ వెల్గులు తెల్గు పంచలందు!

ఏది పట్టించుకోని నా కీవు వచ్చి,
రాకయును నొక్కడే, విచిత్రంబు కలుగు
మాట తప్పు, లోకము నమ్మ మంచికంటె
నధికమైనది యొకడుండె ననుటతప్పు!

స్వామినీరథ మ్మిట్టి విశ్వాసహీను
గృహాము ముంగిట నేల యాగినదో కాని!

# సుఖీభవ

(సంగీత రూపకము)

— వింజమూరి శివరామరావు.

(నేపధ్యంలో సంగీత వాద్యాలు. చక్కగా అలంకరించుకున్న యువతీ యువకులు నృత్యం చేస్తూ పుష్పాంజలితో ప్రవేశిస్తారు.)

**యువతీ యువకులు** భారతమాతకు వందనమూ
భారత జాతికి అభివందనమూ....
పాడియు పంటయు పెంపునందగా
వాడవాడలా పేరు నందెనూ....
దాన పరులు ధర్మాత్ములు వీరులు
మానిత శీలము నాశ్రయించిరీ....
చీకటి చాయలు దూరమగూ
ఆకలి మాదరి జేరదయా....
ఏరులు తెచ్చిన జలాలతో
పైరుల పచ్చని పొలాలతో
కన్నుల పండుగ జేయుగదా
వెన్నెల పిండులు కాయునదా....

(యువకులు పుష్పాలు చల్లి నిష్క్రమిస్తారు. దర్జాగా దుస్తులు వేసుకుని కామందులు కొందరు వస్తారు)

కామందు:- శ్రీమంతులం మేము సామంతులం
మేమంతరం భూమి కామందులం....
భాగ్యాలతోన సౌభాగ్యంతోడా
ఏవేళ హాయిగా జీవింతుమూ
ధాన్యాలు మా కిచ్చు ధాన్యాల కొల్లలై
ఈ లోకమందు మా కేలోటు లేదూ....
మా చేల నే కొంచెమో చాలు పంటా
కాయకష్టం మేము చేయంగ లేమూ....

(కామందులొక ప్రక్కకి వెళ్లి నిలబడుతారు. మరొక ప్రక్కనుంచి పేదలు ఆడా మగా వికృతమొగాలతో వస్తారు....)

పేదలు:- ఏమిగతీ యీజగతీ యేగతి జీవింతుమూ ?
పైడి పండు మా పొలాలు బీడైన వినేదయో....
మగ:- మా గాదెలు పట్టిపయ్యె మా కోరికలట్టులే
కూడు లేక ఎన్నాళ్లిక మాడగలం పేదలం?
ఆడ:- పాపలు మా ఇళ్లలోన వాపోవుచునుండిరి
ఆ పసివారల యాకలి బాపువార లెవ్వరో?
పేదలు:- ఏకుచింత లేక నేటిదాకా బ్రతికాం
మా కిప్పుడు ఆశయేని లేకపోయె నక్కటా....
మగ:- ఈతరి మా కెవ్వరు చేయూత నియ్యజాలరా?
పాటుపడే హారమయా నేటి కిట్టు లైతిమీ....
ఆడ:- అన్నలార ఆ దరినీ వున్నవారు గొప్పవారు
వారి యొద్ద కేగుదము కోరుదమా సాయం....
పేదలు:- అదే యోగ్యము ఇప్పటదే భాగ్యము
రోజులు మారే మనమే రాజుల మౌతామూ....

(పేదలింకొక ప్రక్కకు వెళ్లి నిలబడతారు. యువతీ యువకులు నృత్యం చేస్తూ ప్రవేశిస్తారు)

**యువతీ యువకు** ఈవసంత వీక్షించుమా — ఊ —
ఆనంద నాదించుమా — ఊ —
దారిలేక లోవకుండా
ఊరికే చూస్తున్నావా....
ఆమధ్య వేడిగా నిట్టూర్చుచూ
భూమాత అల్లాడి పోతున్నదీ....

ఎందుకీ బిద్ధకం మీకూ ?
రండి కామందులారా
ఎందుకీ నైరాశ్యమూ ?
రండోయి రైతులారా ?
దూరాలు మరిచి పొందీ మీరింక
చేసుపై సిరు లందుడీ

(యువతీ యువకులు వెనక్కి వెడతారు. రైతులూ కామందులూ ముందుకు వస్తారు....)

కామందులు:- ఎందుకు వచ్చిరి మీరంతా ?
సందియ మెందుకు చెప్పండీ
రైతుల వలె నున్నారు మీరు మా
చేతనైన సాయం చేస్తాం....

పేదలు:- వినండి బాబూ దయవుంచీ
అనాది నుంచీ రైతులమే
కష్టాలెన్నో సహించినాం
నష్టాలన్నీ భరించినాం....

మగ:- రేలనకా పవలనకా
చేలనె కనిపెట్టుకున్నాం
పండిన యేడూ తింటున్నాం
ఎండి నప్పుడూ వస్తున్నాం....

కామం:- ఎన్నిమారులో మీ కథలూ
విన్నామయ్యా మీ వ్యథలూ
ఇప్పుడు మీకేం కావాలో
చెప్పండీ త్వరగా....

ఆడ:- ఏమని చెప్పగలం బాబూ
మామొర నాలించే దెవరూ ?
పంట లేదు మా పొలాలలో
ఇంట కూడులే దెవ్వరికీ....

పేదలు:- సత్తువ గలదీ పొలమంతా
ఇత్తరి పాడయి పోయినదీ
ఏరు రెండేనూ బావు లెండెనూ
నీరు లేక చేలన్నీ యెండెనూ....

కామం:- వానలేక పోతే మొత్తంచేను లెంకిపోతే
పంటలు పాడయితే మీకూ ఇంటపస్తులైతే
ఎవరేమి చేయగలరయ్యా ?
ఇది మీదు కర్మ ఫలమయ్యా....

(కామందులు వెళ్లిపోతారు)

పేదలు:- అక్కటా కాపాడు దిక్కెవ్వరూ ?
మాకింక ఆకలీ చీకటేనా ?
భూమాతనే నమ్మినా మింత వరకూ
తాను కోపించే మాపై నెందుకొరకూ
వేలు పెవ్వాడైన జాలి చూపేనా ?
ఏదాత వచ్చి మమ్మా దరించేనూ ?

(నృత్యమయాక వారొక ప్రక్కకు వెళ్లి నిలబడతారు. మోహినీదేవి నృత్యంచేస్తూ అమృతకలశంతో ప్రవేశిస్తుంది.)

మోహిని:- నేనె మోహినీ దేవినహూ
నే భువనావన దేవతనూ
నాకడ నిదే సుధాకలశం
మీ కొరకే శ్రమకీ ఫలితం..
ఆకలి దప్పుల హరించుసూ
చీకు చింతలంతరించుసూ
వేగమె దీని గ్రహించుడయా
భోగము భాగ్యము నందుడయా..

పేదలు:- ఓ కృపామతీ వచ్చితివా ?
మా కొరక కమృతం తెచ్చితివా ?
పేదవారమో జనయిత్రీ
ఆదరించుమో దయనుంచీ..

(కామందులు తొందరగా వస్తారు)

కామందు: ఓ కృపామతీ వచ్చితివా
మా కొరకమృతం తెచ్చితివా ?
భూమిలోన కామందులమూ
మేమిక సౌఖ్యము లందెదమూ..

మోహిని:- పేదలనీ కామందులనీ
భేదునావు ఏ భేద భావమూ
కాయ కష్టమెవ్వాడు చేతురో
ఈ యమృతానికి వారె యోగ్యులూ..

యువతి:- జగంబు సమృద్ధిగా
యువక:- జనంబు సుఖింపగా
సుధారసం బొసగీ
శుభంబు లెసగించూ..
పొలములు పండుటకూ
కలుములు నిండుటకూ
ఉపాయము చెప్పుమా

కృపామతి మోహినీ..

మోహిని:- వెరపకుడో జనులూ
వెరవే చెప్పెదనూ
ఎప్పుడు నీరముతో
నొప్పెడు నేరులవే..
ఆనకట్టలూ కట్టుడయా
పూని కాల్వలూ త్రవ్వుడయా
కాలువలో గల నీరూ
చేలకు వేగము చేరూ..

అందరూ:- నిజం నిజమ్మిది భాగ్యవరం
ప్రజంగరకూ సౌఖ్యకరం
భగీరథుల మౌతాం
ఫలితమ్ము కందుతాం..

మోహిని:- ఏరులు దాటుటకై
వారధులను కట్టి..

అందరూ:- కడతాం కడతాం..
వంతెనలను కడతాం..

మోహిని:- దివ్యజల శక్తితో
దీపములను పెట్టి..

అందరూ:- పెడతాం పెడతాం
దీపములను పెడతాం..

మోహిని:- అందరు కలసండీ
ముందుకు నడవండి
కష్టపడిన వారూ
నష్ట పడరు సుమ్మా
ఉర్వి సమస్తము సుఖీభవా
సర్వ జనమ్ములు సుఖీభవా..

— (ఆకాశవాణి సౌజన్యంతో)



మానవ దేహములోని కరచరణాది సమస్తావయవములును యథా ప్రమాణముగా పెరుగుటయే వృద్ధి కాని యొక్క తలయో కాలో యత్యధికముగా పెరుగుట వృద్ధి కాక రోగమయినట్లే దేశ విషయములో గూడ జనుల నీతి మత కులాచారాదులైన సమస్తాంగముల యందును సమానముగా నభ్యున్నతి నొందుటయే వృద్ధి గాని యితరాంగములకు భంగము కలుగునట్లుగా నొక్క రాజ్యాంగముల యందే గాని యొక్క బుద్ధి ప్రచారమునందే గాని యుత్కర్ష నొందుట క్షేమకరమయిన దేశాభివృద్ధి కాదని నా యభిప్రాయము.

— కందుకూరి వీరేశలింగము.

# రెడ్డి రాజులు - ఆంధ్ర భాషా పోషణ

— కె. విశ్వేశ్వరరావు.

(గత సంచిక తరువాయి)

పెదకోమటి వేమారెడ్డి కాలముననే కందుకూరు రాజధానిగా రాజ్యమేలిన పినకోమటి రెడ్డి కుమారుఁడైన శివలింగ భూపతి హరదత్తాచార్యుఁడు "చతుర్వేద తాత్పర్య సంగ్రహము"ను పేర రచించిన ప్రౌఢ సంస్కృత గ్రంథమునకు వ్యాఖ్య వ్రాసెను. అతని యాస్థానమున ఈశ్వర భట్టను మహా విద్వాంసుఁడుండెను. అతని సహాయముతో శివలింగ భూపతి యా గ్రంథమును రచించెను.

పెద కోమటి వేమారెడ్డి తన జీవితకాలములోనే తన తమ్ముఁడు మాచారెడ్డికిఁ గొండపల్లి దుర్గము రాజధానిగా నా ప్రాంతమునందున్న కొంత దేశమునుఁ బరిపాలించుకొనఁ బంచియిచ్చెను. మాచారెడ్డి కొండపల్లి రాజ్యమును మిక్కిలి సమర్థతతో పరిపాలించి ప్రజల మన్ననలను బడసెను.

"పెదకోమటి మాచేంద్రో వేధసా నిర్మితోనృపః

ఇతరేతు నృపాస్సర్వే విశ్వామిత్రేణ నిర్మితాః"

అని పెద కోమటి మాచారెడ్డి కీర్తినందెను. ఈ రెడ్డి రాజు క్రీ. శ. 1414 సం॥ మునను ఆయన పుత్రుడైన తిప్పయరెడ్డి క్రీ. శ. 1415 సం॥ మునను జేసిన యగ్రహార దాన శాసనములు కలవు,

పెదకోమటి మాచారెడ్డి కొండపల్లిలో రాజ్యమేలునపుడు బట్టేపల్లి గ్రామము నగ్రహారముగా నొసగెను. మరుచటి వత్సరమున తిప్పయ్యరెడ్డి గుడివాడ తాలూకాలో పామఱ్ఱు దగ్గర నున్న యేకమూరు గ్రామమును ప్రతాపరుద్ర దేవుని భాండాగారాధిపుఁడగు మల్లన యొక్క మనుమఁడగు బంకమల్లయ్య యను బ్రాహ్మణునకు దానమిచ్చెను. ఈ తండ్రి కుమారుల యొద్ద నరహరి యను విద్వాంసుడు ఆస్థాన కవిగా నుండెను,

## రాచవేముఁడు (క్రీ. శ. 1420–1424)

ఇతఁడు పెదకోమటి వేమారెడ్డి కుమారుఁడు. కొండవీటి రాజులలోఁ జివరివాఁడితఁడే. ఇతనితో కొండవీటి రాజ్యమంతమై విజయనగర రాజ్యములోఁ జేరిపోయెను. అప్పుడు విజయనగర రాజ్యమును రెండవ దేవరాయలు పరిపాలించుచుండెను కొండవీటి రాజ్యము 1424 సంవత్సరములోఁ గూలిపోయినపుడు కొండపల్లి రాజ్యము కూడఁ జెడిపోయినది.

## వేమవీరభద్రారెడ్లు క్రీ. శ. 1426–50

రాజమహేంద్రవర రాజ్యమును గాటయ వేమారెడ్డియు, కుమారగిరిరెడ్డి కుమారుఁడగు అనవోతారెడ్డియు గాటయ వేమారెడ్డి యల్లుఁడైన వీరభద్రారెడ్డియు నాతని సోదరులగు వేమారెడ్డి. దొడ్డారెడ్డి, అన్నారెడ్డి యను వారల గలిసి చీకటి చిల్క సముద్రము వరకుఁ బెంపొందించి పరిపాలించిరి. ఈ రెడ్డి రాజుల రాజ్యముత్తరమున మహానది వఱకు వ్యాపించెను. పెదకోమటి వేమారెడ్డికి ప్రబల శత్రువులై రాజమహేంద్రవర రాజ్యమును విస్తరింపఁజేసిన కుమారగిరి రెడ్డి కుమారుడైన అనవోతారెడ్డి, వేమవీరభద్రారెడ్ల తండ్రి యయిన అల్లాడరెడ్డి కాటయ వేమారెడ్డి క్రీ శ. 1390-1420 సం॥ల నడుమ స్వర్గస్థులైరి. రాజమహేంద్రవర రాజ్యము కాటయ వేమారెడ్డి యొక్క యల్లుడగు వీరభద్రారెడ్డికి సంక్రమించెను. క్రీ. శ. 1425 సం॥ము ప్రాంతమున కొండవీటి రాజ్యము కూలిపోయిన పిదప శ్రీనాథుఁడు రాజ

మహేంద్రవర రెడ్డి రాజ్యమునకుఁ జేరెను. "వీర భద్రేశ్వరు" ప్రబంధ నిభుని జేసి ఆంధ్ర క్షమా మండలా ఖండలుండైన వేమ భూపాలుని కృపా వీక్షణముచే శ్రీనాథుఁడు కాశీ ఖండమును రచించెను. కృతి పతియయిన అల్లయ వీరారెడ్డి కృతికర్తయగు శ్రీనాథునిఁ బిలిపింప నిండు సభలో నతఁడు

సీ. వచియింతు వేముల । వాడ భీమన భంగి
నుద్దండ లీల నొ । క్కొక్క మాటు
భాషింతు నన్నయ । భట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొ । క్కొక్క మాటు
వాక్రుత్తు తిక్కయ । జ్వప్రకారము రసా
భ్యుచితముగాగ నొ । క్కొక్క మాటు
పరిఢవింతుఁ ప్రబంధ । పరమేశ్వరుని త్రోవ
సూక్తి వైచిత్రి నొ । క్కొక్క మాటు

అని తన సామర్థ్యమును జెప్పుకొనెను. ఇట్లు చెప్పికొనుటలోఁ దాను రచనలో భారత కవిత్రయమునుఁ బోలుదు నవియు వారి కెవ్విధమునను దీసిపోననియు నుగ్గడించెను.

సీ. ఉక్త వేళల షోడ । శోప చారంబుల
శివుని చిత్తమ్ము రం । జితము సేయుఁ
బ్రతి వత్సరంబు ను । ద్భట వసంతోత్సవ
శ్రీల దిక్చయము వా । సితము సేయు
దయతోడి చూపుల । నయరీతినిం బదా
నత నృపాలురఁ బదో । న్నతులఁ జేయు
హేమాద్రిదాన క్రి । యా మాహాత్మ్యంబున
విప్రుల నతి దశా । న్వితులఁ జేయు

గీ. ననినఁ గొని యాడఁ దరముగా ।దతని మహిమ
ప్రకట సింహాచలోత్తర । భాగ లిఖిత
వివిధ జయ శాసనాక్షర । వినరక రస
మిద్ధ గుణుడల్ల విభునివే । మేశ్వరుండు

వేమ భూపాలుని కాలమున బ్రాహ్మణుల యైశ్వర్యమును దెల్పు నీ క్రింది పద్యమునుఁ జదువుఁడు.

సీ. ధరియింప నేర్చిరి । దర్భ పెన్గైదు వ్రేళ్ళ
లీల మాణిక్యాంగు । ళీయకములు
కల్పింప నేర్చిరి । గంగ మట్టియ మీఁదఁ
గస్తూరి కాపుండ్ర । కముల నొసల
నవరింప నేర్చిరి । జన్నిదంబుల ప్రోలఁ
దారహారములు ము । త్యాల సరులు
చెఱువంగ నేర్చిరి । శిఖల నెన్నడుములఁ
గమ్మని క్రొత్త చెం । గల్వ విరులు

గీ. ధామముల వెండియునుఁ బైడిఁ । దడబడంగ
బ్రాహ్మణోత్తముల గ్రహా । రములలోన
వేమ భూపాలునను జన్మ । వీర భద్రు
ధాత్రి యేలింప గౌతమీ । తటము నందు
(శ్రీనాథుఁడు)

కవి సార్వభౌమునకు రత్నాంబరంబు లిచ్చి గౌరవించి నట్లాతఁడు చరమ దశయందు చెప్పికొనిన యీ పద్యము వలనఁ దెలియుచున్నది.

సీ. "కాశికా విశ్వేశుఁ । గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబులే రాయకిచ్చు?
స్వర్గస్థుఁడయ్యె విస్సన । మంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని । పంక్తిఁ గలుగు?"

నిశ్శంక కొమ్మ నా మాత్యుడు తానచించిన శివలీలా విలాసమును దొడ్డారెడ్డికి మనుమడును, అల్లాడ రెడ్డికిఁ గుమారుఁడును, వీరభద్రారెడ్డికిఁ దమ్ముడునగు దొడ్డారెడ్డికి అంకిత మొనరించెను, ఈ కవి దొడ్డారెడ్డి నిట్లు ప్రశంసించెను.

సీ. పెద్దకోమటి వేమ । పృథ్వీశువెనుసూచి
యతని సంపదలెల్ల । నపహరించె
కటకాధిపతిఁగెల్చి । గజపతి దళవి భా
ళాఖ్యాన బిరుదంబు । నలవరించె
ఒడ్డాది విభుఁదోలి । యొగివాని యిండ్లెల్ల
పట్టుబద్రవ్వించి । బలువుచెఱిపె
ధారా సురత్రాణుఁ । బోర నిర్జితుఁజేసి
కొల్లవట్టించెఁద । త్కూటములను

ఆ.వె. గెరలుచుండి తురగ । రే వంతుడు వళుళ
రాయమాన మర్ద । నాయకాంక
దీప్యమాన నిష్ప । అప్రతాపహారి
దొడ్డ విభుని యల్ల । దొడ్డ శౌరి.

మ. అరరేయల్లయ దొడ్డ భూవిభుఁడు వాహారోహరే వంతుఁడిం
పరుదారన్వడి మూల గూరికడవా । హ్యాళిస్థలిన్ రాజుమం
జర సింహంబును వారు వంబునుయ । ద్బచ్చాలీల దాటింప జే

తిరమై యిర్వదినాల్గు మూళ్ళనిడువు । త్సేకంబు
చేయొత్తగన్

దొడ్డారెడ్డిని శ్రీనాథుఁడు కాశీ ఖండమున నిట్లనిస్తుతించెను.

శా. ఔరా। అల్లయరెడ్డి దొడ్డ వసుధాధ్యక్షుండు ధాటి । చమూ
భేరీ బాంకృతి ఘోరఘోషమున నిర్భేదించె నొడ్డాది శృం
గారం కోటయులోతగద్దయునునుద్ఘాటించే నత్యుద్ధతిన్
క్షీరాంభోధితటంబునన్నిలిపెదిక్సీమాజయ స్తంభముల్

ఈ. హరిదాటించెఁబురోపకంఠమున వా । హ్యాళి ప్రదేశంబునం
దరుదే యల్లయరెడ్డి నందనుఁడు దొ। డ్డయ్య క్షమాధీశ్వరుం
డిరునాలుంగును మూళ్ళమేర యది పో । లెక్కింప గానేలయ
ద్ధరణీ నాథుని కీర్తిదాలెఁగడును । ద్దండించి బ్రహ్మాండమున్

క్రీ. శ. 1456 సం॥ము నాటికి రాజమహేంద్రవరమున వేమ వీరభద్రా రెడ్ల రాజ్య మంతరించెను. దీనికి గారణము కళింగరాజులు (ఒడ్డె రాజులు) రెడ్డి రాజ్యముపై దండెత్తి వచ్చుటయే. వీరిర్వురకును జరిగిన యుద్ధములో రెడ్డిరాజులు ఓడిపోయిరి. ఔరంగజేబు కాలము (1658-1707) నాటికి రెడ్లు నవాబ్ మహమ్మదీయులకు లోబడిరి. నాటికి ప్రఖ్యాతి వహించిన రెడ్డి ప్రభువులు.

సీ. మలలపై పెద్దహో । బిలము సింగారెడ్డి
మంగళగిరి కోట । మలు గురెడ్డి
పొలుపొందు మారకా । పురము చెన్నారెడ్డి
రంజిల్లు నుదయాద్రి । రామిరెడ్డి
వెలయ తిరువళ్లూరి । వీర రాఘవరెడ్డి
వన్నెకాసుల కంచి । వరదరెడ్డి
నీటుకెక్కిన గండి । కోట మాధవరెడ్డి
తగుతాటి పర్తిచిం । తాలరెడ్డి
ఆ పాకనాటి రెడ్డి పరఁగ మోటారెడ్డి
యెసగు తోట పెద్ద యెల్లరెడ్డి

రెడ్డి యుగమునాటికి ఆంధ్ర దేశములో దేశి కవితతో నిండిన యక్షగానములు ప్రబలియున్నవి. రెడ్డి యుగములో ఆంధ్ర సాహిత్యము పరిమళ పారిజాతము వలె అతి మనోహరముగ వికసించెను. నాఁడు గౌతమీ పుణ్య కళ్యాణ కంఠసీమ సహజముగ సస్యశ్యామలమై నయనానంద సంధాయకమై, మనోరంజకమై కలకల లాడుచుండెను గౌతమీ స్రవంత ప్రదేశములు కడుంగడు సారవంతములై సుందర వనములతో- సుక్షేత్రములతోఁగలకల నవ్వుచుఁ గేరింతాలు కొట్టుచుండు గ్రామములతో నిండియుండెడివి.

ఆ కాలమున మధ్యాంధ్ర దేశము అనఁగా నేటి తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు మండలములు వేద వేదాంగాది పారంగతులైన భూసురులతో నిండి యుండెను. అంతుఁ బల్వురనేకాగ్రహారములంది 'మాన్య క్షేత్రముల్పెక్కు చందాలంబంద, నింటనొకప్పుడుందఱుగని పాడిపంటలతోఁ' దులఁదూగుచుండిరి. దుర్గము లు, పల్వలములు, కొలువులు ధర్మవనములు పాడిపంటలు కలిగి దేశముసుభిక్షముగా నుండెను. దేవాలయములు నిత్యోత్సవములతోఁ దేజరిల్లెను. తెలుఁగు నాటబడు నాలుఁగు పదునైదు శతాబ్దములలో నూట యేబది యేండ్ల కాలము పెంపొంది యున్న రెడ్డిరాజ్యమే దీనికి ముఖ్య కారణము

---

అవకతవక వాడి కక్షింతలిస్తే అసింటా వెళ్లి నోట్లో వేసుకున్నాట్ట.

— తెలుగు సామెత.

# శాలిహుండం

—జి.ఆర్. వర్మ.

పురాతన కాలంలో శాలిపెదక లేక శాలిపతక అని పిలువబడిన శాలిహుండం శ్రీకాకుళానికి 12 మైళ్ళ దూరంలో వున్నది. ఇక్కడకు నిత్యం బస్సు సర్వీసుల సదుపాయం వుంది.

శాలి హుండంలోని మొదటి రెండక్షరాలు శాతవాహన (శాలివాహన) సామ్రాజ్యంతోటి సంబంధాన్ని తెలుపుతున్నాయి. పరిసరాల ప్రజలు ఇప్పటికీ ఈ ప్రదేశం శాలివాహన రాజులకు చెందిందిగా అనుకుంటుంటారు. అదీ గాక. నాసిక్ శాసనం ప్రకారం. మహారాష్ట్ర ప్రాంతంలోని పీసజి పదక అనే గ్రామాన్ని, బౌద్ధులు పవిత్ర స్థలంగా వ్యవహరించుకోటానికి, విశిష్ట పుత్ర పులుమావి ధారాదత్తం చేసినట్టు ఇంకో స్థలంలోని పేరు పై అభిప్రాయాన్ని బలపరుస్తోంది.

నాలుగు సంవత్సరాల క్రితం పై దిబ్బ మీది బౌద్ధావశేషాలను త్రవ్వించారు. ఆ వివరాలు భారత ప్రభుత్వ పురావస్తు పరిశోధకుని 1954-55 నివేదిక ప్రచురించినపుడు తెలియపరుచబడుతాయి.

*   *   *

శాలిహుండం పతనాలకు జెందిన కొన్ని విషరాలను అందించి సహాయపడిన భారత ప్రభుత్వ పురావస్తు పరిశోధకుడు, శ్రీ డి. సి. సర్కార్‌కు నేను ఋణపడివున్నాను.

త్రవ్వకాలలో బయలుబడిన ఓ నల్లరాతి ఫలకం మీది శాసనం "ధమరనో అశోక శిరినో'' అని చదువబడుతోంది. ఈ పేరు మౌర్య చక్రవర్తి అశోకుని (క్రీ.పూ. 269-232) స్మరణకు తెస్తూంది. కాని ప్రాచీన లిపిశాస్త్రాన్ని బట్టి ఇది క్రీస్తుశకం 2వ శతాబ్దానికి చెందినదిగా వుంది. అయినప్పటికీ. మౌర్య చక్రవర్తి అశోకుడు నిర్మించినదేనన్న నమ్మకంతో ప్రజలు పురాతన స్వరూపానికి చిరస్మరణీయ చిహ్నంగా శాసన ఫలకాన్ని యేర్పరచారనే దానికే ఎక్కువ బలం వుంది.

"ధర్మరాజు" అనే సార్థక నామధేయం బుద్ధుడు, అశోకుడికే గాదు, కళింగరాజు కరవేల సిరికి, కదంబ, పల్లవ, వాకాటక రాజవంశీయులకు జెందిన ఇతరులకు కూడ వాడుకగా వుండేది.

మహాచైత్యకు దారి తీసే మెట్ల మీద చెక్కిన శాసనాలు క్రీస్తుశకం తొలి శతాబ్దాల నుండి యెనిమిదవ శతాబ్దంవరకు సందర్శించ వచ్చిన యాత్రికుల పేరులుగా కన్పిస్తోంది. వీరిలో కొంత మంది యాత్రికులు తాము "దగ్ధ-సంసార" (సన్యాసి), "దేశ-విహంగ" (యాత్రికుడు) లుగా చెప్పుకున్నారు.

మహాచైత్య పరిసర నివాస ప్రదేశాలలో బయటబడిన మట్టి పెంకుల మీది శాసనాలలో వాటిని వాడిన వారి లేక అర్పించిన వారి పేర్లుగా కనిపిస్తున్నాయి. ఈ పేర్లు నాగార్జున కొండ శాసనాలలో బౌద్ధభిక్షువులు వాడుకున్న నామధేయాలతో పోలి వున్నాయి.

త్రవ్వకాలలో వెలువడిన శంఖపు గవ్వల మీద శాసనాలు దాతల పేర్లను, "శాలిపెదక" "శాలిపతకలోని తూనకటక'' అని స్థలం పేరును రూపొందించబడ్డాయి.

*   *   *

త్రవ్వకాలలో కనుగొన్న వాటిని విశాఖ పట్టణానికి తరలించారు.

పురాతన మహా చైత్య, స్తూప, పరిసర నివాస స్థలాల్లోని అవశేషాలు ఇప్పటికీ ఆకర్షణ గొల్పుతూనే వున్నాయి. చైత్య స్థలము, చైత్య స్థలానికి దోవతీసే మెట్లు తూర్పు

దిశ ముఖం చూపుతున్నాయి. పురాతన కోటను, ప్రస్తుతపు కళింగ పట్నం గ్రామాన్ని దిబ్బమీది నుండి పరికించ వచ్చు.

ఆనాడు నివాసగృహాలు నిర్మించుకోటానికి వాడిన ఇటుకలు చాల పెద్దవి. వీటి కొలతలు 18″×18″ లేక 18″×19″ వున్నాయి. ఇవి అరుగొలను దిబ్బలు (లంజ దిబ్బలు)లో కనుగొన్న ఇటుకలతో పోలివున్నాయి. అరుగొలను గ్రామం తాడేపల్లికి 4 మైళ్ళ దూరంలోనూ, శాలిహుండంకు 250 మైళ్ళలోనూ వుంది. అరుగొలను దిబ్బలు ఇంకా త్రవ్వవలసి వుంది.

వంశధార నది శాలిహుండం దిబ్బకు సమీపంలో ప్రవహిస్తూవుంటుంది. శాలిహుండంపేరుతోనేఉన్న చిన్నపల్లె దిబ్బకు అవతలప్రక్క దిగువన వుంది. ఇక్కడ నివశిస్తున్న కులాలవారు కళింగులు, శిష్టు కరణాలుగా వ్యవహరింప బడుతున్నారు.

## ఆశ్రయ ప్రతిమ

శాలిహుండం గ్రామంలో బౌద్ధ జైన శేషాలు అనేకం కనుగొన బడ్డాయి. స్థానికంగా "ఛాయాదేవి" (సూర్య భగవానుని పత్ని) అని పిలువబడే అరడగుల ఎత్తుగల ప్రతిమ మాత్రం ఆకర్షణీయంగాను, ఆశ్రయం పొంది వున్నది.

దేవతా విగ్రహాన్ని ప్రాచీన వర్ణనల కనుగుణంగాను, ఎంతో వాస్తవికంగా మలచటానికి చుక్కల రాతిని యెన్నుకున్నందుకు కళింగ శిల్పి భావనాచాతుర్యం కొనియాడదగింది.

ఈ దేవత మూడు శిరస్సులు, ఆరు చేతులతో సప్తాశ్వాలు లాగుతున్న రథంమీద ఎక్కి బెట్టిన బాణాన్ని పట్టుకొని, పూర్తిగా వికసించిన కమల పద్మాలను ధరించి, నీటుగా నిలబడి (అలీఢ పద) వుంది. వెనుక భాగాన తల వెంట్రుకలు వంగరాలు తిరుగుతూ చక్కగా చెక్కబడ్డాయి.

ఈ ప్రాంతపు బౌద్ధ, జైన పవిత్ర స్థలాల పతనానికి కారకులు కళింగకు చెందిన గాంగేయ రాజులే నన్నది చారిత్రిక సత్యం. మాధ్యమిక యుగంలో కొన్ని దేవాలయాలను, గాంగేయ రాజుల కాలంనాటి ఇతర శైవ స్వరూపాలను వైష్ణవ దేవాలయాలుగాను, సూర్య భగవానుని పూజా స్థలాలుగాను మార్పు చేయటం జరిగింది. శ్రీకాకుళం సమీపంలో గల అరసవల్లి, శ్రీకూర్మంలో యీ విషయాలు తేటతెల్ల మవుతాయి.

అరసవల్లిలోని సూర్యభగవానుని విగ్రహం కోణార్క ప్రతిమతో పోలివుంది. అరసవల్లిలోని సూర్య నారాయణ భగవానుని ముందు 3 చిన్న ప్రతిమలు వున్నాయి. ఈ మూడు సూర్యుని భార్యలు ఉష, పద్మిని, ఛాయలను తెలుపుతున్నాయి. దిన కాంతిలోని మూడు భాగాలు వీరే.

శాలిహుండం గ్రామ దేవత సూర్య భగవానుని స్త్రీ స్వరూపమని లేక సూర్య శక్తి అని అంటుంటారు. కాని ఇది వేద సాహిత్యంలో వివరించినట్టు, ఉషః దేవత ప్రతిమే.

మనమిప్పుడు చెప్పుకుంటున్న ప్రాంతం మౌర్యుల కాలంనాటి గ్రీకులకు అపరిచితమైన ప్రదేశ మేమిగాదన్నది మనం మనసులో వుంచుకోవాలి.

మార్కండేయ పురాణంలో సూర్య దేవుని భార్యలు సంధ్య, ఛాయ ఇద్దరేనని చెప్పబడింది. కొంత మంది ముగ్గురనీ, వీరే దిన కాంతియొక్క మూడు భాగాలనీ అంటారు.

సంధ్య—ఉషస్సు—దేవత సత్యానికి, జ్ఞానానికి పెట్టింది పేరుగా మనం పురాణాలలో, వేదాలలో వివరణీయంగా చదువు తుంటాం ఈమెసౌందర్యవతి, నేర్పరి, ప్రథమారాధనకు మూలం. ఈమె సోదరులు భగ, వరుణ దేవులు. ఉదయ కాంతిని తెచ్చి, చీకటిని తరుముతుంది. ఈమెకు తల్లిలేదు ద్యౌసుని ఫాల భాగంనుండి ప్రభవించింది.

సూర్య దేవుని భార్యలు ఉష సంధ్య ప్రత్యూషకపాయి అని చెబుతూ వుంటారు. వీరే ఉష, అహన, ద్యోతనగా కూడ పిలువ బడుతున్నారు

ఇలా భావించిన మూడు ఉదయ కాంతులు శాలిహుండం ప్రతిమలో లీనం చేయబడ్డాయి.

ఉషస్సు అహన, ద్యోతనలు గ్రీకు పురాణంలో ఇవోస్, ఎథీనీ, దఫానే అని పిలువబడుతున్నారు ఎథీనీ ఉషస్సును పోలి వుంది ఈమె వారికి యుద్ధ దేవత కూడ. జ్యోస్ (ఆకాశ స్వర్గం) ఫాల భాగం నుండి ఆయుధాలతో కూడ ఉద్భవించింది.

శిలాహుండం శిలా శాస్త్రంలో శాలిపిటక, శాలిపదక, శాలిపతకలోని తుస్సకటకగా పిలుపబడింది. 'హుండం' మాత్రం ఎక్కడా సూచించ లేదు.

కొండ దిగువ భాగాన వున్న ప్రతి గ్రామాన్ని హుండం అంటారని శ్రీకాకుళం జిల్లాలో చెప్పబడింది. ఇవి కొన్ని కథాంతరాలు. కాని మొదటిదే సరియైంది. ఎందుకంటే ముండ భాషలో 'హుండం' అంటే 'దిబ్బ' అని వుంది. వ్యావహారిక తెలుగులో శాలిహుండం అంటే శాలి(వాహన) లకు చెందిన దిబ్బ అని అర్థం వస్తుంది. పురావస్తు పరిశోధకుని నివేదిక రాకపోవటంతో పూర్తి విషయాలు చర్చించటం సాధ్యపడదు. శాలిహుండం బౌద్ధుల సలేయులకు చెందిందా లేక శాలివాహన రాజులకు (శ్వేతకర్ణులు/శాతవాహనులు) చెందిందా అన్న విషయం పరిశోధకులుకనుక్కోవలసిందే.

ఇప్పటి శ్రీకూర్మం శ్వేతగిరే నని ఇతిహాసాలు చెబుతున్నాయి. కాని శ్రీకూర్మం కంటె శాలిహుండం జ్యోతిష్యాస్త్ర పరిశీలనకు అనువైన స్థలం గాబట్టి శ్వేతగిరిని శాలిహుండంతో కలపటమే సబబుగా వుండవచ్చు. శ్రీకూర్మం ఒకప్పుడు బౌద్ధ కేంద్రంగా వుండేదని, దాన్ని శైవాలయంగా మార్చారనీ, తరువాత మరల వైష్ణవాలయంగా మార్చబడిందనీ ఒక నమ్మకం వుంది. శైవాలయాన్ని వైష్ణవాలయంగా ఏ విధంగా మార్చిందీ అరసవల్లిలోని సూర్యభగవానుని ఆలయం సాదోహరణంగా చూపుతుంది. బౌద్ధ సాహిత్యం నాగుల/సర్పముల ఇతిహాసాలను తెలియజేస్తుంది. శ్వేతకర్ణులు, శాతవాహన సామ్రాట్టులు నాగజాతీయులకు సన్నిహిత సంబంధీకులు.



ఆకాశంబున నుండి శంభుని శిరంబందుండి శీతాద్రికు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి భూలోకంబునందుండి య
స్తోకాంభోధిప యోధినుండి పవనాంధో లోక ముంజేరెగం
గాకూలంకష పెక్కుభంగులు వివేక భ్రష్టసంపాతముల్

* * *

ఒక చోనేలను బవ్వళించు నొకచో నొప్పారు పూశయ్యపై
నొకచో శాకము లారగించు నొకచో నొప్పారు శాల్యోదనం
బొకచో బొంత ధరించు నొక్కొకతరిం యోగ్యాంబర శ్రేణివె
క్కకు రానీయడు కార్య సాధకుడు కష్టంబున్ సుఖంబున్ మదిన్

నాటిక

# బ్రతుకు భయం

— నెల్లూరి కేశవస్వామి

(గత సంచిక తరువాయి)

మాలతి:- ఏమిటీగొడవ?

శేష:- ఏమయిందీ?

మాల:- మీ ఆఫీసులో హజారీ అనే వాడెవడూ?

శేష:- ఓ. అతనా?

మాల:- అతను కాదు వాడు.... వూళ్లో అంతా అప్పులు చేసి పారిపోయాట్ట గా....మీ రెంతిచ్చారు?

శేష:- నేనా? ... నేనేమి ఇవ్వలేదే.

మాల:- ఏమో, ఎవరికి తెలుసు....పోనీ వాడు సేట్ గిరిధరలాల్‌కు రెండు వేలకు వ్రాసిచ్చిన నోటుపైన జామీనుగా సంతకం చేశారటగా?

శేష:- ........

మాల:- ఏం? మాట్లాడరేం? ..అయితే నిజమే నన్న మాట. ఆ సంతకం మీదేనన్న మాట....ఇవ్వాళ గిరిధరలాల్ వచ్చారు.

శేష:- ఇక్కడికా?

మాల:- అవును. ఇక్కడికే. మిమ్మల్ని అడిగీ అడిగి విసుగెత్తిందట. మీ పైన దావా పడేస్తున్నాట్ట. మీ ఉద్యోగం ఊడదుకుంటట, జైల్లో కూడా కూచోబెట్టొచ్చట ఏమిటిదంతా?...నిజమేనా?...పలకరేం? ఎందుకలా సంతకం చేశారు? నాతో ఒక్కమాటైనా చెప్పారు కారే...?

శేష:- తోటి గుమాస్తా అనీ....

మాల:- ఛీఛీ! ఏం మనుషులు?....అయ్యో, అయ్యో, రేపు వుద్యోగం వూడితే ఏం కాను? ఏం తింటారు? బిచ్చమెత్తుకుంటారా? ఏమిటి? ఏంచేస్తారు? మాట్లాడరేం?

శేష:- లేదు లేదు. సేఠ్‌నే బ్రతిమాలుకుంటాను.

మాల:- ఇంకా ఎన్నాళ్లు? ఇంకో వారం రోజులు మాత్రం గడువిచ్చారు. అయ్యో, నా ఖర్మ. నా గతేం కాను. మిమ్మల్ని కట్టుకున్నందుకే మా వాళ్లంతా దూరమై పోయారు. ఇప్పుడీ దెబ్బతో నా వొంటినున్న నాల్గు వస్తువులూ తుడుచుకు పోతాయి. ఇంక నా గతేం కాను. అయ్యో, అయ్యో, — ఏడుపు —

శేష:- —దుర్గాగా వస్తూ— మాలతీ,....మాలతీ.

మాల:- ఎందుకా అరవటం? ఏం కొంప మునిగి పోయిందనీ?

శేష:- అది కాదు మాలతీ. ఇవ్వాళ్ల మా ఆఫీసుకో అఫీసరు మారి కొత్త ఆఫీసరు వచ్చాడు.

మాల:- వొస్తే?

శేష:- కొత్త ఆఫీసరు ఎవరో కాదు మాలతీ. నీ పాత స్నేహితుడే మధుసూధనరావు.

మాల:- ఎవరూ? మధూ ఆ?

శేష:- అవునవును. అతనే. ఇవ్వాళే ఛార్జీ పుచ్చుకున్నారు., నన్నుగదిలోకి పిలిపించి నీ విషయం అడిగారు. వస్తానన్నారు కూడాను.

మాల:- ఏమిటీ? ఇక్కడికా?

శేష:- అవును. ఇక్కడికే, నిన్ను చూసిపోదామని...ఇదిగో వస్తూనే వున్నారు, లే....లే....

మధు:- హలో మాలతీ!

శేష:- రండి, రండి. దయచేయండి.

మధు:-ఏవిటీ? నువ్వు మాలతి వేనా? ఎంత మారిపోయినావ్?

మాల:-మీరో?

మధు:- నేనా?...నేనేమీ మారలేదే .... అదేవిటి అలా వున్నావ్? నేను వస్తానంటే ముస్తాబై, టీ వగైరాలు తయారు పెట్టి....

మాల:-తెస్తాను.

మధు:-వొద్దు వొద్దు, లేవొద్దు. ఎన్నాళ్లకెన్నాళ్లకు కలుసుకున్నాం. చాలా విషయాలు మాట్లాడాలి. ఏమోయ్ శేషయ్యా, నీకు టీ పెట్టటం వచ్చుగా?

శేష:- ఆ వచ్చండి. వచ్చు

మధు:- ఏదీ రెండుటీ చేసి తీసుకురా.

శేష:- చిత్తం. ఇప్పుడే....

మాల:-మీరూ....

మధు:- మీరేవిటి, మీరు. నా పేరు మధు.

మాల:-వంటరిగానే వచ్చారే?

మధు:-కాక, ఎవర్ని తీసుకురానూ?

మాల:-నీ భార్యని—సరస్వతిని.

మధు:- సరస్వతి నా భార్యా? ఎవరన్నారు?

మాల:-ఎవరేవిటి, పరీక్ష ఫలితాలు రాగానే పెళ్ళని పత్రికలు వస్తే........

మధు:- ఓ, అదా? అదంతా సరస్వతి ఫాదర్ చాదస్తం. మాకు పెళ్ళి కానే లేదు.... నేనింకా బ్రహ్మచారినే.

మాల:-నిజం.

మధు:- ఇదిగో వంటరిగా వచ్చాను. ఇదే ప్రూఫ్...అయితే ఇదన్న మాట నీ పెళ్ళికి కారణం. నువు చాలా తొందర మనిషివి మాలతీ? నిజం నన్నడిగి తెలుసుకోవద్దూ? లేనిపోనివి వూహించుకుని, నా మీద కోపం కొద్దీ, ముందూ వెనక చూడకుండా ఈ దేబెను మెడకు చుట్టుకుంటావా? ...

మాల:-నా ఖర్మ. (నిట్టూర్పు)

శేష:- ఆరోజునించి నా నిత్యజీవితంలో ఓ పెద్ద మార్పు వచ్చేసింది. దాదాపు ప్రతి సాయంత్రమూ మధు మా యింటికి రావటం మొదలెట్టాడు. ఇద్దరూ కలిసి షికార్లకీ, సినిమాలకీ వెళ్ళటం ప్రారంభమైంది. దాంతో అనేక పుకార్లు బయలుదేరాయి. ఆఫీసంతా గగ్గోలుగా వుంది ఇన్నాళ్లూ ఆఫీసులో నన్నా నాకు కాస్త హాయిగా వుండేది ఇప్పుడక్కడసలే నిలవ నీడ లేకుండా పోయింది. హేళనా, ఎగతాళి మాటలూ రోజు రోజుకూ ఎక్కువైపోతున్నాయి. నన్ను కాదన్నట్లుగానే ఎంత నిర్లక్ష్యంగా వున్నా దుర్భరమైపోతోంది. నాతోటి ఉద్యోగి ఒకడు గంగాధరం, కొత్తగా ఉద్యోగంలో చేరాడు. మల్లివాడు, మా ఇంటి పక్కనే వుంటాడు. ఒకరోజు ..

గంగా:-ఏవిటండీ శేషగిరిరావుగారూ, ఏమిటిదంతా? ఈ నాటకమంతా మీ కళ్లెదుటే జరుగుతూంటే, చూచీ చూడనట్టు వూరుకుంటారే?

శేష:- ఏ నాటకం?

గంగా:-అదేవిటండీ లోకం కోడై కూస్తుంటే?

శేష:- నన్నేం చెయ్యమన్నారూ? ....

గంగా:-లోకం నోరు నొక్కెయ్యాలి.

శేష:- నా తరమా?

గంగా:-ఏం ఎందుక్కాదూ?.... కారకులెవరో కనుక్కుని కాల్చిపారేస్తే. సరి.

శేష:- అమ్మయ్యో.

గంగా:-ఛీ! ఏం బ్రతుకు, వెధవ బ్రతుకు, ఇంతకంటే చావు మేలు........

శేష:- అవును, నిజమే బ్రతుకు భారమై పోయినప్పుడు చావటమే ఉత్తమం.... . నేనెలాగూ వాళ్లను చంపలేను. చంపగలిగినా నేను సాధించేదేమీ వుండదు. అంతకంటే నన్ను నేను తొలగించి వేయటం మేలు. ఈ నిశ్చయానికి రాగానే గంగాధరం ద్వారానే ఈ పిస్తోలు సంపాదించాను. ఆత్మహత్యకని మాత్రం చెప్పలేదు. ఒకే ఒక్క గుండు పెట్టుకుని ఇవాళ సాయంత్రం ఇంటికి వచ్చాను. ఎలాగూ చస్తున్నాను కాబట్టి, నా ఆత్మశాంతికోసం, ఈ పిస్తోలు చూపించి వాళ్ళ నోటనే నిజం కక్కించి, వాళ్ళ ఎదుటే ఆత్మహత్య చేసుకోవాలని ప్లాను .. ఇంటి కొచ్చే సరికి

వాళ్లు లేరు. సినిమాకి వెళ్లారు. కాచుక్కూచున్నాను. ఎన్నో సార్లు రాబోయే సీనంతా వూహించుకుని రిహార్స్ చేసుకున్నాను. సరిగ్గా పదింటికి అయిదు నిమిషాలు తక్కువుండగా కారు వచ్చి ఆగింది. నా కాళ్లూ, చేతులూ వణకటం ఆరంభించాయి. అతి కష్టం మీద సంభాళించుకుని, కుడి చేతిలో పిస్తోలు పట్టుకుని గది మధ్యలో నిలబడ్డాను. కిలాకిలా నవ్వుల్తో వస్తున్నారు. తలుపు తోసుకొని వచ్చారు ఇద్దరూ! ముందు మాలతి, వెనక మధు. నన్ను చూడగానే కెవ్వున కేక వేసింది మాలతి. ఆఁ ఆగు, ఆగు అంటూ ముందుకు దూకాడు మధు. నా నోట మాట లేదు. అప్రయత్నంగానే పిస్తోలు పేలింది. ఎక్కడలేని భయం నన్ను ముంచెత్తేసింది. కళ్లు చీకట్లు కమ్మాయి. వెంటనే పరుగుతీసాను.... ఇదీ నా కథ.... ఇంక చెప్పండి డాక్టర్! నా ఈ భయానికి కారణం చెప్పాలి. మనుషులంటే, ప్రపంచమంటే, బ్రతుకంటేనే నాకు భయమెందుకో దీని మూలకారణమేమిటో చెప్పాలి........

డా:- ఆ సంగతి తర్వాత చూద్దాం కాని ముందు నా వెంటరండి.

శేష:- (భయంగా) — ఎక్కడికి.

డా:- మీ ఇంటికి.

శేష:- అమ్మయ్యో, నేను రాను....పోలీసు స్టేషనుకు వెళ్లాలి....

డా:- పోలీసు స్టేషనుకు తప్పకుండా తీసికెళ్తాను. ముందు మీఇంటికి నడవండి. దీని అంతేమిటో కనుక్కోవాలి. అసలెవరేనా చచ్చారో లేదో తేల్చుకోవాలి....

శేష:- తప్పకుండా చచ్చివుంటారు. కాల్చానుగా.

డా:- ఊఁ హఁ అలా కాదు. రండి నా వెంట,.... ఊఁ....

(ఇద్దరూ గబగబా నడిచిన శబ్దం)

డా:- ఏదీ మీ ఇల్లు ? ఇదా ?

(తలుపు తట్టిన శబ్దం. కొంతసేపటికి తలుపు తెరిచిన శబ్దం)

గంగా:-ఎవరూ ?....అరే, శేషగిరా ! ఏం. ఎక్కడికెళ్లావ్, ఇంత సేపూ ?....మీరెవరూ ?

డా:- నేను డాక్టర్ శేఖర్ని. మీరూ ?

గంగా:- నా పేరు రామనాథం. ఇతను గంగాధరం.

డా:- ఓ. మీరా, ఈ పక్కనే వుంటారు కదూ.

గంగా:-పక్కనేమిటి. ఈ ఇంట్లోనే వుంటాము ఈయనా కలిసే వుంటాం.

డా:- అదేమిటి ? మరి మాలతిగారూ ?

గంగా:-మాలతా ? మాలతెవరూ ?

డా:- వీరి భార్య.

గంగా:-శేషగిరికి భార్యేమిటి. పెళ్లే కాలేదు.

డా:- ఆఁ, పెళ్లే కాలేదా ? మరి ఇందాక చెప్పుకొచ్చాడే, తన భార్యా. ఆఫీసరూ కలిసి సినిమాకెళ్లారనీ, ఈ పిస్తోలుతో కాల్చాననీ....

గంగా:-పిస్తోలా ? ఏదీ ?....అరె, ఇది నాదేనే. డ్రాయర్ లోంచి తీశాడేమో అయినా ప్రమాదం లేదు; లెండి, అందులో గుళ్లు లేవు.

డా:- అంటే, ఆయన చెప్పిందంతా అబద్ధమే నంటారా ?

గంగా:-అహ్హహ్హహ్హ ! ఆఖరికి పాపం ! మీరు గురైనారన్నమాట. క్షమించాలి సార్ ! ఇందులో ఏమీ నిజం లేదు. ఈయనో రచయిత. పెళ్లామూ లేదు. వుద్యోగమూ లేదు. కేవలం రచనలపైనే బ్రతుకుతాడు. ఏం బుద్ధిపుట్టిందో ఏమో. ఓ వారం రోజుల నించి, నాతో అంటున్నాడు. తాను రాయబోయే కొత్త కథను ప్రత్యక్షంగా టెస్ట్ చెయ్యాలని. నేను వేళాకోళం అనుకున్నాను. తీరా, మీకు అనవసరంగా శ్రమ కలిగించాడు. క్షమించాలి. మళ్లీ ఇల్లా జరగదు. పొద్దు పోయింది, వెళ్లి పడుకోండి....

(సమాప్తం)





శాలిహుండం కొండ మీద పురాతన చైత్య శిధిలాలు



శాలిహుండంలో దొరికిన 'త్రికాలి' లేక ఛాయాదేవి విగ్రహం. మూడు తలలు ఉదయ, మధ్యాహ్న, సాంయకాల చిహ్నాలు.



అరసవల్లి శ్రీ సూర్య నారాయణస్వామి

(39వ పేజీ చూడుడు)



'హాట్ లైన్' మరమ్మతుల పద్ధతి:- విద్యుత్ప్రసారం ఆపకుండానే మరమ్మతులు చేసే కొత్త పద్ధతి ప్రదర్శనం, 1960 మార్చి 12వ తేదీన హైదరాబాద్‌లోని ఎర్రగడ్డలో జరిగింది. రాష్ట్ర ప్రభుత్వ పబ్లిక్ వర్క్స్ శాఖా మాత్యులు ప్రదర్శనం తిలకిస్తున్నారు.

(26 వ పేజీ చూడుడు)



వరంగల్ జిల్లా హసన్‌పర్తిలో తస్సార్ సిల్కు పరిశ్రమలోని పనివాడు.

# కుక్క కాకాని

— పి. ఆర్. రావు.

(గుంటూరు జిల్లాలో కుక్క కాకాని అనే చిన్న గ్రామం వుంది. ఆ గ్రామానికి ఆ పేరు ఎందుకు వచ్చిందో తెలియజేసే కథ)

సుమారు రెండు వందల ఏండ్ల క్రిందటి మాట. ఒక వర్తకుడుండేవాడు. మరో వర్తకుని దగ్గర కొంత ధనం ఋణంగా తెచ్చుకుందామని ఆయన ఒకరోజు కొండపల్లి వెళ్లాడుట. ఆయనకు డబ్బుకు చాలా కక్కుర్తిగా వుంది. రెండు మూడు నెలల్లో మళ్ళీ బాకీ తీర్చేస్తానని చెప్పాడు. అయితే అప్పిచ్చేవాడు కేవలం మాటలకు లొంగుతాడా! ఏదైనా గట్టి హామీ కావాలన్నాడు. అప్పుకోసం వచ్చిన వర్తకుని దగ్గిర హామీగా పెట్టటానికి ఏమీలేదు. ఒక విశ్వాస పాత్రమైన జాగిలం తప్ప. దానినే కుదువపెడతానన్నాడు. అప్పిచ్చే షావుకారు యీ మాట విని ఆశ్చర్యపడ్డాడు? కుక్కను కుదువ పెట్టడ మేమిటి? అప్పు తీసుకోవడమేమిటి? అప్పు అడిగిన షావుకారు తన కుక్కను పిలిచాడు. దానిని ఏదేదో చేయమని సంజ్ఞలు, ఆజ్ఞలు చేశాడు. చెప్పినట్లల్లా చేసిందా కుక్క, అప్పుడు దానితో అన్నాడుగదా-"రెండు నెలల పాటు నిన్ను కుదువ బెట్టాను. బాకీ తీరేదాకా నీవు తిరిగి రావటం పడదు. అడుగో, ఆయన పక్కన వెళ్ళి కూచో" కుక్కకు అంతా అర్థమైంది కాబోలు, వెంటనే వెళ్ళి అవతల షావుకారు దగ్గిర నిలబడింది!

అప్పిచ్చే వర్తకుడికి యిప్పటికి బాగా నమ్మకం కుదిరింది. డబ్బు యిచ్చేశాడు. కుక్కను అట్టె పెట్టుకున్నాడు. తరువాత ఒకనాటి రాత్రి ఆ వర్తకు డింట్లో దొంగలుపడ్డారు కుక్కను కట్టేసిన గది తప్ప ఇల్లంతా దొంగల పాలయింది ఉదయం లేచిగాని ఆ యజమానికి తెలియలేదు తనకు జరిగిన నష్టం. కుక్కను విప్పి వదిలాడు. వసికట్టుకుంటూ కుక్క బైలు దేరింది దొంగలను పట్టుకోటానికి. వర్తకుడు గ్రహించి దానిని అనుగమించాడు. ఒకచోటికి వెళ్ళి కుక్క అక్కడ ఆగిపోయింది. అక్కడి యింట్లో వెదికితే వర్తకుడి సామానంతా చెక్కు చెదరకుండా దొరికింది. ఇంటికి వచ్చి తనవద్ద అప్పు తీసుకవెళ్లిన వర్తకుడికి ఒక లేఖ వ్రాశాడు. "కుక్క తెలివితేటల వల్ల నీ బాకీ పూర్తి పరిష్కారం అయింది" అని, ఆ లేఖను దాని మెడలో కట్టి, కుక్కను తన పూర్వ యజమాని దగ్గిరకు పంపేశాడు.

అప్పు తీసుకువెళ్ళిన షావుకారు ఎలాగో కష్టంతో డబ్బు సంతన చేసుకొని, బాకీ తీర్చటానికి కొండపల్లి వస్తూవుండే దారిలో కుక్క ఎదురు పడింది. తన ఆజ్ఞను పరిపాలించకుండా. నమ్మక ద్రోహంచేసి కుక్క పారిపోయి వస్తున్నదని భావించి వెంటనే చేతిలో ఉన్న బరిశతో దానిని పొడిచేశాడు. కుక్క చనిపోయింది. అటు కుక్క ప్రాణాలు పోవడం యిటు దాని మెడలోని చీటీ అతని కండ్లలో పడటం ఏక కాలంలో జరిగాయి. చీటీ చదువు కున్నాడు. గుండె పగిలి పోయింది. ఎంత తొందర పాటు!

కుక్కకు వేసిన శూలం తన గుండెలో గ్రుచ్చుకున్నట్లయింది. ప్రక్కనే ఎక్కి వచ్చిన గుర్రం కనిపించింది దానిని పొడిచేశాడు. అసలు తానుగదా దోషి అనే విషయంగుర్తు

కొచ్చింది. తనను తాను పొడుచుకున్నాడు. ఆ స్థలంలో విషాదం వెల్లువలై పారింది.

ఇదంతా జరిగిన కొంత సేపటికి ఒక యతి ఆ దారి వెంట పోతూ యీ దృశ్యం చూశాడు.... శవం, డబ్బు పంచీ చీటీ....యి వన్నీ. సర్వం తెలిసినవాడు కావడం చేత ఆయనకు అంతా క్షణంలో అర్థమయింది. ఆ డబ్బు తీసుకుని వెంటనే కొందరు మేస్త్రీలను కబురు చేసి పిలిపించాడు. ఒక పెద్ద రాతిమీద వారిచేత కొన్ని చిత్రాలు చెక్కించాడు—ఒక గుర్రపు రౌతు, ఒక పందిని వెంటాడుతున్న రెండు కుక్కలు. ఆ రాతిమీద మట్టితో ఒక చిన్న గోపురం కూడా కట్టించి. ఆ స్థలంలో జరిగిన కథకు చిహ్నంగా దానిని అక్కడ ప్రతిష్ఠ చేశాడు.

అక్కడికి సమీపంలో వున్న గ్రామం పేరు కాకాని. కాని యీసంఘటన జరిగిన అనంతరం దానికి టక్కు కాకాని అనే పేరు వచ్చింది. ఈ గ్రామం గుంటూరు, మంగళగిరి మధ్య వుంది, యిప్పటికీ అక్కడ యీ రాతి మీద చెక్కిన విగ్రహాలు వున్నాయి.

—:*:—

దాన కళాకలాపసము దంచిత సార వివేక సంపదన్
మానిత యాచమాన జన మానస వృత్త్యభిపూర్తి బుద్ధియే
వ్వానికిలేదొకింతయును వాడొకరుండు భరం బుధాత్రికిన్
గానలుగావు శైలములుగావు పయోధులు గావు భారముల్

*   *   *

అచ్చపు జీకటింబడి గృహ ప్రతులై విషయ ప్రవిష్టులై
చచ్చుచు బుట్టుచున్ మరల జర్విత చర్వణులైన వారికిం
జెప్పం బుట్టునే నొరులు సెప్పిన నైన నిజేచ్ఛనైననే
మెచ్చిన నైన గానలకు నేగిన నైన హరి ప్రబోధముల్

# ప్రశ్నావళి

ప్రశ్న 106: శ్రీ జి. వెంకటరామారావు, కందుకూరు.

జిల్లా ప్లానింగ్ ఆఫీసర్లే జిల్లా పరిషత్తు కార్యదర్శులా ? లేక. యీ కార్యదర్శుల పదవులు అదనంగా యీయ బడి వవా ?

సమాధానం:- జిల్లా ప్లానింగ్ ఆఫీసర్లస్థానే జిల్లా పరిషత్ కార్యదర్శుల పదవులు ఏర్పాటైనవి.

ప్రశ్న 107: శ్రీ వెంకటరామారావు.

జిల్లా పరిషత్తు సభ్యులు ఏకగ్రీవంగా ఆమోదించిన ప్రతి తీర్మానాన్ని జిల్లా పరిషత్తు కార్యదర్శి ప్రభుత్వమునకు తెలిపి, ప్రభుత్వపు ఆమోదము పొందిన తరువాతనే అమలు పెట్ట వలయునా ? దయచేసి తెలుపగలరు.

స:- నిర్దిష్ట పరిమితులకు లోబడి, జిల్లా పరిషత్తులకూ, వాటి స్థాయిసంఘాలకు పథకాలు మంజూరుచేసే స్వతంత్రాధి కారాలు వున్నాయి, వారు చేసిన తీర్మానాలు ప్రభుత్వా మోద మునకు రానక్కర లేదు.

ప్రశ్న 108: కొలతలు, తూకాలలో మెట్రిక్ పద్ధతి అమలు దేశ మంతటిలో ఎప్పటికి పూర్తి అవుతుంది. ? ఈ పద్ధతి యిప్పటికే ఏఏ పెద్ద పరిశ్రమలలో అమలు పరచ బడింది.

స:- పార్లమెంటు ఆమోదించిన చట్టం ప్రకారం ఈ సంస్కరణ 1966 సంవత్సరం నాటికి పూర్తి కావాలి.

1958 జులై నుండి జనపనార పరిశ్రమలోనూ, అక్టోబరు నుండి బట్టల మిల్లులు. యినుము ఉక్కు, సిమెంటూ, రసా యినిక ద్రవ్యాలు. ఇంజనీరింగ్ వస్తువుల పరిశ్రమలలోనూ, 1959 నవంబరు నుండి పంచదార పరిశ్రమలోనూ యీ పద్ధతి అమలు పరచబడింది.

ప్రశ్న 109: శ్రీ గంటా వెంకటరమణ, పార్వతీపురం.

ఆంధ్ర ప్రదేశ్ నందు పంచాయతీ ప్రభుత్వము లెన్ని ? మ్యునిసిపల్ ప్రభుత్వము లెన్ని ? పంచాయతీ ప్రభుత్వము లలో ఏది తక్కువ ఆదాయం గలది ? ఏది ఎక్కువ ఆదా యం గలది ? అలాగే హెచ్చు. తక్కువ జనాభా, విస్తీర్ణం గలవి ఏవి ? అలాగే మ్యునిసిపల్‌లో కూడా దయచేసి అం కెలతో సహా చెబుతారా ?

స:- ఆంధ్రప్రదేశ్‌లో పంచాయతీలసంఖ్య 14,286. ఆంధ్ర ప్రాంతంలో మునిసి పాల్టీలు 45. తెలంగాణాలో సిటీ మ్యు నిసి పాల్టీలు 16 పట్టణ మ్యునిసి పాల్టీలు 64. మునిసిపాల్టీ లలో అధికాదాయం, జనాభా. విస్తీర్ణము కలది విజయవాడ. కనీసాదాయం, జనాభా. విస్తీర్ణము కలది భీముని పట్టణం.

—:*:—

అంగట్లో అన్నీ ఉన్నాయి. అల్లుడి నోట్లో శని ఉంది.

— తెలుగు సామెత.

# విశేషాలు

## న్యూయార్క్ వస్తు ప్రదర్శనశాలలో అమరావతి శిల్పాలు

న్యూయార్క్ నగరంలోని మెట్రొపాలిటన్ వస్తు ప్రదర్శనశాలలో క్రొత్తగా ఏర్పాటు చేసిన భారత శిల్ప విభాగంలో నాలుగు ఆకర్షణీయమైన ఆంధ్ర శిల్ప ఖండాలు చేర్చబడినవి. ఇవి క్రీస్తు శకం మూడవ శతాబ్దానికి చెందిన ఆంధ్ర చారిత్రక శిల్ప ఖండాలు. ఆంధ్రుల చరిత్ర కాలంలో అమరావతి ప్రాంత శిల్పాలలో ఓబవ రాళ్లు, సున్నపు రాళ్ల మీద చెక్కిన శిల్పపు నగిషీ పనితనంతో కనులు మిరుమిట్లు గొలిపే సుందర దృశ్యాలతో స్థూప, చైత్య ఖండాలు, బుద్ధ విగ్రహాలు, దేవాలయ శిల్పాలు వుంటాయి.

* * *

## భారతదేశంలో ప్రథమ వ్యవసాయ విశ్వవిద్యాలయం

ఉత్తర ప్రదేశ్‌లోని పూల్‌బాగ్‌లో వచ్చే జూలై నుండి ప్రారంభమవుతున్న వ్యవసాయ విశ్వవిద్యాలయం డైరెక్టరుగా కాకినాడకు చెందిన శ్రీ గొల్లకోట గోపాలకృష్ణయ్య నియమించబడ్డారు. యిదే భారతదేశంలో మొట్టమొదటి వ్యవసాయ విశ్వవిద్యాలయం. దీనిని భారత ప్రభుత్వం, ఉత్తర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఉమ్మడిగా నిర్వహిస్తున్నారు.

శ్రీ గోపాలకృష్ణయ్య ఆంధ్ర విశ్వ విద్యాలయ పట్టభద్రులు. అమెరికాలోని మిన్నెసోటా విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ పొందారు. ఇవినాస్ విశ్వవిద్యాలయంలో మైక్రో బయాలజీ అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా 6 సంవత్సరాలు పని చేశారు.

ఈ విశ్వ విద్యాలయం విజయవంతంగా నడిస్తే యిటువంటి సంస్థలను హైదరాబాద్, కోయంబత్తూరు, పూనా, పశ్చిమ బెంగాల్ ప్రాంతాల్లో కూడా స్థాపించాలని సంకల్పం.

* * *

## అమెరికా విశ్వవిద్యాలయంలో తెలుగు బోధన

అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో తెలుగు భాషా బోధనకు ఏర్పాట్లు జరుగుతున్నాయని, ఆ విశ్వవిద్యాలయంలో భారతీయ వ్యవహారాలశాఖ అధిపతి ప్రొ. హెన్రీ. సి. హార్ట్ మార్చి 7వ తేదీన ప్రకటించారు. అమెరికా విశ్వవిద్యాలయాలలోని ప్రొఫెసర్లకు వివిధ భారతీయ భాషలతో పరిచయం కలుగజేయటానికి ఉద్దేశించిన కార్యక్రమంలో భాగంగా యీ తరగతులు ఏర్పాటు అవుతున్నాయి. తద్వారా వారికి భారతీయ సంస్కృతి స్వరూపం పూర్తిగా అవగాహన అవుతుంది.

27 భారతీయ భాషలలో బోధన తరగతులు ఏర్పాటు చేయటానికి అమెరికాలోని 40 విశ్వవిద్యాలయాలు ఎన్నికైనవి. వాటిలో విస్కాన్సిన్ ఒకటి.

లోగడ ప్రొ హార్ట్ భారతదేశంలో కొన్నాళ్లు పరిశోధనా కార్యక్రమంలో గడిపారు. బోధన కేంద్రానికి ఆయన అడ్మినిస్ట్రేటివ్ డైరెక్టరుగానూ, ప్రముఖ సంస్కృత పండితుడు, భారతీయ సంస్కృతి ప్రియుడు అయిన ప్రొ. ముర్రేఫోలర్ అధ్యాపకుడుగానూ పనిచేస్తారు.

తరగతులు వచ్చే సెప్టెంబరు నెలలో ప్రారంభమవుతాయి, అమెరికాలో తెలుగు భాషను గురించి అంతగా తెలియక పోయినా యిప్పటికి తరగతుల్లో చేరటానికి చాలా దరఖాస్తులు వచ్చాయని ప్రొ. హార్ట్ ప్రకటించారు.

ఈ బోధన కేంద్రానికి ఫెడరల్ స్టైపెండు కూడా లభిస్తుంది. ఈ తరగతుల ఏర్పాటుకు ప్రొ. ముర్రేఫెంలర్ ప్రధానంగా బాధ్యత వహించి పని చేసినందువల్ల యీకృషి ఫలించింది.

## బరువు ఎత్తటంలో శ్రీ ఈశ్వరరావు ప్రజ్ఞ

ఢిల్లీలో జరిగిన అఖిల భారత పోటీలలో ఫిబ్రవరి 27వ తేదీన ఆంధ్రప్రదేశ్‌కు చెందిన శ్రీ కె. ఈశ్వరరావు $291\frac{1}{2}$ పౌనుల బరువు నొక్కి కొత్త ఆసియా రికార్డు సృష్టించారు.

లోగడ ఆసియా రికార్డును ఇరాన్ దేశానికి చెందిన శ్రీ జె. మన్సూరీ స్థాపించగా దానికంటే 5 పౌనులు ఎక్కువగా శ్రీ ఈశ్వరరావు కొత్త రికార్డు సృష్టించారు.

స్నాబ్ పద్ధతిలో $256\frac{1}{2}$ పౌనులు, బరువు ఎత్తడంలో మొత్తం 360 పౌనులు ఎత్తి శ్రీ ఈశ్వరరావు భారత రికార్డును కూడా అధిగమించారు. భారత రికార్డును లోగడ వీరే స్థాపించారు.

రెండు చేతుల స్నాబ్‌లో లోగడ తాను స్థాపించిన 250 పౌనులను మించి యిప్పుడు $8\frac{1}{2}$ పౌనులు ఎక్కువ చేశారు. లోగడ తాను స్థాపించిన 840 పౌ. మొత్తం తూకంకంటే యిప్పుడు 10 పౌ. ఎక్కువ ఎత్తారు.

శ్రీ ఈశ్వరరావు కృష్ణా జిల్లా రైతు కుటుంబం నుండి వచ్చారు. వయస్సు 28 సంవత్సరాలు.

### చీరాల విద్యార్థికి ప్రథమ బహుమతి

బొంబాయిలో స్వేచ్ఛా వ్యాపార సంస్థ వారు "సహకార సేద్యం" అనే విషయంలో నిర్వహించిన వ్యాసరచన పోటీలో ప్రథమ బహుమతి రు. 250లు చీరాలలోని వి. ఆర్. యస్. కళాశాల విద్యార్థి శ్రీ యం. శ్రీరామమూర్తికి లభించింది. ఆ సంస్థ వారు నిర్వహించిన వ్యాసరచన పోటీలలో యిది మూడవది.

*　　*　　*

### హైదరాబాద్ యువతికి కాన్సాస్ యం. ఏ. డిగ్రీ

హైదరాబాద్‌కు చెందిన శ్రీమతి సువర్ణ శాంతి కుమార్‌కు కాన్సాస్ స్టేట్ యూనివర్సిటీ యం. ఎ. డిగ్రీ లభించింది. 1907 నుండి యీ విశ్వవిద్యాలయం యం. ఎ. డిగ్రీ లభించటం యిదే ప్రథమం. 1871 నుండి యం. ఎ. డిగ్రీ వున్నా, అప్పటి నుండి 1886 వరకు శాస్త్ర విషయాలకే ఆ డిగ్రీ పరిమితమై వుండేది. 1886 నుండి మూడు గౌరవ యం. ఏ. డిగ్రీలు మాత్రం యిచ్చారు.

యీ విశ్వవిద్యాలయంలో యింత వరకు తత్వశాస్త్రంలోనే యం. ఎ డిగ్రీ యిస్తున్నారు. అందులో ప్రథమంగా డిగ్రీ పొందుతున్న శ్రీమతి సువర్ణ "విలియం జేమ్స్ ఆవేశ సిద్ధాంతానికీ, విశ్వాసేచ్ఛకూ గల సంబధం" అనే విషయం గురించి థీసిస్ వ్రాసింది.



అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూకస
ద్గ్రంధాఖ్యాపనముల్ నపుంసకవధూ కాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మ హవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్త స్వర్గ సంసారముల్

# భద్రాద్రి రామ!

— చల్లా బ్రహ్మానందమ్

సూర్యబింబము వోలె సుందర నీలాల
కమ్ముల తలఁ గిరీటమ్ము మెఱయఁ

గమ్మచ్చు దీసిన కలికి వెన్నెల ప్రోగు
లన ను రమ్మున హార యష్టులొప్ప

విటలేందురేఖ సన్నిధి విశాఖలు వోలె
చెవుల కుండలములు శ్రీలు గూర్ప

కాయ మేఘమునించు కనక వర్షంబునా
గటితటీ పుటము శృంగార మొసఁగ

ఫణి ఫణా పుష్పశయ్యాపైఁ బవ్వళించి
యిఱుగడల శ్రీయు భూమియు నెలమినలరి
యంఘ్రులొత్తఁగ నినుఁ జూచుటనఁగ నసదె
రమ్యగుణ సాంద్ర భద్రాద్రి రామచంద్ర!!

* * *

జోహారు పవనాంకురాహారశయ్యావి
హార మనోహరా కారనీకు!
దండంబు దోర్దండ తలలసత్కోదండ
కాండ ఖండిత రిపుకాండ నీకు!

కైమోడ్పు నిజనామ కామనా సామాన్య
మాన్య ధన్యత్వ ప్రమాణ నీకు!
అంజలి శ్రుతి శిరః పుంజ మంజుల సుమ
మంజరీ రంజిత మహిత నీకు!

ప్రణుతి భక్తి రసావేశ వశ్య నీకు
నేటికోట్ల ఖగేశ్వర ఘోట నీకు
బిదుపది సర్వసుర మౌళి తాంఘ్రి నీకు
రమ్యగుణ సాంద్ర భద్రాద్రి రామచంద్ర—॥.

అందించుచున్నవి యఖిల దిక్కుల యందు
    పరిమళ భరిత పుష్పముల లతలు
సమకూర్చు చున్నవి, సర్వ కాలంబును
    నిర్మలతర వారి నిర్ఝరిణులు
బొసగించుచున్నవి పొల్లు వోకుండంగ
    నెల్ల వేళల నగ్ని। నింధనములు
ఘటియించు చున్నవి కడవలు నిండంగ
    మధుర దుగ్ధములుగో సంకులములు

నీసమారాధనమునకై నెగడి యిట్లు
లఖిలము సహాయ మొనరింప నజులౌన
రాధములు నిన్ను సేవింపరైరి తండ్రి
రమ్యగుణ సాంద్ర భద్రాద్రి రామచంద్ర—॥.

నీ చూపులేకున్న నిశిత తాపంబున
    బ్రహ్మాండ ఖండముల్ పగిలిపోవె
సీతాకు లేకున్న యాతుధానాగ్నిలో
    నమరు లెల్లరు శలభములు గారె
నీ ప్రాపు లేకున్న నిఖిల సంఘటన
    పంచ భూతంబులు పటు సెడవె!
నీయునికి లేకున్న నిష్పరి మాణులధాటి
    హాగ మంబులు పలు కాంగలవె!

కాదు కాదు చమత్కృతి లేమి లేమి
సందడించును నన్ను [illegible] సరస జలద
సుందరాకారమునం గను విందు నేసి
రమ్యగుణ సాంద్ర. భద్రాద్రి రామచంద్ర—॥.

---

# 1960-61లో ప్రణాళికా పథకాలు

ఆంధ్ర ప్రదేశ్ ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు కేటాయించిన సొమ్ము పూర్తిగా జరిగే ఆర్థిక సంవత్సరం ఆఖరుకి ఖర్చు పెట్టబడగలదని భావించబడుతున్నది. ఇది ప్రణాళిక ఆఖరు సంవత్సరం. ఈ సంవత్సరం బడ్జెటులో వసతి కల్పించబడిన వివిధ శాఖల ముఖ్యమయిన పథకాల వివరాలు దిగువ యివ్వబడినవి.

## 1. నీటి పారుదల

ద్వితీయ ప్రణాళిక క్రింద ఆంధ్ర ప్రాంతంలో భారీ, మధ్య రకం, చిన్నరకం నీటి పారుదల పథకాల క్రింద అనంగా సుమారు 7 లక్షల 44 వేల యెకరాలను సాగు క్రిందకు తేవాలని లక్ష్య మేర్పరచబడింది ఇందులో 96 వేల యెకరాలు రెవిన్యూ శాఖ క్రిందగల పంట చెరువుల క్రింద ఉండగా మిగిలిన 6 లక్షల 48 వేల యెకరాలు పబ్లిక్ వర్క్స్ శాఖ చేపట్టిన పథకాలక్రింద ఉన్నాయి. 1958-59 ఆఖరికి 2.75 లక్షల యెకరాల విషయంలో పని జరుప బడింది 1960–61 ఆఖరుకి 5.06 లక్షల యెకరాలు నీటి పారుదల క్రిందకు రాగలవని భావించబడుతున్నది. తెలంగాణా ప్రాంతంలో ద్వితీయ ప్రణాళికకు నిర్ణయించిన లక్ష్యం సుమారు 4 లక్షల 33 వేల యెకరాలు. ద్వితీయ ప్రణాళిక అయిదవ సంవత్సరంలో 2.18 లక్షల యెకరాలు సాగు క్రిందికి రావలసి ఉన్నవి. నిర్ణీత లక్ష్యాల సాధనకై సర్వ విధాలా కృషి సలుపబడుతున్నది.

### నాగార్జునసాగర్ ప్రాజెక్టు

నాగార్జునసాగర్ ప్రాజెక్టు తొలి ఘట్టానికి 92.74 కోట్ల రూపాయలు ఖర్చు కాగలవని అంచనా. ఈ ఘట్టంలో ఆనకట్ట, 135 వ. మైలు వరకు (మూసీ క్రాసింగ్) కుడికాలువ 105 వ. మైలు వరకు (ఫైర్ ఇన్‌ఫాల్) ఎడమ కాలువ ఉన్నాయి. ద్వితీయ ప్రణాళికలో రూ. 32.30 కోట్లు కేటాయించబడినవి. తొలి మూడు సంవత్సరాలలోను రూ. 18 కోట్లు ఖర్చు చేయబడినవి. 1960–61 కి రూ. 9 కోట్లు కేటాయించబడినవి.

పెద్ద పథకాలు ఆరింటిలోను తుంగభద్రా ప్రాజెక్టు దిగువ కాలువ, రాంపేరు మురుగు పథకం, కృష్ణా బారేజ్, ఎగువ పెన్నారు, రాళ్ల పాడు ప్రాజెక్టులు యిప్పటికే పూర్తి అయి వుపయోగంలోనికి తేబడినవి. భైరవాని తిప్ప ప్రాజెక్టులో కూడా పని దాదాపు పూర్తి అయినది. ఈ పథకం పూర్తికై 1960-61 కి రూ. 23 లక్షలు కేటాయించబడినవి. కృష్ణా బారేజ్ 70 గేట్లలోను 57 గేట్లు స్థాపించబడినవి. ఈ పని పూర్తికై 1960-61 కి రూ 10.08 లక్షలు కేటాయించబడినవి.

### కొత్త భారీ పథకాలు

ఆంధ్ర ప్రాంతంలో కొత్త భారీ నీటిపారుదల పథకాలలో తుంగభద్ర ఎగువ కాలువ మొదటి ఘట్టం 1959 ఏప్రిల్‌లో 13 కోట్ల రూపాయల ఖర్చుపై మంజూరు చేయబడింది. దీని క్రింద మైసూరులో 68 వేల యెకరాలకి ఆంధ్ర ప్రదేశ్‌లో సుమారు లక్ష 19 వేల ఏకరాలకి నీటిపారుదల లభిస్తుంది. ద్వితీయ ప్రణాళికలో యీ పథకానికి కేటాయించిన రూ. 300.00 లక్షలలోను 1958-59 ఆఖరుకి రూ. 39.96 లక్షలు ఖర్చు చేయబడినవి. 1960-61కి ఆంధ్రలో పనులకు 55.69 లక్షల రూపాయలు, తుంగభద్ర బోర్డు ప్రాంతంలో

పనులకు 78 లక్షల రూపాయలు కేటాయించబడినవి. మధ్య పెన్నాప జలాశయం కట్టడం పని ఆరంభమయింది. దక్షిణ ఉత్తర కాలువల పని సంతృప్తికరంగా సాగుతున్నది.

ద్వితీయ ప్రణాళికా పథకాలలో వంశధారా ప్రాజెక్టు కూడ ఉంది. జలాశయం స్థలం విషయంలో ఇంకా తుది నిర్ణయం తీసుకొనబడ లేదు. ఈ విషయంలో యిప్పుడు చురుకుగా పని జరుపబడుతున్నది

రాజోలిబండ, కడం ప్రాజెక్టులు తొలి ప్రణాళికలో మిగిలిపోయిన పథకాలు. రాజోలిబండ పథకంపై ప్రణాళిక తొలి మూడు సంవత్సరాలలోను అనగా 1958–59 ఆఖరు వరకు 79.44 లక్షల రూపాయలు ఖర్చు చేయబడినవి. ఈ పథకం పూర్తికై మరి 50 లక్షలు అవసరం. 1960–61 బడ్జెటు అంచనాలలో 40 లక్షలు కేటాయించబడినవి. కాలువ పని కొంత జరిగినది. మిగిలినది అనగా 66 వ. మైలుకి ఆవలి పని కూడా పంపిణీ కాలువల శాఖోపశాఖలతో సహా అన్ని విధాలా 1961 మార్చి నాటికి దాదాపు పూర్తి చేయబడుతుంది. ఈ కాలువ క్రింద ఆయకట్టు స్థిరీకరణ పని 45 వేల నూట 44 యెకరాల విషయంలో పూర్తి అయినది. మిగిలినపని చురుగ్గా సాగుతున్నది. ఇది కూడా 1960–61 లో పూర్తి కాగలదు. కడం ఆనకట్ట బాగుకై 160 లక్షల రూపాయల అంచనా మంజూరు చేయబడింది. ఈ పని 1961 జూన్ నాటికి పూర్తి కావచ్చు. 1960–61 కి 50 లక్షల రూపాయలు కేటాయించబడినవి.

## పోచంపాడు

పోచంపాడు ప్రాజెక్టుకి సంబంధించిన 1,525 లక్షల రూపాయల అంచనా ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది. ఇందులో ఒక ఆనకట్ట, ప్రధాన తూములు, అంచులు (ఫ్లాంక్స్), కాలువ ఉంటాయి. ఆనకట్ట లోతు నదీ గర్భం నుంచి 32 అ. ఎత్తున ఉంటుంది. దానికి 6 అ. ఫాలింగ్ షట్టర్లు ఉంటాయి. కాలువ నిడివి 68 మైళ్లు. దీని క్రింద మొత్తం 8 లక్షల 29 వేల యెకరాలు ఉంటాయి. ఇందులో ప్రస్తుతం 3 లక్షల 60 వేల యెకరాలకు నీటి పారుదల లభిస్తుంది. దీని పని త్వరలో ప్రారంభమవుతుంది. సూపరింటెండింగ్ ఇంజనీరు ఆధిపత్యాన ఒక సర్కిలు, రెండు నిర్మాణపు డివిజన్లు మంజూరు చేయబడినవి. ఆయకట్టు స్థిరీకరణ ఏగైరా పనులను పరిశోధన డివిజన్ ఒకటి చూస్తున్నది. 1960–61కి 40 లక్షల రూపాయలు కేటాయించబడినవి. ఆనకట్ట స్థలానికి రోడ్లు వేయబడుతున్నవి. సిబ్బంది, కార్మికుల నివాస గృహాలు, వర్కుషాపులు, కార్యాలయాల భవనాల నిర్మాణానికి అవసరమయిన ప్రాథమిక చర్యలు గైకొనబడుతున్నవి.

తరుగు ప్రాంతాల గ్రాంటు నుంచి ఆంధ్ర ప్రాంతంలో 17 మధ్యరకం ప్రాజెక్టులు ఆరంభించబడినవి. వాటిలో పది అనగా నక్కలగండి, పాలేరు, ఉప్పుటేరు దిగువ ఆనకట్ట, విదయారణ్య స్వామి చెరువు, బండకట్టుబాగు, గంభీరంగెడ్డ జలాశయం, సిద్దలగండి ప్రాజెక్టు, దిగువ సగిలేరు, పింఛా, చెన్న రామస్వామిగుడి ప్రాజెక్టులు పూర్తి అయినవి. ఇప్పటికే పంటనీరు అందించబడుతున్నది. కర్నూలు-కడప కాలవ అభివృద్ధి పని మొదట అనుకున్న రీతిగా పూర్తి చేయబడింది. ఈ కాలువ యిప్పుడు అభివృద్ధిలో తలపెట్టిన 3,000 క్యూ. ల నీటితో ప్రవహిస్తున్నది. 1960–61 లో తలపెట్టిన పనులన్నీ పూర్తికాగలవు. ఇతర ప్రాజెక్టులకు బదిలీ చేసిన యంత్రాల పూర్తి వరవతి యేమి, బాగుచేసిన లాగూన్ భూముల అమ్మకం సొమ్ము దాదాపు రూ 15.0 లక్షలు యేమి 1960–61 లో వసూలు కాగలదని భావించబడుతున్నది. ఈ అంచనాకై 1960–61 కి (-) 29.19 లక్షలు కేటాయించబడినవి. ఈ అంచనా క్రింద 2 కోట్ల ఖర్చుతో 74/6 మైలు నుంచి 190/0 మైలు వరకు కాలువ బాగు, కాలువల బాగు జరగాలని ప్రభుత్వం ఉత్తర్వు చేసింది 1960–61 లో కాలువల బాగుకి బడ్జెటులో 51.19 లక్షలు కేటాయించబడినవి. 1958–59 లో వరదలపల్లి నారాయణపురం ఆనకట్టపని మందగించినవి. ఇది 1961 మార్చి నాటికి పూర్తి కాగలదు.

తెలంగాణాలో తొలి ప్రణాళికలో మిగిలిపోయిన పనులు అయిదింటిలోను కోయిల్‌సాగర్, భీమసపల్లి, సర్లాసాగర్ ప్రాజెక్టు పనులు పూర్తి అయినవి. మూసీ ప్రాజెక్టు పని 1961 మార్చి నాటికి పూర్తి కాగలదు. 1960–61కి 30లక్షల రూపాయలు కేటాయించబడినవి సీరాలా ప్రాజెక్టు పని చురుగ్గా సాగుతున్నది. దీనిని పూర్తి చేయటానికై 1960–61లో 0.36 లక్షలు ఖర్చు పెట్టాలని సంకల్పించబడినది. ప్రస్తుతపు కాలువ 185 వ. గొలుసు వరకు అన్ని

విధాలా పూర్తి చేయబడినది. మిగిలిన పని 1960-61 లో పూర్తి చేయబడుతుంది.

## క్రొత్త మధ్యరకం పథకాలు

ఆంధ్ర ప్రాంతంలో ద్వితీయ ప్రణాళిక క్రింద 13 మధ్య రకం పథకాలు తలపెట్టబడినవి. ఇందులో అనంతపురం జిల్లాలోని దోరిగల్లు ప్రాజెక్టు, కడప జిల్లాలో ఎగువ సగిలేరు నుంచి రాచెర్ల చెరువుకి సరఫరా కాలువ పథకాలకు ఖర్చు ఎక్కువ, ఫలితం తక్కువ అయిన కారణం వల్ల వాటిని విరమించడం జరిగింది. మిగిలిన 11 పథకాలలోను ప్రభుత్వం నాలుగు పథకాలను మంజూరు చేసింది. (1) తొర్రిగెడ్డ పంపింగ్ పథకం. (2)పాలేరునుంచి బిట్రగుంటకి సరఫరా కాలవ త్రవ్వకం (3) పెదిగాం ప్రాజెక్టు (4) జుర్రేరు జలాశయం పథకం. శ్రీకాకుళం జిల్లాలోని ఒట్టిగెడ్డ ప్రాజెక్టు, ఘంటా వారి కొత్తగూడెంలో తాండవనదిపై జలాశయం కల్యాణి జలాశయం పథకం చిత్తూరు జిల్లాలో బాహుదా జలాశయం పథకాల అంచనాలు ప్రభుత్వ పరిశీలన లో ఉన్నవి. మిగిలిన మూడింటిలోను చిత్తూరు జిల్లాలో స్వర్ణ ముఖి ఎడమ కాలువ, వరాహ జలాశయం పథకాలు విపుల పరిశోధనలో ఉన్నాయి. మంజూరయిన నరసరాజ స్వామి ప్రాజెక్టు రైతుల అభ్యంతరాలవల్ల నిలిపివుంచబడింది.

విరమించబడిన రెండు ప్రాజెక్టుల స్థానే విశాఖ పట్నం జిల్లాలో డెంకాడ ఆనకట్ట పథకం, నెల్లూరు జిల్లాలో కనుపూరు కాలువ పథకం చేర్చబడినవి. మొదటి పథకంపై పని జరుగుతున్నది. కనుపూరు కాలువ పథకం ప్రాథమిక చర్యల నిమిత్తం ప్రభుత్వం 6.7 లక్షల రూపాయల అంచనాను మంజూరు చేసింది.

ధవళేశ్వరం ఆనకట్ట షట్టర్లు ఎత్తును 3 అ. నుంచి 6 అ. పెంచాలనే ప్రతిపాదన కొంత కాలంగా పూండీలోని నీటి పారుదల పరిశోధనా కేంద్రంలో పరిశీలింప బడుతున్నది. ధవళేశ్వరం ఆనకట్టకు అవసరమయిన డ్రమ్ గేట్ల నకాన్ని నిర్ణయించిన పిమ్మట ఆనకట్ట అగ్రాన 6 అ. డ్రమ్ గేట్ల స్థాపనకై మొదట 2.72 కోట్ల అంచనా సంపాదించ బడింది. ఇందువల్ల కొత్తగా ప్రథమ పంట కాలంలో 1 1 లక్షల యెకరాలకి, రెండవ పంట కాలంలో 60 వేల యెక రాలకి నీటి పారుదల లభిస్తుంది. ఈ పథకం ద్వితీయ ప్రణాళికలో లేనందున, ఋణ రూపంలో ప్రజా సహకారం లభించినట్లయితే దీనిని చేపట్టాలని సంకల్పించబడింది. దీనికి బడ్జెటులో నామ మాత్రంగా నూరు రూపాయలు కేటాయించ బడినవి

ద్వితీయ ప్రణాళికా పథకాలపై 1959 మార్చి ఆఖరు నాటికి రూ 4 41 లక్షలు ఖర్చు పెట్టబడినవి. 1959-60, 1960-61 సంవత్సరాలకు వరుసగా 26.13 లక్షలు, 57 10 లక్షలు కేటాయించ బడినవి ఈ పథకాలలో యే ఒక్కటీ యిప్పుడు పూర్తికాదు. తృతీయ ప్రణాళికలో వాటికి కావలసిన ఖర్చు 330 లక్షలు.

తెలంగాణా ప్రాంతంలో ద్వితీయ ప్రణాళికలో 11 మధ్యరకం ప్రాజెక్టులు తలపెట్టబడినవి వీటిలో దోరేపల్లి వాగు ప్రాజెక్టు నిలిపివుంచ బడింది. చిన్న మూసీ ప్రాజెక్టు విరమించబడింది. మిగిలిన తొమ్మిదింటిలోను హైదరాబాదు జిల్లాలోని జట్ పల్లి ప్రాజెక్టు, లఖ్నపూర్ ప్రాజెక్టు న్నూ, ఆదిలాబాదు జిల్లాలోని స్వర్ణ ప్రాజెక్టు మంజూరయినవి. సాలివాగు, రాముడుగు ప్రాజెక్టులు పరిశీలనలో ఉన్నవి. బొంబాయి రాష్ట్రంలోని భూముల ముంపుకి బొంబాయి ప్రభుత్వం స్పష్టమయిన అంగీకారం యివ్వనిదే ఆదిలాబాదు జిల్లాలోని సద్దవాగు ప్రాజెక్టును చేపట్టడానికి వీలులేదు. ఈ విషయంలో బొంబాయి ప్రభుత్వాన్ని అడగడం జరిగింది. మెదక్ జిల్లాలోని నల్లవాగు, నక్కవాగు ప్రాజెక్టుల విషయంలో విపుల పరిశోధన జరుగుతున్నది. శ్రీ శైలం జలాశయం వల్ల ఆయకట్టు ముంపుచే మహబూబునగరం జిల్లాలోని లక్ష్మీ సాగర్ ప్రాజెక్టును విరమించవలసి వచ్చింది. విరమించిన ప్రాజెక్టుల స్థానే యితర ప్రాజెక్టులు చేర్చబడుతున్నవి.

కొత్త ద్వితీయ ప్రణాళిక ప్రాజెక్టులపై 1959 మార్చి నెలాఖరికి 34 వేల రూపాయలు ఖర్చు చేయబడినవి. 1960-61లో 20 84 లక్షలను ఖర్చు చేయాలని సంకల్పం. మిగిలిన పథకాలు తృతీయ ప్రణాళికలో చేర్చబడతాయి. వాటికి 208 లక్షల రూపాయలు కావాలి.

## చిన్న పథకాలు

ద్వితీయ ప్రణాళిక కాలంలో నీటి పారుదల కార్య

క్రమంలో చిన్న నీటి పారుదల పనులకు యథా ప్రకారం ప్రాముఖ్య మివ్వబడింది. ఆంధ్ర ప్రాంతానికి రూ. 242.90 లక్షలు కేటాయించిబడినవి. ఇందులో 172.90 లక్షలు రెగ్యులర్ చిన్న నీటి పారుదల పనులకు, 70.00 లక్షలు చెరువు బాగు పథకాలకు ఉద్దేశించ బడినవి. తెలంగాణా ప్రాంతంలో గండిపడిన చెరువులకు, చిన్న నీటి పారుదల పనులకు 251.02 లక్షలు కేటాయించబడినవి. ఈ విధంగా మొత్తం రూ 493.92 లక్షలు కేటాయించబడినవి. మొదటి మూడు సంవత్సరాలలోను 181.21 లక్షలు ఖర్చు చేయ బడినవి.

1959-60 కి 145.81 లక్షలు (ఆంధ్రకు 70.00 లక్షలు, తెలంగాణాకు 75.81 లక్షలు), 1960.61 కి 166 90 లక్షలు (ఆంధ్రకి 98.70 లక్షలు తెలంగాణాకు 68 20 లక్షలు) కేటాయించబడినవి. స్థానికుల ఉత్సాహాన్ని రేకెత్తించి వారి సహకారం తగినంతగా సంపాదించి తద్వారా అభివృద్ధి వేగాన్ని హెచ్చించేందుకై ప్రభుత్వం పెక్కు సడలింపులను చేసింది

## వరద నిరోధక పథకాలు

వరద నిరోధక పథకాలపై 1959-60లో 63 లక్షలు ఖర్చు చేయబడినవి 1960-61 లో 119 లక్షలను ఖర్చు చేయాలని సంకల్పం.

## 2. విద్యుచ్ఛక్తి

1960-61 విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల సాలుసరి ప్రణాళిక పరిమాణం రూ. 359 84 లక్షలు (ఆంధ్ర ప్రాంతానికి రూ. 269.54 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రూ. 90 30 లక్షలు)

1960-61 లో మచ్‌ఖండ్ జల విద్యుచ్ఛక్తి పథకానికి (—) రూ. 0.92 లక్షలు కేటాయించ బడినవి. 1960-61 లో తుంగభద్ర జల విద్యుచ్ఛక్తి పథకానికి యంత్రాల ఖరీదు కొంత చెల్లించేందుకై 16.05 లక్షలు కేటాంచ బడినవి. తుంగభద్ర నెల్లూరు జల-థెర్మల్ పథకానికి 67 లక్షలు కేటాయించబడినవి.

## ఎగువ సీలేరు

ఈ పథకంలో సీలేరు నది ఎగువన విద్యుచ్ఛక్తి ఉత్పత్తి తలపెట్టబడినది. దీని క్రింద మొదటి ఘట్టంలో 60 వేల కె. వా శక్తిగల విద్యుతుత్పత్తి యంత్రాలు రెండు నెల కొల్పి బడతాయి. ఈ పథకం విపుల పరిశోధన పూర్తి అయినది. శిబిరాలు, రాకపోకల సౌకర్యాల వంటి ప్రాథమిక చర్యలు జరుగుతున్నవి. ఈ పథకం అమలు విషయంలో ఆంధ్ర, ఒరిస్సా ప్రభుత్వాల మధ్య జరిగిన ఒప్పందం ఫలితంగా ప్రధాన పనులను పూర్తిగా చేపట్టాలని సంకల్పించ బడినవి. 1960-61 కేటాయింపు రూ. 92.45 లక్షలు ప్రధానంగా గుంటవాడ అడ్డకట, మట్టికట్టలు, శిబిరాల నిర్మాణం వంటి సివిల్ పనులపై ఖర్చు పెట్ట బడతాయి.

1960-61 లో దాదాపు నూరు గ్రామాలకు విద్యుచ్ఛక్తి లభిస్తుంది.

## శ్రీశైలం జల విద్యుచ్ఛక్తి పథకం

ఇది తృతీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చతలపెట్టిన కొత్త పథకం. 1960-61 సంవత్సరం ప్రణాళికపై ప్లానింగ్ కమిషన్ అధికార్లతో కొత్త ఢిల్లీలో జరిగిన చర్చల సందర్భంలో శ్రీశైలం ప్రాజెక్టు క్రింద రోడ్లు, శిబిరాలు వగైరా ప్రాథమిక పని నిమిత్తం 15 లక్షల రూపాయలకు వసతి కల్పించేందుకు వర్కింగ్ గ్రూప్ అంగీకరించింది.

దిగువ సీలేరు, శ్రీశైలం, తుంగభద్ర ఎగువ కాలువ విద్యుచ్ఛక్తి పథకం మున్నగు వాటి పరిశోధన పూర్తి చేయ బడగలదు. ఇందు నిమిత్తం 1960-61 కి 5 లక్షలు కేటాయించ బడినవి.

## తెలంగాణా జల-థెర్మల్ పథకం

ఇందులో రామగుండం థెర్మల్ పవర్ కేంద్రం, 66 కె. వా. నార్తరన్ ఫీడర్, నగర పంపిణీ, నిజాంసాగర్ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల పునర్వ్యవస్థీకరణలు చేరి ఉన్నాయి. తెలంగాణాకు సర్వ సమగ్రమైన గ్రిడ్ ఏర్పాటుకు అవసరమయిన అదనపు ప్రసార మార్గం, ఉప కేంద్రాలు కూడా ఇందులో ఉంటాయి. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలను కలుపుతూ సమీప భావిలో హైదరాబాదు విద్యుచ్ఛక్తి సరఫరాను హెచ్చించేదుకై హైదరాబాదు, విజయవాడల మధ్య తలపెట్టిన 132 కె. వి. ఎస్. సి. ప్రసార మార్గాలకు కూడా యీ పథకంలో స్థానం ఉంది.

దిగువ పనులకై 45.35 లక్షల రూపాయలు ఖర్చు పెట్టబడగలవు.

1. నగర పంపిణీలో మిగిలిన పనులు.

2. కేంద్ర డీసిల్ కేంద్రాలలో మిగిలిన పనులు.

3. దాదాపు 300 మైళ్ల నిడివిగల 66 కెవి, 33 కెవి. 11 కెవి ప్రసార మార్గాల విషయంలో మిగిలిన చెల్లింపులు.

4. గుంటూరు, హైదరాబాదుల మధ్య 132 కెవి. ప్రసార మార్గాలను సంబధించిన పనులు.

దేవను జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టుకి 20 లక్షలు కేటాయింప బడినవి. ఈ సంవత్సరం దాదాపు 20 గ్రామాలకు విద్యుచ్ఛక్తి లభిస్తుంది.

గోదావరి బేసిన్‌లోని విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు. కుంటల విద్యుచ్ఛక్తి పథకం మున్నగు వాటి విషయంలో పరిశోధనలు జరుపబడతవి. ఇందునిమిత్తం 1960-61 కి 8 లక్షల రూపాయలు కేటాయించ బడినవి.

## 3. విద్య

ప్రాథమిక విద్యా కార్యక్రమం క్రింద 6-11 సంవత్సరాల మధ్య వయస్కులను 0.76 లక్షల మందిని, 11-14 మధ్య వయస్కులను 0.21 లక్షల మందిని అదనంగా పాఠశాలల్లో చేర్పించాలని సంకల్పం. ఆంధ్ర ప్రాంతంలో 12 కొత్త మాధ్యమిక పాఠశాలలను, 342 అదనపు సెక్షన్లను, అలాగే తెలంగాణా ప్రాంతంలో 13 కొత్త మాధ్యమిక పాఠశాలలను, 56 అదనపు సెక్షన్లను ప్రారంభించడానికి వసతి కల్పించబడింది. ప్రతి తాలూకా ముఖ్య పట్టణంలోను కనీసం ఒక్క ప్రభుత్వ బాలికల మాధ్యమిక పాఠశాలనైనా నెలకొల్పాలన్న పథకాన్ని అనుసరించి ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో చెరి పది కొత్త ప్రభుత్వ బాలికల మాధ్యమిక పాఠశాలలను నెలకొల్పాలని సంకల్పించబడింది. విద్యావంతుల నిరుద్యోగ నివారణ పథకం క్రింద ఆంధ్రలో పదకొండు వందల మంది ఉపాధ్యాయులను 22 మంది డిప్యూటీ ఇనస్పెక్టర్లను, తెలంగాణాలో 9 వందల మంది ఉపాధ్యాయులను 18 మంది డి. ఇనస్పెక్టర్లను నియమించాలని తలపెట్టబడింది. ఉభయ ప్రాంతాలలోను ఉపాధ్యాయినిలకై చెరి పంద చొప్పున మరి రెండు వందల నివాస గృహాలు నిర్మించబడతాయి. బేసిక్ విద్యపై అలహాబాదులో జరిగిన అఖిలభారత గోష్ఠిలో చేయబడిన సిఫార్సుల ననుసరించి 1962 నాటికంతా ప్రస్తుత పాఠశాలలన్నిటిని బేసిక్ పద్ధతిలోనికి మార్చటానికై ఉపాధ్యాయుల, డి. ఇనస్పెక్టర్ల నిమిత్తం ఒక శిక్షణా కార్యక్రమం కూడా చేపట్టబడుతుంది. శ్రీకాకుళంలోని ప్రభుత్వ బేసిక్ శిక్షణా పాఠశాలకు శాశ్వత భవనాలను నిర్మించాలని సంకల్పించబడింది. తెలంగాణా ప్రాంతంలో శిక్షణ పొందని ఉపాధ్యాయులు మరి 2 వేల 5 వందల మంది శిక్షణకై పంపబడతారు. బ్లాకు సమితులనాయూనిట్లు అన్న ప్రాతిపదికపై జిల్లాలన్నిటిలోను డి. ఇనస్పెక్టర్ల రేంజిలను పునర్వ్యవస్థీకరించాలని సంకల్పించబడింది. ఇందు కవసరమయిన అదనపు డిప్యూటీ ఇనస్పెక్టర్లకు వసతి కల్పించబడింది. తృతీయ పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన ప్రాథమిక పథకాల క్రింద జరిగే సంవత్సరంలో తెరచిన పాఠశాలల్లో 25 సీనియర్ సెక్షన్లను అదనంగా చేర్చటమే కాక 1960-61లో 16 కొత్త శిక్షణా పాఠశాలలను [50 ట్రైనింగ్ సెక్షన్లతో] తెరవాలని [తెలంగాణా ప్రాంతంలో] సంకల్పం. అలాగే ఆంధ్ర ప్రాంతంలో 5 కొత్త శిక్షణా పాఠశాలలు 5 అదనపు సెక్షన్లు తెరువబడాలని సంకల్పం. ఇలా యీ ప్రాథమిక పథకాల క్రింద తెరువబడిన కొత్త పాఠశాలల్లోను సెక్షన్లలోను శిక్షణ పొందే విద్యార్థులకు తెలంగాణా ప్రాంతంలో సెకండరీ గ్రేడు శిక్షణ పొందే వారికి నెలకు రూ. 35, ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ పొందే వారికి నెలకు రూ. 30 స్టయిఫెండు యివ్వబడుతున్నది. ఈ విధంగా ప్రాథమిక విద్య క్రింద ఏర్పరచిన పథకాలకు బడ్జెటులో అసలు మొత్తం రూ. 250 లక్షలలోను రూ. 143.15 లక్షలు కేటాయించబడినవి. 1960-61 కి ఖర్చుపెట్టాలనుకొన్న మరి 105.76 లక్షలు యీ గరిష్ఠ పరిమితి పరిధి కావలసున్నవి. ఇది కేంద్ర అధ్వర్య పథకాల ఖర్చు అయి ఉన్నది. దీని పెట్టుబడి బాధ్యత పూర్తిగా కేంద్ర ప్రభుత్వం భరిస్తుంది.

1960-61లో 14-17 మధ్య వయస్కులను 6.07 లక్షల మందిని అదనంగా పాఠశాలల్లో చేర్పించాలనీ, 14 కొత్త పాఠశాలల్ని, 361 అదనపు సెక్షన్లను తెరవాలనీ సంకల్పం. ఆంధ్రలో నాలుగు పాఠశాలలు, తెలంగాణాలో నాలుగు పాఠశాలలు హయ్యర్ సెకండరీ పాఠశాలలుగా మార్చబడ

గలవు. తెలంగాణాలో మరి 20 సెంకడరీ పాఠశాలలు, ముఖ్య విషయాల బోధన విషయంలో అభివృద్ధి పరచ బడ గలవు. రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలలోను స్వల్ప కాలిక సర్టిఫికెట్టు కోర్సును నడపడం ఆమోదించ బడింది. ఈ కోర్సులలో శిక్షణకై 300 మంది ఉపాధ్యాయులను పంపే విషయం పరిశీలించ బడుతున్నది. 10,11 తరగతు లలో బాలికలకు స్టయిపెండులనిచ్చే పథకం మరి 3 వేల మందికి వర్తింప చేయ బడుతుంది. రాష్ట్రంలోని ప్రభుత్వే తర సెకండరీ పాఠశాలలకు భవనాలు, కుర్చీలు ఏగైరా సామానులకై గ్రాంటుల నిమిత్తం 5.93 లక్షలు కేటాయించ బడినవి. తెలంగాణా ప్రాంతంలో సెకండరీ పాఠశాలలను పునర్వర్గీకరించి, ఆంధ్ర విద్యా విషయక నిబంధనావళి ననుసరించి అన్ని తరగతుల క్రింద అవసరమయిన సిబ్బంది అవసరాలను గురించి తెలుసు కోవలసి ఉన్నది. ఇది అక్కడ జరుగ వలసిన ముఖ్య సంస్కరణ. బడ్జెటు సంవత్సరంలో యీ సంస్కరణను ప్రవేశ పెట్టాలని సంకల్పించ బడింది. ఇందుకు అవసరమయిన అదనపు సిబ్బందిలో కొంతకు వసతి కల్పించ బడింది. కర్నూలు ప్రభుత్వ శిక్షణా కళాశాలలో ఎమ్. ఇడి. కోర్సు ప్రారంభం విషయం కూడా ఆలోచనలో ఉన్నది.

## ఉన్నత విద్య

రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలు తమ తమ అభివృద్ధి పథకాలను అమలుపరుచుకొనుటకు వీలుగా దిగువ గ్రాంటులు యివ్వబడినవి లేదా యివ్వాలని సంకల్పించ బడింది:

(లక్షల రూపాయలలో)

| | 1959-60 | 1960-61 |
|---|---|---|
| 1. ఆంధ్ర విశ్వ విద్యాలయం | 3.00 | 1.00 |
| 2. శ్రీ వెంకటేశ్వరవిశ్వవిద్యాలయం | 4.00 | 3.00 |
| 3. ఉస్మానియా విశ్వవిద్యాలయం | 5.00 | 6.50 |

ఉన్నత విద్యా రంగంలో మిక్కిలి ముఖ్యమయిన సంస్కరణ 3 సంవత్సరాల డిగ్రీ కోర్సు ప్రవేశపెట్టటం. మన రాష్ట్రంలోని కళాశాలలన్నీ ఈ కొత్త పద్ధతిని అవలం బించినవి. ఈ మార్పు కవసరమయిన సౌకర్యాలన్నీ, కల్పించ బడుతున్నవి. ఈ సందర్భంలో ఖర్చు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలచే ప్రభుత్వ కళాశాలల విషయంలో చెరిసగం, ప్రభుత్వేతర కళాశాలల విషయంలో 50:25:25 నిష్పత్తిలోను భరింప బడుతున్నది. ఈ పథకం క్రింద మొత్తం 1959-60కి రు. 32.94 లక్షలు 1960-61 రు. 34.04 లక్షలు కేటాయించబడినవి. ఇందులో రాష్ట్ర ప్రభుత్వం వాటా వరుసుగా రు. 12.52 లక్షలు, రు. 10.45 లక్షలు అని అంచనా. ఈ సంవత్సరం సికిందరాబాదులో స్త్రీలకు కొత్తగా ఎయిడెడ్ కళాశాల ఒకటి ప్రారంభించ బడింది. ఖమ్మం, కరీంనగరాలలో మరి రెండు ఎయిడెడ్ కళాశాలల నిర్వహణను ప్రభుత్వం తీసుకున్నది.

## సాంకేతిక విద్య

ప్రణాళిక తొలి నాలుగు సంవత్సరాలలోను ప్రారంభ మయిన పథకాలే 1960-61లో కొనసాగుతున్నవని చెప్ప వచ్చు. ఈ పథకాలన్నీ 1960-61లో పూర్తి కాగలవని భావించ బడుతున్నది. ఇవి కాక, కేంద్ర ప్రభుత్వం మాట పై మరి రెండు కొత్త పథకాలు కూడా చేర్చ బడినవి. 1. గుంటూరులో ప్రభుత్వ పాలీటెక్నిక్ స్థాపన 2. మూడు జూనియర్ సాంకేతిక పాఠశాలల ఏర్పాటు.

## 4 సహకారం

1960-61 కార్యక్రమంలో గత ప్రణాళికా సంవత్స రాల పథకాల కొనసాగింపే కాక దిగువపనులు కూడా చేరి ఉన్నాయి. వెయ్యి కొత్త గ్రామ సంఘాల యేర్పాటు, ప్రస్తుతం ఉన్న రెండు వేల గ్రామ సంఘాల అభివృద్ధి, 25 కొత్త పరపతి యూనియన్ల ఏర్పాటు, 100 శాతం గ్రామాలు, 45 శాతం గ్రామీణ కుటుంబాలకి వ్యవసాయ పరపతి సహకార సంఘాల వర్తింపు, 30 కోట్ల రూపా యల వరకు స్వల్పకాలిక మధ్యకాలిక ఋణాల మంజూరీ, పది కొత్త ప్రాథమిక భూమి తనఖా బ్యాంకుల ఏర్పాటు, రెండు కోట్లపై చిల్లర వరకు దీర్ఘకాలిక అప్పులకు వసతి, విక్రయ సహకార సంఘాల వాటా మూల ధనంలో 25½ లక్షల వరకు ప్రభుత్వ వాటా, 47 విక్రయ సహకార సంఘాలచే గిడ్డంగులు, పెద్ద రకం సంఘాలచే 100 గ్రామీణ గిడ్డంగుల నిర్మాణం, బాగా పని చేసే గ్రామ పరపతి సంఘాల ఏర్పాటుల నిమిత్తం ఆర్థిక సహాయం మంజూరీ, సుమారు రూ. 41 లక్షలతో నిర్ణీత మయిన విక్రయ సహకార సంఘాలచే 20 ప్రోసెసింగ్

యూనిట్ల స్థాపన, సహకార విక్రయ సౌకర్యాల అభివృద్ధి, మరిపది సహకార వ్యవసాయ సంఘాల ఏర్పాటు, 655 మంది డిపార్టుమెంటల్ సబార్డినేటు సిబ్బందికి, 660 మంది అనధికార సబార్డినేటు సిబ్బందికి శిక్షణ. అలాగే ఒక లక్ష 7 వేల 2 వందల మంది గ్రామనాయకులు, సభ్యులు, పంచాయతీ దార్లలకు శిక్షణ.

పై పథకాల అమలులో 1960-61 బడ్జెటు అంచనాలలో రూ. 137.86 లక్షలు కేటాయించ బడినవి. 1959-60 లో ఈ కేటాయింపు సుమారు $112\frac{1}{2}$ లక్షలు మాత్రమే.

## 5 రహదారులు

ఈ సంవత్సరం రూ. 57 లక్షల వ్యయంపై భద్రాచలానికి సమీపంలో గోదావరిపై వంతెన నిర్మాణం తలపెట్టబడింది. విజయనగరం-పాలకొండ రోడ్డు 5/7-8 మైలు వద్ద వంతెన నిర్మాణం చాలవరకు పూర్తి అయినది. మూడు పెద్ద వంతెనలు అనగా తూర్పు గోదావరి జిల్లాలో 5వ జాతీయ రహదారి మళ్లింపు మార్గంలో గోదావరి గౌతమి పాయపై వంతెన 7వ జాతీయ రహదారి మళ్లింపు మార్గంలో కర్నూలు సమీపంలో తుంగభద్రపై వంతెన, మహబూబు నగరం జిల్లాలో 7వ. జా. ర. మళ్లింపు మార్గంలో రంగాపురం సమీపంలో కృష్ణానదిపై వంతెన నిర్మించ బడుతున్నవి గోదావరి వశిష్ఠ పాయపై పశ్చిమ గోదావరి జిల్లా సిద్ధాంతానికి సమీపంలోని వంతెన నిర్మాణం 1960-61లో చేపట్టబడగలదని భావించ బడుతున్నది. కర్నూలు జిల్లాలో రూ. 4.90 లక్షలు వ్యయం పై 7వ. జా. ర మళ్లింపు మార్గంలో హంద్రీ నదిపై నిర్మించ బడబోయే వంతెన పని కూడా అమలుకు వస్తున్నది.

చిత్తూరు జిల్లాలోని హార్లేస్ కొండలను వేసవికేంద్రంగా అభివృద్ధి పరిచే ప్రభుత్వ విధానాన్ననుసరించి కొండపైన రోడ్ల నిర్మాణం? తదితర అభివృద్ధి పనులు 1958-59వ సంవత్సరంలో చేపట్ట బడినవి. 1959-60వ సం లో కూడా ఈ పనులు కొనసాగినవి. హార్లేస్ కొండలకు వెళ్లే రోడ్డు నిర్మాణం అరవై శాతానికి పైగా పూర్తయింది. త్వరలోనే మిగతా పని కూడా ముగుస్తుంది. రాష్ట్రంలో చక్కెర పరిశ్రమ ఇప్పుడు బాగా అభివృద్ధి జెందింది. చక్కెర ఫ్యాక్టరీ మండలాలలో రోడ్ల అభివృద్ధికై 1960-61 వ సం బడ్జెటు అంచనాలలో రూ. 20 లక్షలు కేటాయించబడినవి.

ప్రభుత్వ రోడ్ల నిర్వహణకు గాను 1960-61వ సంవత్సరానికి ప్రభుత్వం నిర్ణయించిన గ్రాంటు రూ. 205 లక్షలు. ఆర్థిక ప్రాముఖ్యం లేక అంతర్రాష్ట్రీయ ప్రాముఖ్యంగల రోడ్లపై 1960-61 వ సం.లో రు. 7.8 లక్షల మొత్తం వెచ్చించబడుతుంది.

రోడ్ల నిర్మాణానికి సంబంధించిన ముఖ్యమైన పథకాలు ఇవి:- తూర్పు గోదావరి జిల్లా భద్రాచలం ఏజెన్సీ ప్రాంతంలో మారేడుమిల్లి నుంచి చింతూరు వరకూ, చింతూరు నుంచి కూనవరం వరకు-రెండు రోడ్ల నిర్మాణం; కర్నూలు జిల్లా నల్లమలై కొండలలో దోర్నాల-శ్రీశైలం రోడ్డు; ఖమ్మం జిల్లాలోమధిర యెర్రుపాలెం రోడ్డు, ఆదిలాబాదు జిల్లాలో బోత్‌నుంచి కిన్వట్ వరకూ, హైద్రాబాదు, మహబూబ్‌నగరం జిల్లాలలో పహాడీషరీఫ్ నుంచి కల్వకుర్తి వరకు రోడ్లు.

## 6 చేనేత పరిశ్రమ

చేనేత పరిశ్రమ అభివృద్ధికి సంబంధించిన పథకాలపై 1960-61 వ సం.లో రు. 87 లక్షలు ఖర్చుపెట్టబడతాయి. 3,300 మంది చేనేత పారిశ్రామికులను కొత్తగా సహకార సంఘాలలో ప్రవేశం కల్పించడానికీ, ప్రాథమిక చేనేత పారిశ్రామికుల సహకార సంఘాలలో ఇదివరకే సభ్యులుగా వున్న 4,000 మంది వాటా మూల ధనాన్ని పెంపొందించడానికీ 1960-61 వ సం. వు కార్యక్రమంలో తలపెట్ట బడింది. సహకార బ్యాంకింగ్ వ్యవస్థ పటిష్ఠంగా లేదని ఇండియా రిజర్వు బ్యాంకు పరిగణించిన ప్రదేశాలలో ఈ సంఘాలకు పెట్టుబడి ఋణాలను మంజూరు చేసే నిమిత్తం 1960-61 వ సంవత్సరానికి రు 3 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది. ప్రస్తుతం పనిచేస్తున్న కేంద్ర విక్రయశాలలనూ సిటీ ఎంపోరియంనూ, అంతర్రాష్ట్రీయ విక్రయశాలలను ఇకముందు కూడా నిర్వహించడంతో పాటు, కొత్తగా 20 విక్రయశాలలనూ, 2 అంతర్రాష్ట్రీయ విక్రయశాలలను తెరవడానికి కూడా ఉద్దేశింపబడింది.

## 7 కార్మిక సంక్షేమ కేంద్రాలు

1959-60 వ సం.లో ఆంధ్ర ప్రాంతంలో రెండు 'ఎ'

తరగతి కార్మిక సంక్షేమ కేంద్రాలూ, తెలంగాణా ప్రాంతంలో ఒక 'బి' తరగతి కేంద్రం అద్దె భవనాలలో నెలకొల్పబడినవి. ఇవి గుంటూరు, విశాఖపట్నం, సీతాఫల్ మండి, (సికింద్రాబాదు)లలో తెరువబడినవి. సిర్పూర్ కాగజ్‌నగర్‌లో త్వరలో మరో 'బి' తరగతి కేంద్రం తెరువబడుతుంది. నివేశన స్థలాలను సంపాదించడంలో ఇబ్బందులు ఏర్పడినందున ఈ కేంద్రాలకు భవనాలను నిర్మించే పని 1959-60లో చేపట్టబడలేదు. నివేశన స్థలాలు ప.వ. శాఖకు స్వాధీనపరచబడిన వెంటనే నిర్మాణాలను ప్రారంభించడానికి అవసరమైన చర్యలన్నీ గైకొనబడినవి. 1960-61 లో కొత్తగా కేంద్రాలు తెరువబడవు. భవనాల నిర్మాణం పూర్తి చేయబడుతుంది. ప్రస్తుతం ఇద్దరు కార్మిక శాఖాధికార్లు కలకత్తాలో స్వల్పకాలిక సోషల్ కోర్సులో శిక్షణ పొందుతున్నారు. బడ్జెటులో ప్రత్యేకించబడిన ప్రకారం 1960-61వ సం.లో కూడా ఒకరు లేదా ఇద్దరు అధికార్లను శిక్షణ నిమిత్తం కలకత్తాకు పంపించడానికి ఉద్దేశింప బడింది.

పారిశ్రామిక భద్రత, వస్తూత్పత్తి కేంద్రాన్నొకదానిని నిర్మించడానికి 1960-61వ సం.పు బడ్జెటులో రూ. 50,000ల మొత్తం కేటాయించబడింది. దీనికి కావలసిన సామగ్రి తదితర ఖర్చులకై పారిశ్రామిక వేత్తల నుంచి విరాళాలను సేకరించాలని ఉద్దేశింపబడింది. ఇప్పటివరకూ పారిశ్రామిక వేత్తల నుంచి ముఖ్యంగా చిన్న ఫ్యాక్టరీ యజమానుల నుంచి రూ. 36,000ల రొఖ్ఖం విరాళంగా లభించింది, పెద్ద ఫ్యాక్టరీల యజమానుల నుంచి సుమారు రు. 60,000ల విరాళం దొరకవచ్చని ఆశించబడుతున్నది. రూ. 30,000లు విలువ చేసే యంత్ర పరికరాలు లభించినవి. ఆయా పరిశ్రమల నుంచి అవి అప్పుడే ఫ్యాక్టరీల చీఫ్ ఇనస్పెక్టరు అధీనమయినవి.

ఈ పథకం వ్యయం ఇప్పుడు 2—2½లక్షల మధ్య వుండవచ్చని అంచనా. మూడవ ప్రణాళికలో భారత ప్రభుత్వ సహాయంతో ఇది విస్తరింపబడుతుంది.

సబ్సిడైజుడు పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో రూ. 50.34 లక్షల అంచనా వ్యయంతో 1478 పారిశ్రామిక గృహాలను నిర్మించడానికి తలపెట్టబడింది.

1960-61 వ సం. లో మొత్తం 168 ఇండ్లు—గుంటూరులో 50, విశాఖపట్నంలో 50, కాళహస్తిలో 68 నిర్మించబడతాయి.

సబ్సిడైజుడు పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతానికి 1960-61 వ సంవత్సరానికై ప్రభుత్వం రూ. 10.36 లక్షల మొత్తాన్ని కేటాయించింది. రెండవ ప్రణాళికలో 31-12-1959 వరకు మొత్తం రూ. 20.59 ల వ్యయం జరిగింది.

## బాల నేరస్థులకు పాఠశాలలు

1960-61 వ సంవత్సరంలో విశాఖపట్నంలో బాల నేరస్థుల నిర్బంధానికై ఒక బోర్‌స్టల్ పాఠశాల, హైద్రాబాదులో బాలుర కొరకు ఒక జూనియర్ సర్టిఫైడ్ పాఠశాల, బాలల చట్టం క్రింద కోర్టు చేత స్వాధీనపరచబడిన బాలికలను నిర్బంధంలో వుంచడానికై ఒక బాలికల సర్టిఫైడ్ పాఠశాల ఒక రిమాండ్ హోం తెరువబడతాయి,

## 8. మహిళా సంక్షేమం

అనాథ స్త్రీల కొరకు హైద్రాబాదు, అనంతపురాలలో రెండు సర్వీస్ హోమ్‌లు తెరువబడినవి. ఇవి 1960-61 సంవత్సరంలో కూడా నిర్వహించబడతాయి. గిరిజన స్త్రీల ప్రయోజనార్థం పశ్చిమ గోదావరి జిల్లా కన్నాపురంలో ఇటువంటిదే మరొకటి తెరువబడింది. ఇది 1960-61వ సంవత్సరంలో కూడా నిర్వహింపబడగలదు. వీటి నిమిత్తం రూ. 2.52 లక్షలు కేటాయింపబడినవి.

కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డలో ఒక సర్వీసు హోమ్ (అరుంధతి శరణాలయం) ప్రారంభించ బడింది. దీనిని స్థానిక మహిళా మండలి నిర్వహిస్తున్నది. దీనిలో వుంటున్న వారికి ఒక్కొక్కరికి నెలకి రూ. 45ల చొప్పున ఈ మండలికి గ్రాంటు ఇవ్వబడుతున్నది. ఇకమీదటకూడా ఈ సంస్థ పని చేయడానికి రూ. 0.160 లక్షలు కేటాయించబడినవి. దీనిలో 30 మంది వుంటారు.

ఫీల్డు సిబ్బందికి ఆధునిక పద్ధతులలో సాంఘిక సమస్యల పరిష్కారంలో శిక్షణ ఇవ్వడానికి హైద్రాబాదులో ఒక సంస్థ స్థాపించబడింది. 1960-61 వ సంవత్సరంలో 30 మంది అభ్యర్థినులకు మహిళా సంక్షేమ ఆర్గనైజరుగా శిక్షణ ఇవ్వడానికి తలపెట్టబడింది. ఇందుకుగాను రూ. 0.510 లక్షలు కేటాయించబడినవి.

వెనుకబడిన తరగతులు, స్వల్పాదాయంగల వర్గాలకు చెందిన విద్యావంతులైన స్త్రీలలో నిరుద్యోగ సమస్య వృత్తి శిక్షణా కేంద్రాల స్థాపనతో తగ్గించవచ్చు. ఇటువంటి కేంద్రాలు శ్రీకాకుళం, ఏలూరు, కడప, అనంతపురాలలో తెరువబడినవి. వీటిలో టైప్‌రైటింగ్, షార్ట్‌హాండ్, బుక్ కీపింగ్, సెక్రటేరియల్ కోర్సు వంటి సాంకేతిక కోర్సులు బోధించబడతాయి. వసతి గృహ సౌకర్యాలతో సహా కర్నూలులో కూడా ఒక కేంద్రం తెరువబడుతుంది. ప్రస్తుత కేంద్రాలను ముందుకూడా నిర్వహించడానికై రూ. 0.650 లక్షలు కేటాయించబడినవి. శ్రీకాకుళంలోని కేంద్రానికి మాత్రమే వసతి గృహ సౌకర్యం వుంది. కడప, ఏలూరు అనంతపురాలలోని కేంద్రాలకుకూడా ఈ సౌకర్యాలను కల్పించే నిమిత్తం రూ. 0.200 లక్షలు ప్రత్యేకింపబడినవి.

ప్రణాళికా పథకాల అమలు సందర్భంగా పని పెరిగిపోయి అదనపు సిబ్బంది అవసరమైనందున రాజధానిలోనూ, జిల్లాలలోనూ అదనంగా కొంత సిబ్బంది నియమించబడినారు. ఇందుకు రూ. 0.870 లక్షలు కేటాయించబడినవి.

సర్వీస్ హోమ్‌ల నుంచి పంపివేయబడిన కొందరికి, వారు ఏదైనా వ్యాపారాన్ని ప్రారంభించడానికి వీలుగా కొంత ధన సహాయం చేయడానికి రూ. 0.100 లక్షలు ప్రత్యేకించబడినవి. వృద్ధులు, వ్యాధి పీడితులు అయిన కొందరు స్త్రీలకుకూడా ఈ అవకాశం కల్పించబడుతుతుంది.

ఆంధ్ర ప్రాంతంలోని ఈ శాఖయొక్క 12 బ్రాంచిలను అభివృద్ధి పరచడానికి రూ. 0.20 లక్షలు కేటాయించబడినవి. ఈ మొత్తంతో అవసరమైన సామగ్రి వగైరా సమకూర్చబడతాయి. 1959-60 వ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో తెరువబడిన 10 మహిళా సంక్షేమ బ్రాంచిలు ఇక ముందుకూడా పని చేస్తాయి. స్త్రీ వ్యవసాయ కార్మికుల పిల్లలకై రెండు క్రెచీలు పని చేస్తాయి. ఈ పథకానికై రూ. 0 600 లక్షలు కేటాయించబడినవి.

1960-61 వ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో మూడు వృత్తి శిక్షణా కేంద్రాలు తెరువబడతాయి ఇందుకై రూ. 0 560 లక్షలు కేటాయించబడినవి మూడవ ప్రణాళికలో తలపెట్టబడిన పథకాలను అమలుపరచడానికి విస్తృతంగా శిక్షణ పొందిన ఫీల్డ్ వర్కర్ల అవసరం వుంది. కాబట్టి అన్ని వర్గాలకు చెందిన ఫీల్డు సిబ్బందికి శిక్షణ ఇవ్వడానికి గాను మూడవ ప్రణాళికలో 3.00 లక్షలు కేటాయించ బడినవి. మూడవ ప్రణాళిక ప్రారంభమయ్యే నాటికి సుశిక్షితులైన సిబ్బందిని సిద్ధంగా వుంచడానికి వీలుగా ఈ పథకాన్ని ఒక సంవత్సరం ముందుగానే 1960-61 వ సంవత్సరంలో అమలుపరచడానికి తలపెట్టబడింది. ఈ కాలంలో లక్ష రూపాయలు ఖర్చు చేయబడతాయి.

సోషల్, మోరల్ హైజీన్, అనంతర శ్రద్ధ కార్యక్రమాల క్రింద హైద్రాబాదు రాజమండ్రీలలో రెండు రాష్ట్ర అనంతర శ్రద్ధా సదనాలు తెరువబడినవి. మొదటిది బాలికల రెస్క్యూహోమ్. రెండవది నాన్ కరెక్షనల్ సంస్థల నుంచి విడిచిపెట్టబడిన స్త్రీలకు ఉద్దేశింపబడింది. కరెక్షనల్ సంస్థల నుంచి విడిచిపెట్టబడిన మహిళల కొరకు కర్నూలులో మరొక సదనం తెరువబడుతుంది. ఇటువంటి సంస్థలో చేరిన స్త్రీలకు పునరావాసం కల్పించే పథకం క్రింద, హైద్రాబాదు, రాజమండ్రీలలోని సదనాలకు శిక్షణ-ఉత్పత్తి యూనిట్లు కూడా చేర్చబడతాయి ఈ రెండు చోట్ల కూడా సుద్ద కణికలు వగైరా తయారు చేయబడతాయి. ఇంతే గాకుండా హైద్రాబాదు కేంద్రంలో కుట్టుపని, రంగుదారాల కుట్టుపని ఉడుపులను తయారు చేసే పని ప్రవేశపెట్టబడతాయి. ఇదే విధంగా రాజమండ్రీ కేంద్రంలో కవర్లనూ, కాగితం సంచులను తయారు చేసే పనులు చేపట్టబడతాయి ఒక చిన్న అచ్చు యంత్రం నెలకొల్పబడుతుంది, ఈ రాష్ట్ర సదనాలు మూడింటికి రూ. 2 లక్షలు కేటాయించబడినవి.

విపత్తు నుంచి సంరక్షింపబడే మహిళలకు కొద్ది కాలం నివసించే గృహాలుగా ఉపయోగపడడానికి జిల్లా షెల్టర్లు ఉద్దేశింపబడినవి. వారు వీటిలో కొంత కాలం ఉంచబడిన తరువాత వారి వారి వర్గాన్ని బట్టి ఆయా స్టేట్ హోమ్‌లకు పంపించబడతారు. జిల్లా షెల్టర్లు విశాఖపట్నం, ఏలూరు, విజయవాడ, సంగారెడ్డిలలో నెలకొల్పబడినవి. 1960-61 వ సంవత్సరంలోకూడా ఇవి పనిచేస్తాయి. ఇందు నిమిత్తం రూ. 1.270 లక్షలు కేటాయింపబడినవి.

ఈ శాఖ కార్యకలాపాల వల్ల కలుగు ప్రయోజనాలను మారుమూల గిరిజన ప్రాంతాలకు కూడా విస్తరింపజేసే ఉద్దేశంతో రెండవ ప్రణాళికా కాలంలో విశాఖపట్నం జిల్లా సీతంపేట తూర్పు గోదావరి జిల్లా చర్ల, పశ్చిమ గోదావరి జిల్లా బుట్టాయిగూడెం, రేపల్లెవాడలలో బ్రాంచిలు

ఏర్పాటు చేయబడినవి. చెంచు స్త్రీల సంక్షేమార్థం కర్నూలు జిల్లా బైరూటిలో ఒక బ్రాంచి తెరువబడింది బ్రాంచిలన్నీ 1960-61 వ సంవత్సరంలో కూడా పని చేస్తాయి. ఇంతే గాకుండా అదనంగా మూడు క్రొత్త బ్రాంచిలు కూడా తెరుపబడతాయి. ఇందుకై రూ. 0.801 లక్షల మొత్తం కేటాయించబడింది. గిరిజన ప్రాంతాలలో పని చేసే ఫీల్డు సిబ్బంది కొరకు రెఫ్రెషర్ కోర్సును నిర్వహించడానికి రూ. 0.20 లక్షలు కేటాయించబడినవి.

దుర్బలులు, వ్యాధిగ్రస్తుల సాంఘిక సహాయ పథకం క్రింద. అటువంటి వారికి, వారి జీవనోపాధికి ఏదైనా వ్యాపారాన్ని ప్రారంభించడానికి వీలుగా కొంత ధన సహాయం చేయబడుతుంది. ఇందు కొరకు రు. 0.100 లక్షలు కేటాయింపబడినవి.

## 9 గణాంకములు

"గణాంకములు" ఉపపద్దు క్రింద పథ్నాలుగు ప్రణాళికా పథకాల కొరకుగాను సవరించబడిన రెండవ ప్రణాళికా ళికా కేటాయింపు మొత్తం రు. 17.81 లక్షలు. ఈ పథ్నాలుగు పథకాలలోనూ క్వాలిటేటివ్ ఇవాల్యుయేషన్ సర్వేకి సంబంధించిన ఒక పథకం 1958-59 నాటికి ముగించబడినది. మిగతా 13 పథకాలు 1960-61 ప్రణాళికలో చేర్చబడినవి. గణాంక పథకములపై మొదటి మూడు సంవత్సరాలలోను రు. 2.69 లక్షలు ఖర్చు పెట్టబడినవి. "గణాంకముల" కు సంబంధించిన 13 పథకాలను అమలు పరచడానికై 1960-61 వ సంవత్సరపు ప్రణాళికలో రు. 8.48 లక్షలు కేటాయించబడినవి. ''వ్యవసాయోత్పత్తి'' ఉపపద్దుకు సంబంధించిన రెండు ఇతర గణాంక పథకాలను కూడా ఆర్థిక, గణాంకముల శాఖ అమలుపరుస్తున్నది. ఇందుకై "గణాంకములు" ఉపపద్దు క్రింద చేసిన కేటాయింపు గాక అదనంగా రు. 0.42 లక్షలు 1960-61వ సంవత్సరపు ప్రణాళికలో కేటాయించబడినవి.

——:*:——

అడుసు తొక్కనేల కాలు కడుగనేల?

* * *

దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి.

* * *

ఉట్టి కెగర లేనమ్మ స్వర్గాని కెగిరిందట.

# జిల్లాల వార్తలు

## ఆదిలాబాద్

**ప్రజల విరాళంతో 'యెక్సరే' యంత్రం :**- హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రిలో 'ఎక్సరే' యంత్రం ఏర్పాటు చేయటానికి ఆదిలాబాద్ ప్రజలు రు. 30 వేలు విరాళం ఇచ్చారు.

**సమితి అధ్యక్షుల సమావేశం :**- పంచాయితీ సమితుల అధ్యక్షులు సమితుల బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్ల సమావేశం మార్చి 3వ తేదీన కడంలో జరిగింది.

**జిల్లా పశు ప్రదర్శనం:**- మహా శివరాత్రి సందర్భంగా ఫిబ్రవరి 25 నుండి 27వ తేదీ వరకు బాసార్‌లో జిల్లా ప్రదర్శనం నిర్వహించ బడింది. ఈ సందర్భంగానే ఏర్పాటు చేయబడిన ఎగ్జిబిషన్‌లో జిల్లాలోని వివిధ శాఖలు పాల్గొన్నవి.

**ద్వితీయ విద్వద్గోష్ఠి:**- ఆదిలాబాద్‌లో మార్చి 6.7 తేదీలలో జిల్లా ద్వితీయ పాటల, నాటకాల గోష్ఠి జరిగింది. "అందరి ఆనందం" అనే నాటకం ప్రదర్శించిన మంచిర్యాల ఉన్నత పాఠశాల విద్యార్థులకు ప్రథమ బహుమతి లభించింది.

## చిత్తూరు

**పిల్లల విహార యాత్ర:**- పల్లిపాడు బ్లాక్ పంచాయతీలలోని వివిధ "బాల సభలకు" చెందిన 50 మంది సభ్యులతో ఫిబ్రవరి 11 నుండి 13వ తేదీ వరకు విహార యాత్ర ఏర్పాటు చేయబడింది. ఈ జట్టు మద్రాసు, మహాబలిపురం సందర్శించారు. పిల్లలు దీనికి గాను రు. 315లు విరాళంగా యిచ్చారు. పంచాయతీ సమితి సభ్యురాలు శ్రీమతి కె. నారాయణమ్మ విహారయాత్రకు నాయకత్వం వహించింది.

## గుంటూరు

**స్త్రీల శిక్షణ కేంద్రం:**- రాజుపాలెం బ్లాకు కోనూరు గ్రామంలో జనవరి 6వ తేదీ నుండి 8 వరకు స్త్రీలకు ప్రత్యేకంగా గ్రామ సహాయక శిక్షణా కేంద్రం నిర్వహించ బడింది. బ్లాకులోని వివిధ గ్రామాలకు చెందిన 50 మంది మహిళలు శిక్షణ పొందారు. స్త్రీల, పిల్లల సంక్షేమం, మాతాశిశు, గృహ శాస్త్రం మొదలగు విషయాలలో తరగతులు నిర్వహింప బడినవి.

**అమరావతిలో మేళా:**- తాడికొండ పంచాయతీ సమితిలోని అమరావతి గ్రామంలో ఫిబ్రవరి 21 నుండి 26వ తేదీ వరకు మేళా నిర్వహించ బడింది.

## హైదరాబాద్

**పాఠశాల ప్రారంభోత్సవం:**- చేవెళ్ల బ్లాకులోని రేగడ దోసవాడ గ్రామంలోని పాఠశాలా భవనానికి ఫిబ్రవరి 23వ తేదీన ఉప ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## కరీంనగర్

**జిల్లా బడ్జెట్:**- ప్రభుత్వ శాఖల భవనాల మరమ్మతులకు రు. 15 వేలు, సెకండరీ విద్యకు రు. 3,97,802లు, ఆరోగ్య, పారిశుద్ధ్య కార్యక్రమాలకు రు. 21,177 లు, ప్రాథమిక విద్యకు రు. 26 వేలు జిల్లా పరిషత్తు బడ్జెట్‌లో మంజూరు అయినవి.

## ఖమ్మం

**లక్ష్యాన్ని మించిన పొదుపు ఉద్యమం వసూళ్ళు:**- చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం క్రింద యీ సంవత్సరం యింత వరకు ఖమ్మం జిల్లాలో రు. 16,49,408 లు వసూలు అయింది. నిర్దేశించిన లక్ష్యం రు. 15 లక్షలే. వసూళ్లలో చాలా భాగం సింగరేణి బొగ్గు గనుల కార్మికుల వద్ద నుండి లభించింది.

**అంబర్ చరఖా పరిశ్రమాలయం:**- ఫిబ్రవరి 11వ తేదీన ఖమ్మంలో అంబర్ చరఖా పరిశ్రమాలయానికి రాష్ట్ర హోంశాఖా మాత్యులు ప్రారంభోత్సవం చేశారు.

తరగతి కార్మిక సంక్షేమ కేంద్రాలూ, తెలంగాణా ప్రాంతంలో ఒక 'బి' తరగతి కేంద్రం అద్దె భవనాలలో నెల కొల్పబడినవి. ఇవి గుంటూరు, విశాఖపట్నం, సీతాఫల్ మండి, (సికింద్రాబాదు)లలో తెరువబడినవి. సిర్పూర్ కాగజ్‌నగర్‌లో త్వరలో మరో 'బి' తరగతి కేంద్రం తెరువబడుతుంది. నివేశన స్థలాలను సంపాదించడంలో ఇబ్బందులు ఏర్పడినందున ఈ కేంద్రాలకు భవనాలను నిర్మించే పని 1959-60లో చేపట్టబడలేదు. నివేశన స్థలాలు ప.వ. శాఖకు స్వాధీనపరచబడిన వెంటనే నిర్మాణాలను ప్రారంభించడానికి అవసరమైన చర్యలన్నీ గైకొనబడినవి. 1960-61 లో కొత్తగా కేంద్రాలు తెరువబడవు. భవనాల నిర్మాణం పూర్తి చేయబడుతుంది. ప్రస్తుతం ఇద్దరు కార్మిక శాఖాధికార్లు కలకత్తాలో స్వల్పకాలిక సోషల్ కోర్సులో శిక్షణ పొందుతున్నారు. బడ్జెటులో ప్రత్యేకించబడిన ప్రకారం 1960-61వ సం.లో కూడా ఒకరు లేదా ఇద్దరు అధికార్లను శిక్షణ నిమిత్తం కలకత్తాకు పంపించడానికి ఉద్దేశింప బడింది.

పారిశ్రామిక భద్రత, వస్తూత్పత్తి కేంద్రాన్నొకదానిని నిర్మించడానికి 1960-61వ సం.పు బడ్జెటులో రూ. 50,000ల మొత్తం కేటాయించబడింది. దీనికి కావలసిన సామగ్రి తదితర ఖర్చులకై పారిశ్రామిక వేత్తల నుంచి విరాళాలను సేకరించాలని ఉద్దేశింపబడింది. ఇప్పటివరకూ పారిశ్రామిక వేత్తల నుంచి ముఖ్యంగా చిన్న ఫ్యాక్టరీ యజమానుల నుంచి రూ. 36,000 ల రొఖ్ఖం విరాళంగా లభించింది, పెద్ద ఫ్యాక్టరీల యజమానుల నుంచి సుమారు రు. 60,000ల విరాళం దొరకవచ్చుని ఆశించబడుతున్నది. రూ. 30,000లు విలువ చేసే యంత్ర పరికరాలు లభించినవి. ఆయా పరిశ్రమల నుంచి అవి అప్పుడే ఫ్యాక్టరీల చీఫ్ ఇనస్పెక్టరు అధీనమయినవి.

ఈ పథకం వ్యయం ఇప్పుడు 2—2½లక్షల మధ్య వుండ వచ్చని అంచనా. మూడవ ప్రణాళికలో భారత ప్రభుత్వ సహాయంతో ఇది విస్తరింపబడుతుంది.

సబ్సిడైజుడు పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో రూ. 50.34 లక్షల అంచనా వ్యయంతో 1478 పారిశ్రామిక గృహాలను నిర్మించడానికి తలపెట్ట బడింది.

1960-61 వ సం. లో మొత్తం 168 ఇండ్లు—గుంటూరులో 50, విశాఖపట్నంలో 50, కాళహస్తిలో 68 నిర్మించ బడతాయి.

సబ్సిడైజుడు పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతానికి 1960-61 వ సంవత్సరానికై ప్రభుత్వం రూ. 10.36 లక్షల మొత్తాన్ని కేటాయించింది. రెండవ ప్రణాళికలో 31-12-1959 వరకు మొత్తం రూ. 20 59 ల వ్యయం జరిగింది.

## బాల నేరస్థులకు పాఠశాలలు

1960-61 వ సంవత్సరంలో విశాఖపట్నంలో బాల నేరస్థుల నిర్బంధానికై ఒక బోర్‌స్టల్ పాఠశాల, హైదరాబాదులో బాలుర కొరకు ఒక జూనియర్ సర్టిఫైడ్ పాఠశాల, బాలల చట్టం క్రింద కోర్టు చేత స్వాధీనపరచబడిన బాలికలను నిర్బంధంలో వుంచడానికై ఒక బాలికల సర్టిఫైడ్ పాఠశాల ఒక రిమాండ్ హోం తెరువబడతాయి.

## 8. మహిళా సంక్షేమం

అనాథ స్త్రీల కొరకు హైదరాబాదు, అనంతపురాలలో రెండు సర్వీస్ హోమ్‌లు తెరువబడినవి. ఇవి 1960-61 సంవత్సరంలో కూడా నిర్వహించబడతాయి. గిరిజన స్త్రీల ప్రయోజనార్థం పశ్చిమ గోదావరి జిల్లా కన్నాపురంలో ఇటువంటిదే మరొకటి తెరువబడింది. ఇది 1960-61వ సంవత్సరంలో కూడా నిర్వహింపబడగలదు. వీటి నిమిత్తం రూ. 2.52 లక్షలు కేటాయింపబడినవి.

కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డలో ఒక సర్వీసు హోమ్ (అరుంధతి శరణాలయం) ప్రారంభించ బడింది. దీనిని స్థానిక మహిళా మండలి నిర్వహిస్తున్నది. దీనిలో వుంటున్న వారికి ఒక్కొక్కరికి నెలకి రూ. 45ల చొప్పున ఈ మండలికి గ్రాంటు ఇవ్వబడుతున్నది. ఇకమీదటకూడా ఈ సంస్థ పని చేయడానికి రూ. 0.160 లక్షలు కేటాయించబడినవి. దీనిలో 30 మంది వుంటారు.

ఫీల్డు సిబ్బందికి ఆధునిక పద్ధతులలో సాంఘిక సమస్యల పరిష్కారంలో శిక్షణ ఇవ్వడానికి హైదరాబాదులో ఒక సంస్థ స్థాపించబడింది. 1960-61 వ సంవత్సరంలో 30 మంది అభ్యర్థినులకు మహిళా సంక్షేమ ఆర్గనైజరుగా శిక్షణ ఇవ్వడానికి తలపెట్టబడింది. ఇందుకుగాను రూ. 0.510 లక్షలు కేటాయించబడినవి

వెనుకబడిన తరగతులు, స్వల్పాదాయంగల వర్గాలకు చెందిన విద్యావంతులైన స్త్రీలలో నిరుద్యోగ సమస్య వృత్తి శిక్షణా కేంద్రాల స్థాపనతో తగ్గించవచ్చు. ఇటువంటి కేంద్రాలు శ్రీకాకుళం, ఏలూరు, కడప, అనంతపురాలలో తెరువబడినవి. వీటిలో టైపురైటింగ్, షార్ట్‌హాండ్, బుక్ కీపింగ్, సెక్రటేరియల్ కోర్సు మొదలైన సాంకేతిక కోర్సులు బోధించబడతాయి. వసతి గృహ సౌకర్యాలతో సహా కర్నూలులో కూడా ఒక కేంద్రం తెరువబడుతుంది. ప్రస్తుత కేంద్రాలను ముందుకూడా నిర్వహించడానికై రూ. 0.650 లక్షలు కేటాయించబడినవి. శ్రీకాకుళంలోని కేంద్రానికి మాత్రమే వసతి గృహ సౌకర్యం వుంది. కడప, ఏలూరు అనంతపురాలలోని కేంద్రాలకుకూడా ఈ సౌకర్యాలను కల్పించే నిమిత్తం రూ. 0.200 లక్షలు ప్రత్యేకింపబడినవి.

ప్రణాళికా పథకాల అమలు సందర్భంగా పని పెరిగిపోయి అదనపు సిబ్బంది అవసరమైనందున రాజధానిలోనూ, జిల్లాలలోనూ అదనంగా కొంత సిబ్బంది నియమించబడినారు. ఇందుకు రూ. 0.870 లక్షలు కేటాయించబడినవి.

సర్వీస్ హోమ్‌ల నుంచి పంపివేయబడిన కొందరికి, వారు ఏదైనా వ్యాపారాన్ని ప్రారంభించడానికి వీలుగా కొంత ధన సహాయం చేయడానికి రూ. 0.100 లక్షలు ప్రత్యేకించబడినవి. వృద్ధులు, వ్యాధి పీడితులు అయిన కొందరు స్త్రీలకుకూడా ఈ అవకాశం కల్పించబడుతుతుంది.

ఆంధ్ర ప్రాంతంలోని ఈ శాఖయొక్క 12 బ్రాంచిలను అభివృద్ధి పరచడానికి రూ. 0.20 లక్షలు కేటాయించబడినవి. ఈ మొత్తంతో అవసరమైన సామగ్రి వగైరా సమకూర్చబడతాయి. 1959-60 వ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో తెరువబడిన 10 మహిళా సంక్షేమ బ్రాంచిలు ఇక ముందుకూడా పని చేస్తాయి. స్త్రీ వ్యవసాయ కార్మికుల పిల్లలకై రెండు క్రెచీలు పని చేస్తాయి. ఈ పథకానికై రూ. 0.600 లక్షలు కేటాయించబడినవి.

1960-61 వ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో మూడు వృత్తి శిక్షణా కేంద్రాలు తెరువబడతాయి ఇందుకై రూ. 0 560 లక్షలు కేటాయించబడినవి మూడవ ప్రణాళికలో తలపెట్టబడిన పథకాలను అమలుపరచడానికి విస్తృతంగా శిక్షణ పొందిన ఫీల్డ్ వర్కర్లు అవసరం వుంది. కాబట్టి అన్ని వర్గాలకు చెందిన ఫీల్డు సిబ్బందికి శిక్షణ ఇవ్వడానికి గాను మూడవ ప్రణాళికలో 3.00 లక్షలు కేటాయించ బడినవి. మూడవ ప్రణాళిక ప్రారంభమయ్యే నాటికి సుశిక్షితులైన సిబ్బందిని సిద్ధంగా వుంచడానికి వీలుగా ఈ పథకాన్ని ఒక సంవత్సరం ముందుగానే 1960-61 వ సంవత్సరంలో అమలుపరచడానికి తలపెట్టబడింది. ఈ కాలంలో లక్ష రూపాయలు ఖర్చు చేయబడతాయి.

సోషల్, మోరల్ హైజీన్, అనంతర శ్రద్ధ కార్యక్రమాల క్రింద హైద్రాబాదు రాజమండ్రీలలో రెండు రాష్ట్ర అనంతర శ్రద్ధా సదనాలు తెరువబడినవి. మొదటిది బాలికల రెస్క్యూహోమ్. రెండవది నాన్ కరెక్షనల్ సంస్థల నుంచి విడిచిపెట్టబడిన స్త్రీలకు ఉద్దేశింపబడింది. కరెక్షనల్ సంస్థల నుంచి విడిచిపెట్టబడిన మహిళల కొరకు కర్నూలులో మరొక సదనం తెరువబడుతుంది. ఇటువంటి సంస్థలో చేరిన స్త్రీలకు పునరావాసం కల్పించే పథకం క్రింద, హైద్రాబాదు, రాజమండ్రీలలోని సదనాలకు శిక్షణ—ఉత్పత్తి యూనిట్లు కూడా చేర్చబడతాయి ఈ రెండు చోట్ల కూడా సుద్ద కణికలు వగైరా తయారు చేయబడతాయి. ఇంతే గాకుండా హైద్రాబాదు కేంద్రంలో కుట్టుపని, రంగుదారాల కుట్టుపని ఉడుపులను తయారు చేసే పని ప్రవేశపెట్టబడతాయి. ఇదే విధంగా రాజమండ్రీ కేంద్రంలో కవర్లనూ, కాగితం సంచులను తయారు చేసే పనులు చేపట్టబడతాయి ఒక చిన్న అచ్చు యంత్రం నెలకొల్పబడుతుంది, ఈ రాష్ట్ర సదనాలు మూడింటికి రూ. 2 లక్షలు కేటాయించబడినవి.

విపత్తు నుంచి సంరక్షింపబడే మహిళలకు కొద్ది కాలం నివసించే గృహాలుగా ఉపయోగపడడానికి జిల్లా షెల్టర్లు ఉద్దేశింపబడినవి. వారు వీటిలో కొంత కాలం ఉంచబడిన తరువాత వారి వారి వర్గాన్ని బట్టి ఆయా స్టేట్ హోమ్‌లకు పంపించబడతారు. జిల్లా షెల్టర్లు విశాఖపట్నం, ఏలూరు, విజయవాడ, సంగారెడ్డిలలో నెలకొల్పబడినవి. 1960-61 వ సంవత్సరంలోకూడా ఇవి పనిచేస్తాయి. ఇందు నిమిత్తం రూ. 1.270 లక్షలు కేటాయింపబడినవి.

ఈ శాఖ కార్యకలాపాల వల్ల కలుగు ప్రయోజనాలను మారుమూల గిరిజన ప్రాంతాలకు కూడా విస్తరింపజేసే ఉద్దేశంతో రెండవ ప్రణాళికా కాలంలో విశాఖపట్నం జిల్లా సీతంపేట, తూర్పు గోదావరి జిల్లా చర్ల, పశ్చిమ గోదావరి జిల్లా బుట్టాయిగూడెం, రేపల్లెవాడలలో బ్రాంచిలు

ఈ కేంద్రం పోలీసుల కుటుంబాల ప్రయోజనార్థం ఉద్దేశించి నిర్వహించబడుతున్నది.

## కృష్ణా

విద్యార్థులు రోడ్డు నిర్మించారు:- విజయవాడలోని యస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. కళాశాలలోని సోషల్ సర్వీసు కోర్సుకు చెందిన 27 మంది విద్యార్థులు మైలవరం పంచాయతీ సమితిలో గడ్డమ్మారు, కొండూరు గ్రామాల మధ్య కొంత భాగం రోడ్డు నిర్మించారు. జనవరి 4వ తేదీ నుండి 10వ తేదీ వరకు యీ విద్యార్థి శ్రమదాన కేంద్రం నిర్వహించబడింది. విద్యార్థులే విరాళాలిచ్చి దీనిని కొనసాగించారు.

## కర్నూలు

అహోబిలంలో మేళానిర్వహణ. రుద్రవరం పంచాయతీ సమితులు:- మార్చి 11వ తేదీ నుండి 13 వరకు సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన అహోబిలంలో మేలా జరిగింది.

11వ తేదీన రాష్ట్ర ప్రభుత్వ ప్రణాళిక, సమాచారశాఖ మాత్యులు శ్రీ పి. రంగారెడ్డిగారు ఉత్సవాలను ప్రారంభించారు.

13వ తేదీన వ్యవసాయ శాఖా మంత్రులు శ్రీ యన్. రామచంద్రారెడ్డిగారు ఉత్తమమని నిర్ణయించిన స్టాల్సుకు పశువులకు, ఆటల పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు పంచిపెట్టారు.

పశు ప్రదర్శనం:- రాష్ట్ర తృతీయ పశు ప్రదర్శనకు ముఖ్యమంత్రి ఫిబ్రవరి 2వ తేదీన కర్నూలులో ప్రారంభోత్సవం చేశారు.

## మహబూబ్‌నగర్

మధ్యాహ్న భోజన వసతి:- ధన్వాడ ప్రీ-ఎక్స్టెన్షన్‌బ్లాకులోని కోటకొండ, కొల్లంపల్లి గ్రామాలలో ఫిబ్రవరి 4వ తేదీ నుండి మధ్యాహ్న భోజన వసతి పథకం అమలుజరుపబడింది.

పాఠశాల నిర్మాణానికి గ్రామస్థుల ముందంజ:- షాద్‌నగర్ తాలూకా పెద్దదిన్నియాల గ్రామంలో యిటీవల నిర్మించిన 3 గదుల పాఠశాలా భవనానికి గాను గ్రామస్థులు మొత్తం ఖర్చులో సగభాగం భరించారు.

ప్రసూతి శాలకు విరాళం:- మార్చి 5వ తేదీన మక్తాల్‌లో ప్రసూతి కేంద్రానికి రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. ఈ తాలూకాలో కురువృద్ధు, శ్రీ ఎ. శేషయ్య శ్రేష్ఠిగారు దీని నిర్మాణానికి రు. 30 వేలు విరాళమిచ్చారు.

## నల్లగొండ

ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాక్:- మార్చి మొదటి వారంలో ఆలేరు ప్రీ ఎక్స్టెన్షన్ బ్లాకుకు ప్రారంభోత్సవం జరిగింది.

పశు వైద్యశాల:- చికడ మామిడి గ్రామంలో యిటీవల ఒక పశు వైద్య ప్రథమ చికిత్సా కేంద్రం ప్రారంభించబడింది.

రోడ్ల నిర్మాణం:- రోడ్ల అభివృద్ధి సహకార పథకం క్రింద సూర్యాపేట బ్లాకులో రెండు రోడ్ల నిర్మాణం పూర్తి అయింది.

విశ్వకర్మ వసతి గృహం:- భువనగిరిలో రు. 18 వేల ఖర్చుతో నిర్మించిన విశ్వకర్మ హాస్టలుకు ముఖ్యమంత్రి మార్చి మొదటి వారంలో ప్రారంభోత్సవం చేశారు. దీనికి శ్రీ జి. రాజయ్య గౌడ్ స్థల దానం చేశారు.

చెరువులోకి కాలువ:- ఆలేరు ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులోని మాటూరు గ్రామస్థులు స్వయం కృషితో చెరువులోకి మూడు మైళ్ల పొడవుగల కాలువ త్రవ్వుతున్నారు.

## శ్రీకాకుళం

పశుప్రదర్శనం:- శాసనసభ్యులు శ్రీకాకుళం పురపాలక సంఘాధ్యక్షులు అయిన శ్రీ పి. సూర్యనారాయణగారి అధ్యక్షత ఏర్పడిన అనధికార సంఘం వారి సహకారంతో పశుపోషణశాఖ అధ్వర్యాన జిల్లా ద్వితీయ పశుపక్ష్యాది ప్రదర్శనం ఫిబ్రవరి ప్రథమార్ధంలో శ్రీకాకుళంలో ఏర్పాటు చేయబడింది.

పాటలు, నాటకాల పోటీ:- జిల్లా ద్వితీయ పాటల, నాటకాల పోటీ శ్రీకాకుళంలోని ప్రభుత్వ కళాశాల ఆవరణలో ఫిబ్రవరి 26 నుండి 28 వరకు ఏర్పాటు చేయబడింది కళాశాలా అధ్యాపకులు శ్రీ సి. గోపాలకృష్ణమూర్తిగారు దీనికి ప్రారంభోత్సవం చేశారు. ఈ సంవత్సరం నాటకాల పోటీలో 20 ఉన్నత పాఠశాలలు పాల్గొన్నవి. రాజంలోని జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలకు ప్రథమ బహుమతి లభించింది. కుమారి ఎ. వివేకవతి సంగీతంలో ప్రథమ బహుమతి పొందింది.

## విశాఖ పట్టణం

**గజపతి నగరం బ్లాక్.** ఫిబ్రవరి 15వ తేదీ నుండి గజపతి నగరం ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాక్ ప్రారంభించ బడింది. ఈ సందర్భంలో జరిగిన సభకు శాసన సభ్యులు శ్రీ భట్టం శ్రీరామమూర్తిగారు అధ్యక్షత వహించారు.

**సబ్బవరం మేళా:-** సబ్బవరం పంచాయతీ సమితి 5వ బ్లాక్ మేళా ఫిబ్రవరి నెలలో గోటివాడ గ్రామంలో జరిగింది. ప్రదర్శిత వస్తువుల్లో ఉత్తమమైన వాటికి బహుమతులు యిచ్చారు.

**నాటకాల పోటీ:-** మార్చి 3వ తేదీ నుండి పాటల, నాటకాల పోటీ నిర్వహించ బడింది. ప్రారంభోత్సవం నాడు భారత ప్రభుత్వ సమాజ వికాస మంత్రిత్వ శాఖ డిప్యూటీ మంత్రిగారు ప్రసంగించారు. భీమునిపట్నం పురపాలకోన్నత పాఠశాల విద్యార్థులు ప్రదర్శించిన 'పల్లె వెలుగు' నాటకానికి ప్రథమ బహుమతి వచ్చింది.

**కొత్త వంతెన:-** కణితి వద్ద రు 50 వేల ఖర్చుతో నిర్మించిన వంతెనకు మార్చి 10వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది. ఈ సందర్భంలో జరిగిన సభకు శాసన సభ్యులు, జిల్లా పరిషదధ్యక్షులు అయిన శ్రీ రాజాసాగి సూర్యనారాయణ రాజుగారు అధ్యక్షత వహించారు.

## వరంగల్లు

**కొత్త నాయకత్వం:-** మార్చి 4వ తేదీ నుండి 6వ తేదీ వరకు ఇప్పగూడ గ్రామంలో గ్రామనాయక శిక్షణ కేంద్రం నిర్వహించ బడింది. జనగామ బ్లాకులోని వివిధ గ్రామాల నుండి వచ్చిన సుమారు 50 మంది శిక్షణ పొందారు.

**గిరిజన వారోత్సవం:-** నర్సంపేట బహూళార్థ సాధక ప్రాజెక్టు ప్రాంతంలోని మదిగూడెం గ్రామంలో మార్చి 1వ తేదీ నుండి గిరిజన వారోత్సవాలు నిర్వహించ బడినవి.

పిట్టా విట్టా తగువు పిల్లి తీర్చింది

* * *

పైన పటారం లోపల లొటారం

* * *

లంకజాల్లో మసుగుడుపులు

— తెలుగు సామెతలు.

# రంజాన్ నెల, ఉపవాస వ్రతం, ఈద్

హిజ్రీ కేలెండరులో తొమ్మిదవ నెల రంజాన్ మహమ్మదీయుల కెంతో ముఖ్యమయినది. మహమ్మదీయ మతంలో విశ్వాసంగల వారికి యిది అనంతాశీస్సులను కొని వస్తుందని విశ్వసించ బడుతుంది. మహమ్మదు ప్రవక్తకు తొలుదొల్త దివ్యజ్ఞానోదయమయినది యీ నెలలోనే. సర్వ ప్రాణులు భగవంతుని కుటుంబమనేం ఆ పవిత్ర గ్రంధం (ఖురానీ) తొలి సందేశం. ఈ నెల ఉపవాసాల నెలగా నిర్దేశించబడింది. ప్రతి ముస్లిము నెల నెల అంతా ఉపవాసం ఉండాలి.

ఇందువల్ల యీ నెలకు సాంఘిక జీవితంలో ఒక ప్రత్యేకత ఏర్పడింది. అసలు యీ ఉపవాస వ్రతమే ఒక వ్యవస్థ. ఇందువల్ల సమకూరే ఆధ్యాత్మిక ప్రయోజనాలకు తోడు ఐహిక జీవితంలో సైతం చక్కని శిక్షణకు అవకాశం ఉంటుంది. మహమ్మదీయ మతంలో ఉపవాసం ప్రార్థనకొక సాధనంగా పరిగణించబడుతుంది. మహమ్మదీయ మత సౌధానికి మూలస్తంభాలనదగిన పంచసూత్రాలలోను యిదొకటి. ఖురాన్ రెండవ అధ్యాయం 'బఖరీ'లో ఉపవాస వ్రత చర్య నియమాలు వివరించ బడినవి.

ఉపవాస వ్రతాన్ని దాదాపు ప్రపంచంలోని మతాలన్నీ ఉపదేశిస్తాయి. కాకపోతే దాని స్వరూప స్వభావాలలోను, గడువు కాలం వగైరాలలోను వ్యత్యాసముంటుంది. ఈ విషయాన్ని ఖురాన్ అంగీకరిస్తుంది. మహమ్మదీయులకు ముందున్న జాతులకు వలెనే వారికి కూడ ఉపవాసం నిర్దేశించబడినదని అది పేర్కొంటుంది.

ఖురాన్ నిర్దేశాల ననుసరించి రంజాన్ నెలలో నెల (వంక) పొడిచిన మరు రోజునుంచే ఉపవాస వ్రతం ఆరంభమయి ఆ నెల అంతా కొనసాగుతుంది. ప్రపంచంలో ఏ ప్రాంతంలో ఉన్నా మహమ్మదీయులకు యీ నెల ఆనంద ప్రదాయినియే. ఆఖరికి ఇతర మత నియమాలను పాటించనివారు సైతం రంజాన్ నెల అంటే అమిత గౌరవం చూపుతారు. వారు నెల నెల అంతా కాకపోయినా ముఖ్యమయిన కొన్ని రోజులలో అయినా ఉపవాస ముంటారు. రంజాన్ నెలలో కొన్ని రోజులకు విశేష ప్రాముఖ్యమున్నది. వాటిలో 27వ. రోజు ఒకటి. 26, 27ల మధ్య రాత్రికి "వైతుల్ ఖదర్" అని పేరు. ఇది వేయి నెలల కంటే ఉత్తమయినదని ఖురాన్ ఉద్ఘాటిస్తుంది. మహమ్మదీయ మత ప్రవక్త ఆ రాత్రి తొలి దివ్య సందేశాన్ని అందుకొన్నాడని చెబుతారు. కాబట్టి ఆ రాత్రి ప్రపంచానికొక కొత్త మతాన్ని-ఇస్లామ్ లేక ప్రకృతి సిద్ధమయిన మతం-ప్రసాదించింది.

ప్రపంచంలో అవతరించిన ప్రవక్తలందరూ చేసిన బోధనల సారాంశం ఒకటే. ఈ విశ్వమంతా మానవుని కొరకేనని. అలాగే మళ్లీ మానవుడు భగవంతుని నిమిత్తమేననేదే వారి బోధనల ప్రాధమిక సిద్ధాంతం. ప్రపంచ మతాల పూజయొక్క ఆశయం కూడా ఒకటే; మానవుడు ఒకవిశ్వసత్యానికి అధీనుడు అన్న విషయాన్ని అంగీకరించటమే అది.

## ప్రార్థన

దైవసేవలో ప్రార్థన (నమాజ్) ఉత్తమ మయినది. దాని తరువాత ఉత్తమ మయినది ఉపవాసం. ఇందువల్ల భక్తునికి భగవంతునితో ప్రత్యక్షంగా సంబంధమేర్పడుతుంది, మనుష పురుషునిలో అపారమయిన విశ్వాసం కలిగి తన్మూలంగా ఆత్మ విశ్వాసం కూడా వృధ పడుతుంది మరో మాటలో చెప్పాలంటే మనిషి మనో విశ్వాసం రంజాన్ ఉపవాసం ద్వారా సంవత్సరానికి ఒక నెల రోజుల పాటు పరీక్షించ బడుతుంది. ఈ పరీక్షలో నెగ్గినవారు జీవితంలో ఎటువంటి అగ్ని పరీక్షలనయినా తట్టుకోగలుగుతారు. ఈ ఉపవాస వ్రతం సాంఘిక, నైతిక అంశాలలో మిక్కిలి ప్రాముఖ్యమయినది యిదే. అవైన ఒక నెల నెల అంతా నిర్ణీత

మయిన నియమాలను పాటించడం వల్ల క్రమశిక్షణ, వేళపని వేళకు చేయడం వంటి ఉత్తమ గుణాలు ఎక్కువ అలవడతాయి. ఇవి మానవ జీవితానికి అమూల్యమయినవి గదా.

రంజాన్ నెలలో రాత్రింబగళ్లు ఒక పద్ధతి ప్రకారం జరిగే కార్యకలాపాలు ఎంతో ఆకర్షణీయంగా ఉంటాయి. ఇవి యీ నెలలో మామూలు రాత్రి ప్రార్థన అనతంరం జరిగే రాత్రి ప్రార్థన 'తరవీహ్' తో ఆరంభమవుతాయి. ఇది రంజాన్ చంద్రుని ఉదయంతో ఆరంభవుతుంది. మసీదులకు ప్రార్థనార్థం వెళ్లే వారి సంఖ్య హెచ్చుతుంది. ఒకే ప్రదేశంలోనో లేక ఒకే వీధిలోనో ఉంటూ కూడా అపరిచితులయిన వారంతా ఈ సందర్భంలో సన్నిహితులవుతారు. 'తరవీహ్' చెదిరిబదిరి ఉన్న వారి జీవితాలను ఏకం చేస్తుంది. ఈ ప్రార్థన విశేషమేమంటే ఖురాన్ అంతా ఒక 'హాఫీజ్' (ఖురాన్ కంఠతా వచ్చిన వ్యక్తి) చే గానం చేయబడుతుంది. ఖురాన్ అంతా ఒక్క రాత్రిలోనే గానం చేయబడితే, దానిని 'షబీనా' అంటారు కాని సాధారణంగా ఖురాన్‌ని కొన్ని భాగాలుగా చేసి ప్రతి రాత్రి కొన్ని భాగాల చొప్పున నెలలో పూర్తి చేస్తారు. ధనిక. పేద విభేదం లేకుండా ఆబాల వృద్ధంగా ప్రజలందరూ 'తరవీహ్' కి హాజరయి తద్వారా తమకు తెలియకుండానే నెల పొడుగునా సమష్టి క్రమశిక్షణలో శిక్షణ పొందుతారు.

'సహారి'

రాత్రి కాస్త కునుకు పట్టీ పట్టక ముందే 'సహారి' (ఉపవాస ఉపక్రమణకు ముందు చీకటితో చేసే భోజనం) కి వేళఅవుతుంది. ఈ భోజనానికి సన్నాహాలు రాత్రి 2 గంటలకు ఆరంభమవుతాయి. అప్పుడు ఇంట్లో చిన్నా పెద్దా అంతా మేల్కొని పగలు పని చేసినట్లే పని చేస్తారు పెందలకడలేచే అలవాటు లేని వారు సైతం రంజాన్ నెలలో అందుకు అలవాటు పడతారు. తెల్ల వారినది మొదలు సూర్యాస్తమయం వరకూ మంచి నీళ్లయినా త్రాగకూడదు కనుక 'సహారి' భోజనం రాత్రి నాలుగోఝామున తీసుకోబడుతుంది. ఈ భోజనం తరువాత వచ్చే ప్రార్థన పిమ్మట కొందరు కొంచెం సేపు నిద్రిస్తారు. అప్పటి నుంచి సూర్యాస్తమయము ఉపవాసాన్ని విరమించే వరకు నిత్య జీవిత వ్యవహారాలను చూసుకుంటారు. ఈ ఉపవాస వ్రత విరమణకు 'ఇఫ్తార్' అని పేరు. ఈ విధంగా నెల్లాళ్లు ఒక నియమం ప్రకారం జీవితం గడపటం వల్ల ఎట్టి నిర్బంధము లేకుండానే క్రమ శిక్షణ అలవడుతుంది. రోజూ 15 గంటల కాలం ఆకలికి, దాహానికి ఓర్చు కొన్నందున మనిషికి ఓరిమి, కష్ట సహిష్ణుత అలవడతాయి. ఆపైన లేమిచే కడుపు నిండా తిండి తిననోచుకోని వారి పరిస్థితి కూడా అర్థమవుతుంది. ఉపవాస వ్రత సమయంలో కలిగిన యీ భావాల వల్ల మానవ జాతి పట్ల సానుభూతి, ప్రేమ ఏర్పడతాయి. మానవులంతా ఒకటేననే భావం, చిత్తశుద్ధి కలుగుతాయి తద్వారా మంచిగా, పరిశుద్ధులై సహనంతో జీవించడం అలవడుతుంది. ఉపవాస వ్రతం ప్రధానాశయం యిదే. ఒక వేళ యీ ఉపవాస వ్రతం వల్ల ఎవరికైనా యిటువంటి సద్గుణాలు అలవడక పోతే అప్పుడు అది భగవత్సేవకాక కేవలం నిర్బంధమయిన ఉపవాసంగా మిగిలి పోతుంది. ప్రతి మతంలోనూ పూజ లక్ష్యం, అది ఉపవాస వ్రతం కావచ్చు. మరొకటి కావచ్చు, ఆత్మోన్నత్యసాధనమే. ఏ రకం పూజ అయినా కేవలం యిందుకు ఉపకరణం మాత్రమే చరమలక్ష్యం మానవత్వం, దీనినే ఆత్మ సాక్షాత్కారమనీ. సత్య దర్శనం లేక పరమేశ్వర సాక్షాత్కారమనీ కూడా అంటారు. ఈ సద్గుణాలు ప్రాణి కోటిలో మాన వునికి సర్వోత్కృష్టతను ప్రసాదిస్తాయి. మానవ జీవిత అభ్యుదయ పురోగమనాలకేమి, నాగరికత, సౌభ్రాతృత్వాల పెంపుకేమి యీ ఆదర్శాలు మిక్కిలి తోడ్పడతాయి.

'ఇఫ్తార్' (ఉపవాస వ్రత విరమణ) తరువాత మామూలు జీవితం ఆరంభమవుతుంది. పగలు నిషేధించబడినవి రాత్రి, చీకటితో జరిగే 'సహారి' భోజనం వరకు అనుమతించబడతాయి. ఉపవాస వ్రతం చేసే వారి గృహాలు బహు సందడిగా ఉండి వారు అప్పుడే యేదో ఘన విజయాన్ని సాధించి వచ్చారా అనిపిస్తాయి. మత నియమాల ననుసరించి ఉపవాస వ్రతం సలిపినవారు పరమానంద భరితులవుతారు. వారు పేద కుటుంబాలపట్ల శ్రద్ధ గైకొంటారు కూడా కాబట్టి యీ వ్రత దీక్షా పరులు ఆ నెలలో ఎక్కువ ఔదార్యవంతులవుతారు. ఉపవాసవ్రత విరమణ సమయంలో ఉపవాస వ్రతులకు పెట్టటానికై చుట్టుపట్ల యిళ్లవారు ఫలాలు, మిఠాయిలు వగైరా యెక్కువగా తెస్తారు. వాటితో నిండిన పళ్యాలతో మసీదులు సూర్యాస్తమయానికి ముందు "లంగర్ హౌస్" (ఉచిత కాంటీన్లు)లుగా కనబడతాయి.

ఈ నెల ముగిసిన పిదప, ఆ మరుసటి నెల మొదటి రోజు ఈద్ రోజుగా 'షావల్' పాటించబడుతుంది. గత నెలలో విజయవంతంగా శిక్షణ పొందిన ఆనందం యిప్పుడు వ్యక్తం చేయబడుతుంది.

రంజాన్ ఆఖరు రోజున నెలవంక దర్శనానికై కోట్లాది ప్రజలు ఆదుర్దాతో వేచియుంటారు. అది కనబడగానే జన ప్రవాహం ఆనందోత్సాహాలతో పరవళ్లు తొక్కుతుంది ఎందుకెల్లనంటే ఆ మరునాడే మహమ్మదీయుల పండుగలలో మిక్కిలి ముఖ్యమైన 'ఈదుల్‌ఫితర్' లేక రంజాన్ ఈద్ వస్తుంది. కాలం గడచి నాగరికత, సంస్కృతి వృద్ధి పొందడంతో యీ పండుగ విశ్వ సంస్కృతి వ్యక్తీకరణో త్సవంగా మారింది. ధనిక, పేద విభేదం లేకుండా పాల్గొనే యీ ఉత్సవంలో వాత్సల్యం, ప్రేమ, ఐక్యత, సమానత్వం వ్యక్తీకరించబడతాయి.

భారతదేశంలో ముఖ్యంగా దక్షిణ భారతంలో అన్ని జాతుల వారు యీ పండుగ ఆనందోత్సాహాలలో పాలు పంచుకుంటారు. దక్కన్‌లో కుతుబ్‌షాహీల పరిపాలనా కాలంలో వసంత పంచమి వంటి యితర భారతీయ పండుగల వలెనే రంజాన్ ఈద్ కూడా ఐక్య భారతీయ సంస్కృతికి, జాతి ఐక్యతకు చిహ్నంగా ఉండేది. ఈ సంప్రదాయం నేటి వరకు నిలబెట్టబడింది.

ఈద్ సన్నాహాలు బాగా ముందుగానే ఆరంభించ బడతాయి. ఆ రోజు సమీపించే సరికి వ్యాపార కేంద్రాలు హడావిడిగా ఉంటాయి. రంజాన్ నెలంతా సాగే బేరాలు ఈద్ రోజు ముందు రాత్రి తారాపథాన్నంటుతాయి. నగరాలు, పట్టణాలలో గల షాపులు రాత్రి తెల్లవార్లూ తెరిచి వుంటాయి. ఇళ్లలో సరేసరి, ఆభరణాలు, దుస్తులు వగైరాలను సమకూర్చుకుంటూ మనుషులు మేలుకొనే ఉంటారు. ఈద్‌కి "సివైయాన్", పాలు, పంచదారలతో ఒక తీపి పదార్థం తయారు చేయబడుతుంది. అది యీ పండుగ ప్రత్యేకత.

పెద్ద పెద్ద నగరాలలో ఈద్ ప్రార్థనలు అన్ని మసీదుల లోను జరుగుతాయి. అవి జనంతో కిట కిట లాడుతూ ఉంటాయికూడా. చిన్న పట్టణాలు, గ్రామాలలోని మహమ్మదీయులు మాత్రం ఊరేగింపుగా బయలుదేరి ఈద్‌గాకి (ఈద్ ప్రార్థనలకు ఉద్దేశించబడి పట్టణానికి ఆవల నిర్మింపబడిన మసీదుకు) వెడతారు.

ఈద్ పండుగ మరో ముఖ్యాంశం 'ఫిత్రా' అనగా ధర్మం ఆర్థిక హోదాకు చెందిన నిర్ణీత నిబంధనలను నెరవేర్చిన ప్రతి వ్యక్తి ఈద్ ప్రార్థనలకు ముందు దీనిని యివ్వాలి. ఇందువల్ల పేదవారికి కూడా యీ పండుగ సంబరం దక్కుతుంది. 'ఫిత్రా'ను యిచ్చి ఈద్ ప్రార్థనలు జరిపిన పిదప ఈద్ అభినందనలు ఆరంభమవుతాయి ప్రతివారూ చిన్నా పెద్దా విభేదం లేకుండా తమ మిత్రులందరికీ "ఈద్ ముబారక్" శుభాకాంక్షలు తెలుపుతారు.

ఈదుల్‌ఫిత్రే మహమ్మదీయుల పండుగే అయినప్పటికీ మన దేశ సాంస్కృతిక సంప్రదాయాలదృష్ట్యా అది సర్వుల పండుగ అవుతున్నది. తక్కిన భారతీయులంతా తమ ముస్లిమ్ సోదరుల ఆనందోత్సాహాలలో పాలుపంచుకుంటున్నారు.

---

చింతకాయలకాణ్ణ కాని గుటకల కాణ్ణా ?

— తెలుగు సామెత.

# ముఖ్య వార్తలు

21-2-60

వైద్య కళాశాలల్లో విద్యార్థులను చేర్చుకొనుటలో సాధ్యమైనంత వరకు తెలివి తేటలకు, యోగ్యతలకు ప్రాధాన్యమివ్వబడుతుందని కర్నూలు వైద్య కళాశాల వార్షికోత్సవానికి అధ్యక్షత వహించిన సందర్భంగా ఆరోగ్య శాఖామాత్యులు వెల్లడించారు. కులాల ప్రాతి పదికపై ప్రస్తుతం కొనసాగుతున్న ప్రవేశ పద్ధతికి మారుగా మరొక పథకాన్ని ప్రభుత్వం ఆలోచిస్తుందని ఆయన పేర్కొన్నారు,

22-2-60

కేరళలో 11 మంది సభ్యులతో కొత్త మంత్రి వర్గం ఏర్పడింది. ప్రభుత్వోద్యోగాలు యివ్వడంలో హరిజనులకూ, వెనుకబడిన వర్గాల వారికి స్థానాలు ప్రత్యేకంగా కేటాయించే పద్ధతి ప్రభుత్వం యూచా తప్ప కుండా పాటిస్తుందని ఆంధ్ర ప్రదేశ్ ముఖ్య మంత్రి హైదరాబాద్‌లో ప్రకటించారు.

23-2-60

ప్రభుత్వ సమాచార, ప్రచార యంత్రాంగాన్ని పటి ష్ఠం చేసేందుకై శ్రీ నార్ల వెంకటేశ్వరరావు అధ్యక్షతన ఏర్పడిన కమిటీ వారి సిఫార్సులు, వాటిపై ప్రభుత్వ నిర్ణయాలతో సహా ప్రకటింపబడినవి.

24-2-60

బొంబాయి రాష్ట్ర విభజనకు సంబంధించిన ఆర్థిక సమస్యలన్నిటికీ, అందరికి సంతృప్తికరమైన పరిష్కా రం కుదిరినట్లు భారత ప్రభుత్వ హోంశాఖామాత్యులు ఢిల్లీలో ప్రకటించారు.

25-2-60

వచ్చే ఆర్థిక సంవత్సరంలో రు. 1.75 కోట్ల రూపాయలు రోడ్డురవాణా సంస్థలలో పెట్టుబడి పెట్ట టానికి రైల్వే మంత్రిత్వ శాఖ వారు నిర్ణయించినట్లు వార్త. ఇందులో రు. 50 లక్షలు ఆంధ్ర ప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థలో పెట్టుబడి పెడతారు. ఆయా సంస్థలలో పెట్టే పెట్టుబడి మొత్తాలన్నింటిలో యిదే పెద్ద మొత్తం. ఈ సంస్థ పేరు ధనంలో 4 వ. వం తుగా యీ ధనం పెట్టుబడి పెట్టబడుతుంది.

26-2-60

భారతదేశానికి సంబంధించిన సర్వ వ్యవసాయ సమస్యలను క్షుణ్ణంగా పరిశీలించటానికి ఒక కమిషన్ నియమించే విషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నదని లోక సభలో ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ ఆహార, వ్యవసాయశాఖ డిప్యూటీ మంత్రి వెల్లడించారు.

27-2-60

విజయవాడ నగరంలో 500 మంచాలతో, ఆధు నిక వైద్య సౌకర్యాలతో ఒక ఆసుపత్రి త్వరలోనే స్థాపించబడుతుందని ఆంధ్ర ప్రదేశ్ ఆరోగ్య శాఖా మాత్యులు విజయవాడలో ప్రకటించారు.

28-2-60

సుమారు 12,000 మంది పంచాయతీ సమితి సభ్యులకు శిక్షణ యివ్వబడుతుందని రాష్ట్ర ప్రణాళికా శాఖామాత్యులు ప్రకటించారు. ఈ శిక్షణా శిబిరాలు ఒక్కొక్కటి 7 లేక 8 రోజులపాటు నిర్వహించ బడుతవి. జట్టుకు 50మంది చొప్పున శిక్షణ యిస్తారు.

భారత–చైనా సరిహద్దు సమస్యలను గురించి చర్చించటానికి భారత దేశానికి రమ్మని ప్రధాని శ్రీ నెహ్రూ పంపిన ఆహ్వానాన్ని చౌ-ఎన్-లై అంగీకరించినట్లు న్యూఢిల్లీ ప్రకటన.

29–2 60

భారత ప్రభుత్వ ఆర్థిక మంత్రి బడ్జెట్ ప్రవేశ పెట్టారు.

*   *   *

1–3–60

పరిపాలనా వ్యవహారాలలో సౌలభ్యం సాధించటానికి పరిపాలన సంస్కరణల సంఘాన్ని నియమించాలని ప్రభుత్వం నిశ్చయించినట్లు, బడ్జెట్ చర్చకు సమాధానమిస్తూ రాష్ట్ర ఆర్థిక మంత్రి ప్రకటించారు.

2–3–60

రాష్ట్రంలో పంటలు, పశువుల భీమా పథకం అమలుపరిచే విషయాన్ని ప్రభుత్వం శ్రద్ధగా ఆలోచిస్తున్నదని వ్యవసాయ, కార్మిక శాఖామాత్యులు శాసనసభలో వెల్లడించారు.

3–3–60

గుంటూరులో ప్రైవేటు రంగంలో ఒక సిగరెట్ ఫ్యాక్టరీకి కేంద్ర ప్రభుత్వం అనుమతి మంజూరు చేసిందని రాష్ట్ర పరిశ్రమలు, మ్యునిసిపల్ పరిపాలనా శాఖామాత్యులు శాసన సభలో ప్రకటించారు.

4–3–60

శాసన సభా కార్యాలయాన్ని ప్రభుత్వం నుండి విడదీసి స్వతంత్ర ప్రతిపత్తి కల్పించే విషయంలో పార్లమెంటులోనూ, యితర రాష్ట్రాలలోనూ అనుసరిస్తున్న విధానాలను పరిశీలించి, సభాపతి, శాసన మండలి అధ్యక్షుడు, యితర మంత్రులతో సంప్రదించి ప్రభుత్వం నిర్ణయం తీసుకుంటుందని ముఖ్యమంత్రి ప్రకటించారు. తన పద్దులకు సంబంధించిన శాసన సభ చర్చకు సమాధానమిస్తూ ఆయన యీ విషయం తెలియజేశారు.

5–3–60

బ్రహ్మాండమైన నాగార్జున సాగర్ ప్రాజెక్టును జాతీయ ప్రాజెక్టుగా పరిగణించాలని రాష్ట్ర ప్రభుత్వం చేసిన అభ్యర్థనకు కేంద్రం అంగీకరిస్తుందనీ, దానిని రాష్ట్ర ప్రణాళిక నుండి తప్పించి కేంద్ర పథకంగా నిర్వహిస్తుందనీ, తామాశిస్తున్నట్లు రాష్ట్ర పబ్లిక్ వర్క్సు శాఖామాత్యులు ప్రకటించారు. ఆనకట్ట స్థలానికి సుమారు $2\frac{1}{2}$ మైళ్ల దూరాన కుడి కాల్వ సొరంగం పనికి ప్రారంభోత్సవం చేస్తూ ఆయన యీ విషయం చెప్పారు.

భారత ప్రభుత్వ పునరావాస శాఖా మంత్రి శ్రీ మెహర్‌చంద్ ఖన్నా, హైదరాబాద్‌కు 130 మైళ్ల దూరంలో గల ఫక్రాబాద్‌లో 24 పఠాన్ కుటుంబాలకు ఉద్దేశించిన సంక్షేమ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

6–3–60

ద్వితీయ ప్రణాళిక క్రింద మంజూరైన నిధులతో ఒక్కొక్కటి రు. 40 వేల ఖర్చుతో వాల్తేరు, శ్రీశైలం, నాగార్జునసాగర్ వరంగల్లులలో 4 యువజన వసతి గృహాలు నిర్మించబడగలవని ఆంధ్ర ప్రదేశ్ కార్యాచరణ సమితి సభ్యుడు (కార్యదర్శికూడా) హైదరాబాద్‌లో వెల్లడించారు

గుంటూరు జనరల్ ఆస్పత్రిలో 40 మంచాలతో కొత్తగా ఏర్పాటుచేసిన అంగవైకల్య చికిత్సా విభాగానికి ఆరోగ్య శాఖామంత్రి ప్రారంభోత్సవం చేశారు.

7–3–60

హైదరాబాద్‌లో ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తూ, భారత–చైనా సరిహద్దు తగాదాలో భారతదేశం చైనాతో సంప్రదింపులు జరుపుతుందే గాని బేరసారాలకు దిగదని భారత రక్షణ మంత్రి ప్రకటించారు.

**8–3–60**

అభివృద్ధి కార్యక్రమాలను అమలుపరచటానికి పంచాయతీలను సాధ్యమైనంత ఎక్కువగా వినియోగించుకోవాలని ప్రభుత్వం నిశ్చయించినట్లు రాష్ట్ర ప్రణాళికా శాఖామాత్యులు అసెంబ్లీలో వెల్లడించారు.

9–3–60

గత ఏడు, ఎనిమిది నెలల్లో చైనా కొత్తగా మరా క్రమణ దాడులు ఏవీ జరుపలేదని ప్రధాన మంత్రి లోక సభలో ప్రకటించారు.

10–3–60

రాష్ట్ర ప్రణాళికా నిర్మాణ సలహా సంఘం వారు ఏర్పరచిన ఉప సంఘం రాష్ట్ర తృతీయ ప్రణాళిక రు. 509.21 కోట్ల మేరకు వుండాలని సిఫార్సు చేశారు. సమాజ వికాస కార్యక్రమం, స్థానిక అభివృద్ధి కార్య క్రమాలకు సంబంధించిన పద్దుపై శాసనసభలో జరిగిన చర్చకు సమాధానమిస్తూ రాష్ట్ర ప్రణాళిక శాఖా మాత్యులు యీ విషయం వెల్లడించారు.

11–3–60

ప్రైవేటు డాక్టర్లు, ప్రభుత్వ డాక్టర్లతో ఐచ్ఛిక ఆరోగ్య సేవా పథకాన్ని సహకార సంస్థల ద్వారా అమలుపరచాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు శాసన సభలో ఆరోగ్య శాఖా మంత్రి ప్రకటించారు.

12–3–60

తుంగభద్రా ప్రాజెక్టు కర్మాగారాన్ని నిర్వహించ టానికి ఒక కార్పొరేషన్ ఏర్పాటు చేయటానికి ఆంధ్ర ప్రదేశ్, మైసూరు ప్రభుత్వాల మధ్య అంగీకారం కుదిరిందని పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి శాసన సభలో చెప్పారు.

13–3–60

19వ ఆంధ్ర ప్రదేశ్ సహకార మహా సభకు యూనియన్ సహకార, సమాజ వికాస శాఖామాత్యులు ఏలూరులో ప్రారంభోత్సవం చేశారు.

కోనాయ గండి రిజర్వాయర్ పథకం క్రింద పని ప్రారంభమైంది. ఈ పథకం ఖర్చు అంచనా రు. 2.11 లక్షలు. గత 5 ఏండ్లుగా వరాలు లేక యిబ్బందిపడిన ప్రాంతాలకు యీ పథకం ప్రయోజనకారి. రాష్ట్ర పబ్లిక్ వర్క్సు శాఖామాత్యులు శంఖుస్థాపన చేశారు. ఈ స్థలం విజయవాడకు సుమారు 30 మైళ్ల దూరంలో వుంది.

14–3–60

ఆంధ్ర ప్రదేశ్‌లో పబ్లిక్ రంగంలో ఒక న్యూస్ ప్రింట్ ఫ్యాక్టరీ, మిశ్రమ ఔషధాల ఉత్పత్తి యంత్రము, స్వల్పోష్ణ కర్బనీకరణ యంత్రము స్థాపించ టానికి కేంద్రం అంగీకరించిందని రాష్ట్ర పరిశ్రమల శాఖామాత్యులు శాసన సభలో ప్రకటించారు.

15–3–60

తెలంగాణా హరిజన శాసన సభ్యురాలు శ్రీమతి టి. యస్. సదాలక్ష్మి శాసన సభ ఉపాధ్యక్షురాలుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడింది.

16–3–60

ఈ సంవత్సరం ఏప్రియల్ 1-వ తేదీ నుండి ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి తంతి తపాలా శాఖ ప్రత్యేక మండలం ఏర్పడుతున్నదని హైదరాబాద్‌లో పత్రికా ప్రతి నిధులతో ముచ్చటిస్తూ హైదరాబాద్ సర్కిల్ తంతి తపాలా శాఖ డైరెక్టరు వెల్లడించారు.

17–3–60

తృతీయ ప్రణాళిక కాలంలో 6–11 సంవత్సరాల వయస్సుగల పిల్లలకు ఉచిత నిర్బంధ విద్యా విధానం అమలుపరచటానికి ప్రభుత్వం నిశ్చయించినట్లు రాష్ట్ర విద్యా శాఖామాత్యులు శాసన సభలో ప్రకటించారు.

18–3–60

తృతీయ ప్రణాళిక కాలంలో నాగార్జునసాగర్ విశ్వ

విద్యాలయం స్థాపించాలని, ప్రభుత్వం ఉద్దేశిస్తున్నట్లు విద్యా మంత్రి శాసన సభలో ప్రకటించారు.

ఉన్నత పాఠశాల విద్యా స్థాయిలో సహవిద్యా విధానాన్ని ప్రోత్సహించరాదని యస్.యస్.యల్.సి. ఫలితాల విచారణ సంఘం చేసిన సిఫార్సును ప్రభుత్వం సూత్రప్రాయంగా ఆమోదించిందని కూడా ఆయన వెల్లడించారు.

19–3–60

క్రొత్త ఢిల్లీలో ప్రధాన మంత్రి అధ్యక్షతన సమావేశమైన జాతీయాభివృద్ధి మండలి, ప్రణాళికా సంఘం ప్రతిపాదించినట్లు 3 వ ప్రణాళికకు రు. 9950 కోట్ల పెట్టుబడిని ఆమోదించింది.

20–3–60

సింహళ ఆపద్ధర్మ ప్రభుత్వ ప్రధాన మంత్రి శ్రీ విజయానంద దహనాయకే అధికారము నుండి వైదొలగారు.

—:*:—

# కథానికల పోటీ

"ఆంధ్ర ప్రదేశ్" తెలుగు, ఉర్దూ సంచికలకై కథానికల పోటీ నిర్వహించబడుతుంది

ఒక్కొక్క భాషలో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలను పొందిన కథలకు వరుసగా రూ. 200, రూ. 100, రూ. 50 బహుమతులు యివ్వబడుతాయి.

కథలను టైపు చేయించి లేక చక్కని దస్తూరీలో అక్షరాలు తెలిసేట్టు వ్రాసి నాలుగు ప్రతులలో పంపాలి. అవి స్వతంత్ర రచనలయి ఉండాలి. అనువాదాలు, అనుసరణలు అంగీకరించబడవు. కథ స్వతంత్ర రచన అనీ, అది మరెక్కడా ప్రచురించబడలేదని తెలిపే రచయిత సర్టిఫికెట్టు కథతో పాటు జతచేసి పంపబడాలి.

కథ 4000 మాటలకు మించ కూడదు. ఇతివృత్తం ఆంధ్ర ప్రదేశ్‌లో ఏదో ఒక జిల్లా జీవితానికి సన్నిహితమయి, స్థానిక సంప్రదాయాలకు సంబంధించి ఉండాలి.

ఈ విషయంలో యిందు నిమిత్తం నియమించబడిన సంఘం నిర్ణయమే తుది నిర్ణయం.

కథల సమర్పణకు 1960 జూన్ 1వ తేదీ ఆఖరురోజు. ఆ తేదీ తరువాత వచ్చే కథలు పరిశీలించబడవు.

రచయిత పేరు, పూర్తి చిరునామా విడిగా ఒక కాగితంపై వ్రాయబడాలే కాని కథ ప్రతులలో యెక్కడా ఉండకూడదు.

పోటీకి పంపే కథలను ఆంధ్రప్రదేశ్ సమాచార పౌర సంబంధాల శాఖ డైరెక్టరు, హైదరాబాద్–1. చిరునామాకు పంపాలి.

# పాఠకుల లేఖలు

## 'చాలా అభివృద్ధి'

"ఆంధ్ర ప్రదేశ్" తెలుగు పత్రిక స్వరూపంలోను విషయాలలోను చాలా అభివృద్ధి కనపడు తున్నందుకు ప్రచార శాఖవారు ప్రశంసార్హులు. ఉగాది సంచిక సర్వోత్తమంగా వుంది."

శ్రీమతి లీలావతి యమ్. రావు,
బెంగుళూరు.

## "సరికొత్త పద్ధతి"

సర్వాంగ సుందరముగా వెలువడిన ప్రత్యేక సంచికయైన 'ఆంధ్ర ప్రదేశ్' చూశాను-చదివాను. ఆకర్షణీయమైన గేయాలతో రసవత్తరమైన నాటికతో, విజ్ఞానాత్మకమైన వ్యాసములతో వెలువడుట ముదావహము. రచయితల చిరునామాలిచ్చు సరికొత్త పద్ధతి ప్రవేశ పెట్టినందుకు డైరెక్టరుగారు అభినందనీయులు. ఆంధ్ర ప్రదేశ్‌కు సంబంధించిన పురాతన శిల్పాలను సుఖచిత్రాలను ప్రకటిస్తారని పాఠకుల ఆశ. పత్రికను ప్రతి నెలా మొదటి వారములో ముద్రించి పాఠకుల కంద జేయమని నా కోరిక

గుడివాడ సూర్యనారాయణ
రాజమహేంద్ర వరము.

(శిల్పాలను గూర్చి వ్యాసాలు వచ్చినప్పుడు చిత్రాలు గూడా వేస్తున్నాం.—సం)

## అవకాశం

'ఆంధ్ర ప్రదేశ్' ఉగాది ప్రత్యేక సంచిక చదివాను. వినోద కరంగాను విజ్ఞాన దాయకంగాను ఆకర్షణీయంగాను ఉన్నది. ఆంధ్ర ప్రదేశ్‌లో అభ్యుదయ కరమైన మార్పులు కళ్లకు కట్టినట్లు తెలుసుకొనే అవకాశం కల్గించి నందుకు మీకు నా హృదయ పూర్వక అభినందనములు. ఏ నెల సంచిక ఆ నెలలో వచ్చే యేర్పాట్లు చేసినందుకు ప్రజాభిమానము చూర గొన్నారు.

ఎ. రమేష్‌బాబు,
విజయవాడ.

## "అంతయు రమణీయము"

ఉగాది సంచిక 16వ తేదీనాడే అందినది. పరిశీలించితిని అందమైన ముఖపత్రము, రమ్యతరములగు కాగితములు, ముచ్చటైన ముద్రణము, సారమైన విషయ సంచయము-అంతయు రమణీయము.

కుంటిమద్ది శేషశర్మ.
ధర్మవరము.

## ఒక సలహా

పిల్లల శీర్షిక కూడా ప్రవేశ పెట్టవలెను.

పి. కొండలరావు,
అలమూరు.

(ఈ సలహా పరిశీలిస్తాం.—సం)

## ఇంకా కథలా ?

ఆంధ్ర ప్రదేశ్ ఉగాది సంచిక క్రొత్త శీర్షికలతో, కథలతో, గేయాలతో క్రొత్త తరహాతో అలంకరించుకొని వచ్చింది. కాని, గేయాలు, తెలుగు సామెతలు మెండుగా ఉన్నవి. వీటిని తగ్గించి కథలు కొంచెం ఎక్కువగా వేసిన యెడల మరింత ఆకర్షణీయంగా వుండగలదని ఆశిస్తున్నాను.

ఆర్. వి. యస్. యస్. మురళీ కృష్ణ,
రాజమండ్రి,

(కథలు ఎక్కువగా వేయటం పత్రిక ప్రధానోద్దేశానికి వ్యతిరేకం అవుతుంది.—సం.)

—:*:—

# ర చ యి త లు

శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి—విఖ్యాతకవి; ప్రస్తుతం కావలి కళాశాలలో ఉద్యోగం.

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు— జగమెరిగిన రచయిత; ప్రస్తుతం ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలోపని.

"కులపతి"—హైదరాబాదు.

శ్రీ వింజమూరి శివరామరావు—ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ఉన్నారు.

శ్రీ బొడ్డపాటి కుటుంబరాయ శర్మ, రిసర్చ్ స్కాలర్, హైదరాబాదు.

శ్రీ మెండా చినసీతారామయ్య, తెలుగు శాఖ, గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి, రాజమహేంద్రవరం.

శ్రీ ఆర్. ఆర్. తిమ్మాజీరావు, డిప్యూటి చీఫ్ ఇంజనీరు, (పబ్లిక్ హెల్త్), ఆంధ్ర ప్రదేశ్.

శ్రీ మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రి — రాజమహేంద్ర వరం.

శ్రీ జి. ఆర్. వర్మ, జర్నలిస్టు, తాడేపల్లిగూడెం.

శ్రీ పి. ఆర్. రావు--హైదరాబాదు.

శ్రీ చల్లా బ్రహ్మానందమ్—పొన్నూరు.



## పంచవర్ష ప్రణాళికపై తెలుగు పాటల పోటీ

పంచవర్ష ప్రణాళిక అభివృద్ధి కార్యకలాపాలపై తెలుగులో ఉత్తమంగా రచించిన మూడు పాటల రచయితలకు ఆలిండియా రేడియో వారు 3 బహుమతులను ఇస్తారు. ప్రథమ బహుమతి రూ. 100 లు, ద్వితీయ బహుమతి రూ. 50 లు, తృతీయ బహుమతి రూ. 25 లు. పోటీలో ఎవరైనా పాల్గొనవచ్చు. పాట పాడటానికి ఐదు నిమిషాలకు మించి రాకూడదు. పాట విషయంగాని ఉద్దేశంగాని ఏ వ్యక్తికి, కులానికి లేక మతానికీ వ్యతిరేకత సూచించేదిగా ఉండకూడదు.

పాటల ప్రతులను 3 కాపీలలో పంపాలి. కాపీలు తిరిగి పంప బడవు. ఈ పోటీకి సంబంధించిన అన్ని విషయాలలో ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం డైరెక్టరుదే తుది నిర్ణయం. రచనలు పంపేందుకు గడువు 30-4-1960.

రచనలు స్టేషన్ డైరెక్టరు, ఆలిండియా రేడియో, హైదరాబాదు-4 వారికి, అసిస్టెంటు స్టేషన్ డైరెక్టరు, ఆలిండియా రేడియో, విజయవాడ-2 వారికి ఎవరికైనా పంపవచ్చు.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | | |
|---|---|---|---|
| వైశాల్యం | .... | .... | 1,06,041 చదరపు మైళ్ళు |
| జనసంఖ్య | .... | ... | 3,12,60,133 |
| పురుషులు | .... | ... | 1,57,42,912 |
| స్త్రీలు | .... | ... | 1,55,17,221 |
| సగటు వర్షపాతం | .... | .... | 35.65 " |
| అరణ్య ప్రదేశం | .... | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | ... | 20 |
| తాలూకాలు | ... | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | ... | 1,000 |
| పట్టణాలు | .... | ... | 293 |
| గ్రామాలు | .... | ... | 26,450 |
| పంటలక్రింది ప్రదేశం | | ... | 2,93,81,000 ఎకరాలు |
| కొళ్ళ సంఖ్య | ... | ... | 42,42,655 |
| 1958-59 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | | ... | 68 లక్షల ఎకరాలు |
| 1958-59 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | | ... | 61.56 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | .... | ... | 15.5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | ... | ... | 2,902 మైళ్ళు |
| జాతీయ రహదార్లు | .... | ... | 1,409 .. |
| రాష్ట్రీ రహదార్లు | .... | ... | 2,072 .. |
| జిల్లా పెద్ద రోడ్లు | .... | ... | 2,527 .. |
| జిల్లా ఇతర రోడ్లు | .... | ... | 3,458 .. |
| పాఠశాలలు | .... | ... | 28,000 |
| కళాశాలలు | .... | ... | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | .... | ... | 31 |
| ద్వితీయ పంచ వర్ష ప్రణాళిక ప్రమాణం | | | రూ. 175.37 కోట్లు |

1960—61 బడ్జెటు:

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | ... | | రూ. 82.18 కోట్లు |
| వ్యయం | .... | ... .. | 81.98 .. |
| పెట్టుబడి ఖర్చు | ... | ... .. | 32.44 .. |

